# చలం నవలలు-
# సామాజిక చైతన్యం

( Social consciousnees in the novels of Chalam )



వెన్నవరం ఈదారెడ్డి,

ఎం. ఏ., బి. ఇడి; ఎం. ఫిల్.



కాకతీయ విశ్వవిద్యాలయం ఎం. ఫిల్. డిగ్రీకి

సమర్పింపబడిన పరిశోధన గ్రంథము

ఫిబ్రవరి 1979

ప్రథమ ముద్రణ : మే, 1980
ప్రతులు : 1000
వెల రూ. 12-00



ప్రతులకు :

1. సరస్వతీ బుక్ డిపో,
జయప్రకాశ్ నారాయణ్ రోడ్,
వరంగల్.

2. సరస్వతీ బుక్ డిపో,
చార్‌కమాన్,
హైదరాబాద్ - 2

3. బాలా బుక్ డిపో,
స్టేషన్ రోడ్, వరంగల్.

4. వి. ఈదారెడ్డి, లెక్చరర్,
ప్రభుత్వ జూనియర్ కాలేజి, హన్మకొండ.
506001



ముద్రణ :
మయూరి ప్రింటింగ్ ప్రెస్,
హన్మకొండ.

# అంకితం



సోదరి

**కీ. శే. తారమ్మకు**

ప్రేమతో....

# చలంతత్వం

శ్రీ నిమ్మగడ్డ వెంకటేశ్వరరావు రాసినట్లు చలంది 'శ్మశాన' సాహిత్యమా లేక మరో సందర్భంలో శ్రీ శ్రీ అన్నట్లు 'పావననవజీవన బృందావన' సాహిత్యమా అనే తర్జనభర్జనలను శ్రీమతి రంగనాయకమ్మగారి వంటి తజ్ఞులకు వదిలి, ఖండన మండనలను వాటి మితులకు లోబరచి చూడందే, చలం సాహిత్యం తాలూకు వాస్తవ స్వభావం అవగతం కాదనిపిస్తుంది. శుద్ధ విద్యైక (అకడమిక్) దృక్పథం సైతం యిక్కడ పనికిరాదు సరిగదా, గురజాడ మాటల్లో, కోమలులు కావలసినవల్లా కొయ్య బొమ్మలైపోయే ప్రమాదం లేకపోలేదు. శ్రీ ఈదారెడ్డిగారి ప్రయత్నం విద్యైక దృక్పథం తాలూకు మితులకు మాత్రమే ఒదిగిపోకుండా, కాస్తయినా విద్యైకేతరమైన విషయాలకు విస్తరించడం 'శుభ' పరిణామానికి సూచనే. వ్యక్తిగా సాధుశీలి సౌమ్య సౌజన్యమూర్తి అయిన డా. కేతవరపు రామకోటిశాస్త్రిగారి పర్యవేక్షణలో సాగిన యీ పరిశోధన, గతానుగతికత్వాన్ని మూస పద్ధతుల్ని వదిలించుకోజూడడం, యింగ్లీషు వాడ నేట్లు Pleasant surprise.

'చలం నవలలు—సామాజిక చైతన్యం' పేరుతో మన ఈదారెడ్డి యం. ఫిల్ కోసం చేసిన విద్యాపరిశ్రమ విఫలంకాలేదు. 'చలం వాఙ్మయ జీవితం' అంటూ అధో జ్ఞాపికలతో సహా 22 అచ్చు పేజీలకు పరిపడా రాశాక, 1921 దరిదాపుల్లో చలం రాసిన 'శశిరేఖ' గురించి 17, 1923లో రాసిన 'దైవమిచ్చిన భార్య' గురించి 16, 1924లో రాసిన 'అమీనా' గురించి 14, 1927నాటి 'మైదానం' గురించి 19, 'వివాహం' (1928) గురించి 13, 'బ్రాహ్మణీకం' (1937) గురించి 13, 'అరుణ' (1935) గురించి 13, చివరికి 'జీవితాదర్శం' (1948) గురించి 12 పుటలు వెచ్చించారు. ముందు తాను టూకీగా కథచెప్పి, తర్వాత 'విచారణ' సాగించి, చివరకు నిర్ధారణను సూక్ష్మంలో సూత్రీకరించారు. ఈ పరిశోధనా గ్రంథానికి విలువనే గాక బరువునీ చేకూర్చే విషయాలలో మొదటిది, అనుబంధ రూపంలోని చలం రచనల పట్టిక, రచనాకాల నిరూపణ, యీ వాస్తవాంశాలను ఆక్రమించుకున్న 1/8 ఆక్టోవో అచ్చు పుటలు 50. అందుకే యిది పరిశ్రమ కాగలిగింది. ఇందుకైనా ఈదారెడ్డిని అభినందించాలి.

శుద్ధ విద్యైక దృష్టితో రచించిన యీ పుస్తకంలో దానికి సహజమైన గుణా గుణాలు ఉన్నాయి కొటేషన్లు యిసుళ్ళుపుట్ట, రిఫరెన్సులు చిట్టడివి, భూత, వర్తమాన కాలాల సాహిత్య—తాత్విక ధోరణుల స్థూల చిత్రణలు రంగు వెలసిన అద్దాలు, యివి యెలాగూ యెవ్వరికీ తప్పవు యిలాంటి రచనలో. అయితే జార్జి యీలియట్‌ను మగ వాడుగా చూపడం (పు. 10), వ్యక్తుల పేర్ల వుచ్చారణలకోసం Pronunciation Dictionary నైనా చూడకపోవడం (ఉదా 'మాఘం', పు. 12), 'క్లాసిసిస్ట్', 'రొమాంటిసిస్ట్' మాటలకూ 'క్లాసికల్', 'రొమాంటిక్' మాటలకూ మధ్యగల అర్థభేద చ్ఛాయల్ని నిర్దుష్టంగా నిరూపించకపోవడం యిలాంటి నెరసులు ఒక లెఖ్ఖలోనివికావు. నిజంగా అభ్యంతరకరమైన విషయాలను పేర్కోవలసివస్తే— ఒక్క మాటలో— Constructive Interpretation అంటామే, ఆ విధంగా చలం నిజంగా వుద్దేశించి వుండని భావాలను అయనకు ఆపాదించడం చాలా ముఖ్యమైనది. శశిరేఖలాంటి 'పతితల'లోని అధిక్యాంశాల్ని చూపి మిన్నులకెత్తడంలో. 'అంతరార్థం'

వారి అపమార్గాలవల్ల పొందిన బాధలకు ఉపశమనం పలికి సన్మార్గంలో పెట్టడానికేగాని పాతివ్రత్యాన్ని ధ్వంసం చేయడానికి కాదు.' (పు. 37)

ఇలాగనడం చలాన్ని సమర్థించడానికా లేక, అలా సమర్థిస్తూన్నట్టు అనిపించి, చలం నుంచి అతని భావబలం తొలగించి, సమన్వయవాది లెమ్మనిపించడానికా ? ఈ రెండోదే అయితే, ఏ విధంగానూ యిది సమర్థనీయంకాదు. మొదటి దానికి అగత్యమే లేదు. 'మ్యూజింగ్సు', 'ప్రేమలేఖలు', 'స్త్రీ' 'బిడ్డల శిక్షణ' వగైరాల నేపథ్యంలో తప్ప, చలం నవలల్ని నాటకాల్ని కథల్ని అర్థం చేసుకొని అతని ప్రాపంచిక తత్వాన్ని పడగట్టడం అసాధ్యం. ఈ గ్రంధంలో పరిశీలనకు నిలిచిన యితర నవలల 'విషయ విచారణ' పిండితార్థం అంతా పండితార్థమే అయేలా, చలంను ఈ 'వ్యవస్థ'కు మాట్లువేసే పనివాడిలా చూపడం, చలం తత్వానికే అపచారమనిపిస్తూంది.

సామాజిక విప్లవకారుడైనా కాకపోయినా, చలం తిరుగుబాటుదారూ, సాహసీ. అట్లని అతనిదంతా వ్యవస్థా విధ్వంసనా పరాయణత్వమే అనడంగానీ, విమర్శించీ ధిక్కరించీ నిలదీసీ సవాలుచేసీ తిట్టి, ఎట్టకేలకు, ఉన్న వ్యవస్థను ఉన్నచోటనే ఉంటూ వచ్చినట్టుగానే— 'ఎక్కడ వేసిన గొంగళి అక్కడే' బాపతు మనిషిగా చెప్పడంగానీ— ఈ రెండు వైఖరుల్లో ఏ ఒక్కటీ చలం సాహిత్యం సమగ్ర పరిశీలనా ఫలితం కాబోదు. పైగా, ఏ సాహిత్యాన్నీ దాని భౌతిక నేపథ్యం నుంచి పూర్తిగా వేరుచేసి చూడడమూ

సత్యం కాదు. వేళ్ళులేని బోదె, బోదెలేని కొమ్మలూ, అంతిమంగా పళ్లూ వుండవు. ఆ వేళ్ళు తన్నుకోడానికి భూమి, చెట్టు మొలిచి పెరగడానికి అనుకూలమైన నేల దిబుసూ, వాతావరణం అవశ్యం. ఈ దృష్ట్యా మెరుపులా మెరిసి పిడుగులా అడిచే చలం కూడా, తన తలిదండ్రుల బిడ్డ అయినట్టే తన సామాజిక మూలాల, కాలిక స్థితిగతుల పర్యవసానమే. వాటిని విశ్లేషించందే, అతని వైయక్తిక, సాహిత్యక విలక్షణత బోధపడదు. కాల్పనికోద్యమం అనిగానీ, ఆంగ్ల, ఆంగ్లేతర యూరపియన్ సాహిత్య ప్రభావం అనిగానీ, ఉద్యమాల, ప్రముఖ వ్యక్తుల పేర్లు స్మరించి తత్వాలను వివరిస్తేనే చాలదు. 'చలం వాఙ్మయ జీవితం'లో మన ఈదారెడ్డి చేసిందానికంటె చెయ్యవలసి వుండవలసింది మరెంతో విస్తృతమూ, ప్రగాఢమూ. ఆయన విశ్లేషణకివ్వని ప్రాముఖ్యాన్ని వివరణ కిచ్చారు.

శేష ప్రపంచాన్నటుంచకుండానే, ఈ దేశాన్ని కూడా కలుపుకు చూస్తే మానవ చరిత్రక్రమంలో మహా పరిణామాలన్నీ, ఆయా దశలలోని వ్యవస్థల కఠిన భూతలాన్ని ఆశ్రయించుకునే ఘటిల్లుతూ వస్తున్నాయి. 'వ్యవస్థ' అనగా విడివిడి మనుషుల కూడిక అనిపించవచ్చుగాని, నిజానికి, వారి సామాజిక సంబంధాల గిజిగాని గూడులాంటి చిక్కటి అల్లిక. మనిషి సమాజజీవి అనేకాదు, నిర్దిష్ట సమాజోపజీవి గనక, నాటి వుత్పత్తి సంబంధాల ఆధారంతో శతదళంలా విప్పారే ఇతరేతర కార్యక్షేత్రాల సముదాయాన్నంతటినీ కలిపి 'వ్యవస్థ' అనవచ్చు. దీనంతటి పరిధిలోనే అతని సమస్త భౌతిక, బౌద్ధిక క్రియా లోకమంతా సంచరించగలదు. ఊహలు కోరికలూ కలలూ కామనలూ సైతం గాలిసాములా స్వచ్ఛందంగా కలిసేవిగావు. అయితే ఆ భ్రమని కలిగించవచ్చు— అంతే. కాకుంటే మానవ ప్రకృతిలోని సహజాతాలూ ఉద్రేకాలూ వగైరా మనిషి జంతు దశ, ఆదిమ సమిష్టి జీవిత దశల తాలూకు అవశేషాలై చైతన్యం పొరల్లో దాగుండి అప్పుడప్పుడూ బయల్పడటం కద్దు. పూర్వజన్మ వాసనలో అధి భౌతిక పదార్థాలోకావు, ఇలాంటి 'అవచేతన' (Subconscious)లోని విచిత్రమైన అంశాలు.

ఈ సాధారణ చిత్రీకరణచేసి మలిచాలుననుకోకుండా, ఒకానొక కవినిగానీ, కళాకారుణ్ణిగానీ పరిశీలించేటప్పుడు విమర్శకుడు విధిగా చెయ్యవలసింది ఒకటుంది. నిర్దిష్ట దేశ, కాలాదుల నిజరూప నిర్ణయం.

చలాన్నే తీసుకుందాం: సంపన్న బ్రాహ్మణ వంశంలో సంపన్న ప్రాంతంలో పుట్టి (1894). బాల్య కౌమారదశలలో పూర్వమతాచార సంప్రదాయాలను అతిగా

వంటబట్టించుకుని, కాకినాడలోని పిఠాపురం మహారాజావారి కాలేజీలో చేరాక (1911) రఘుపతి వెంకటరత్నంగారి బ్రాహ్మ సమాజ వాతావరణంలో మొదట తన గతంమీద, తన కుల, కుటుంబ సంప్రదాయాలమీద తిరుగుబాటుచేస్తూ ఆ తిరుగుబాటులోనే 'స్వేచ్ఛ' ననుభవిస్తాననుకున్నాడు. కులభేదాలను కాలదన్నాడు. సామాజిక నిర్బంధాలను బదా బదలు చేశాడు. అయితే బ్రాహ్మ సమాజం కూడా యీ స్వేచ్ఛాపిపాసకు ప్రతిబంధక మని అనుభవ పూర్వకంగా గ్రహించడంతో, నిన్న మొన్నటిదాకా సకల సద్గుణ పుంజ మనిపించిందే, యిప్పుడు కల్లకపటమనిపించి, ఏకేశ్వరోపాసన ప్రార్థనమందిరాలకో భజన బృందాలకో ఉపన్యాసాలకో పరోపదేశాలకో అంకితమై మనుషుల్నీ వాళ్ళ మన స్సుల్నీ వాటి 'సహజ' వాంఛల్నీ తొక్కినొక్కి వేసే కొత్త నియమ నిబంధనలతోటి సరికొత్త మతధర్మమౌతున్నదనిపించిన తర్వాత, దాని మీదనూ పితూరీకి పూనుకుని, ఫలితంగా దాని నుంచి కూడా వెలిబడి, తెగిన గాలిపటం చందంగా మారాడు. అలాగే, రాజమండ్రిలో వీరేశలింగం సంఘ సంస్కరణోద్యమంలోనూ చిల్లులూ కన్నాలూ కని పించి, అమానుషమైన సంస్కరణాభినివేశం అసలు మనిషినీ, వాడి దాని మనస్సునీ, మరి అందులోని 'సహజ' వాంఛల్నీ నిరాదరిస్తున్నదని గ్రహించడంతో, దాన్నీ ఈసడించుకున్నాడు. మిగిలింది 'నేను'. అయితే ఈ అహంత ఎన్నటికీ నియంత కాలేదనీ, ఇలాంటి ఎన్నో యితర అహంతల సమీకరణంతోనూ అంతస్సంబంధాల తోనూ ముడిబడి, 'మోహం' 'శృంగారం' 'ఆనందం' వగైరా పేర్లతోనూ మానవీయ ప్రమేయాలను పూర్తిగా తోసివేయలేదనీ క్రమక్రమంగా అనుభవం నేర్పింది నేరుస్తూ వచ్చి, ప్రయోగాలుచేస్తూ వైఫల్య సాఫల్యాలతో ఎట్టకేలకు వ్యష్టికి, అందులోనూ పురుషునికీ ప్రాముఖ్యాన్నిచ్చి, అహంత నుంచీ అనుభవం నుంచీ జగత్తు నుంచీ తప్పుకునేందుకు యోగాన్నో తంత్రాన్నో భక్తినో మరొకదాన్నో శరణుజొచ్చాడు. అతి జటిలమైన చలం వ్యక్తిత్వం నుంచి ఏ పోగుకాపోగుతీసి చూపుతూ 'యిదే చలం', కాదు, 'అదే చలం' అనడం అసంగతం. ఒక్క విషయం మాత్రం స్పష్టం: పూర్వ నిర్ధారిత (Pre-conceived) భావాలతో (Notions) తాను బయలుదేరనూ లేదు, తనివి చెందనూ లేదు. ఎదుగుతూ మారుతూ, నిలిచినచోట నిలవక, చెప్పిందాన్నీ చెప్పివున్నట్టుగానే వల్లించక అచలంగాక, నిశ్చలంకూడాగాక. నిరంతర చలనశీలంతో ముందుకి సాగాడు గుడిపాటి వెంకటచలం. అయితే, అంతిమంగా మాత్రం, దాదాపుగా తానెక్కడ బయలుదేరాడో అక్కడికే తిరిగి, తిరిగి, చేరుకున్నాడనవచ్చు. ఈ తిరుగుళ్ళు సుడిగాలుల్నిరేపి దుమ్మునీ ధూళినీ జీర్ణ-శీర్ణ తృణపత్రాల్నీ ఎగరగొట్టి, నిలవనీటి మడుగులోనూ ఉత్తాల తరంగాల్నిలేపి పాచీ నాచూక్రిములూ కీటకాలూ పీడ వదిలేలా

పూపేసిన ఘటనలు. సాహిత్య రూపం ధరించనీ వికట వ్యక్తిత్వరూపం ధరించనీ. అవన్నీ లౌకికాలే, సామాజికాలే, కాలికాలే. తన అనుభవం తనకు 'ఆధ్యాత్మికం' అని పించవచ్చు. అది తనకు తానల్లుకున్న సాలీనిగూడు. తననితాను అతిక్రమించే ప్రయత్నంలో, ఇంద్రియ జ్ఞానాన్ని తృణీకరించే వెర్రితో, 'ఆనందం' దాహంతో, తాను రక్తమాంస నిర్మిత మానవ శరీరాల్నీ, మనోవిజ్ఞాన సూక్ష్మమనిపించే చైతన్య విరాడ్రూపంలోని గుప్తాంశల్నీ, కామాన్నీ, మోహాన్నీ సౌఖ్యాన్నీ— యీ 'భవబంధాల్ని' ఆమరణాంతం క్రియలో (వుద్దేశంలోకాదు) విదిలించి వదల్చుకోలేక నిరాశకు భావ సంతృప్తి (సబ్లిమేషన్) ఇచ్చుకున్నాడు. చలం సైతం ఒక గూటిపిట్టేగాని. 'ఏ గూడేవిలేని పులుగురాయడ' అని కృష్ణశాస్త్రిలా చెప్పుకోనూ లేదు, చెయ్యనూ లేదు. చెప్పడం అవలీల, చెయ్యడం అపురూపమే గాదు, అసాధ్యం.

'భావ' కవులూ చలం కవలపిల్లల్లా కనిపించినా, కవుల వేషధారణనెప్పుడో కనిపెట్టగలిగాడు చలం. భావసామ్యం వున్నా, భావసారూప్యం కాకుండా వాళ్ళు దివినుంచి భువికి దిగివచ్చేకొద్దికీ తాను తద్విరుద్ధంగా భువినుంచి దివికి ఎక్కిపోగోరాడు— దీక్షితులు గారి చేయూతతోనేగాదు, స్వ—భావపరిణామ ఫలితంగా కూడా. అయితే వాళ్లూ తానూ 'స్వేచ్ఛా' వాదులు. అది వైయక్తిక స్వేచ్ఛ. మరి, దీని మూలం, మన దేశంలోనూ గత శతాబ్ది చివరి భాగానికీ మోసెత్తి ఈ శతాబ్దిలో మొదటి రెండు దశాబ్దాల రాజకీయ పరిణామాల ఫలితంగా సంపుష్టి పొందతూ కాలు నిలదొక్కుకొని సత్తువ పెంచుకున్న ఆర్థిక స్వేచ్ఛాసూత్రబద్ధమైన పెట్టుబడిదారీ సామాజిక సంబంధాలె గాని, అన్యంకాదు. కాకుంటే, ఒకటి రెండు శతాబ్దాల క్రితం నుంచీ పాశ్చాత్య దేశాలలో మొలిచి పెరిగిన యీ సంబంధాల తాలూకు భావరూపాల కళా—కావ్య ప్రక్రియల పరోక్ష ప్రభావప్రసారం ఆంగ్లవిద్య మూలాన మన సమాజంలోని మధ్య తరగతి కొత్త తరానికి సోకి, వారి రచనలలో షెల్లీ—కీట్సు—బైరన్—మపాసా ప్రభృతుల ప్రతిధ్వనులో కొన నీడలో వినిపించీ కనిపించీ వుండవచ్చుగాని, ఆదిమూలం మట్టుక యీ గడ్డలోదే. అలాగే పర రాష్ట్రాలకు చెందిన టాగూరు ప్రభృతుల సుదూర ప్రకాశం మన కవుల—నవలాకారుల—కథకుల వ్యక్తిత్వాలకు కొత్త తళుకునిచ్చి వుండవచ్చు.

అయితే నిర్దిష్టమైన భౌతిక పరిస్థితులలో ఏ మౌలికమైన మార్పు కలిగి, 'స్త్రీ' సమస్యకు అపూర్వమైన ప్రాముఖ్యం సాహిత్య రూపేణా వచ్చినట్టు? ప్రతిభావానికీ భౌతిక మూలాలను వెదికిపట్టితీరాలని నియమమేదీలేదుగాని, నిశ్చితమైన ఒకానొక భావ

కోరడి విషయంలోమాత్రం నిర్లిప్తత తగని వైఖరి. స్థూలంగా చెప్పవలసివస్తే, పైన పేర్కొన్న కొత్త సామాజిక సంబంధాలతు 'వ్యక్తి స్వేచ్ఛ' పరాయణం అయినట్టు గానే, అవి విస్తరించి బలపడేందుకు మానవ జాతిలో సగానికి సగంగావున్న స్త్రీ 'జాతి' విముక్తి భౌతిక అవసరం. శ్రమ—సేన పెంపుదల జరగాలంటే, గృహ నిర్బంధం నుంచీ కుటుంబ బంధనాల నుంచీ పురుష 'జాతి' ఆధిపత్యం నుంచీ స్త్రీకి స్వేచ్ఛ కావాలి. 'ఆడది చదివి వూళ్లేలాలా?' అన్న భావానికి యిది చుక్కెదురు. 'మగాడు తిరక్క చెడ్డాడు, ఆడది తిరిగి చెడింది' అన్నదానికీ డిటోయే. మరి, యీ భావాలు ఎప్పటివి? వెనకటివి. భూస్వామికంతో రాటుదేలితే తేలాయిగాని, యింకా వెనకటివి, చాలా చాలా వెనకటివి. వాటితోనే స్త్రీ 'దాస్యం' బయల్దేరింది

ఆదిలో మానవ సమాజం, ఇతిహాసిక పురాణ గాథల్లోలాగా, వరసావావీలేని మైథునం (ప్రోమిస్కుఓటీ)తో కూడివుండేదోలేదో నిర్ధారణగా చెప్పలేంగాని, అది క్రమేపీ పశుపక్ష్యాదుల్లోలాగా తాత్కాలిక వైవాహిక రూపాలెన్నో ధరించీ ధరించీ, చివరికి నాలుగైదు వేలేళ్ల క్రితం యావత్కాలిక వైవాహిక రూపమైన 'మొనోగమీ'గా పరిణమించింది ఇది తత్కాలానికి స్త్రీకే లాభించి, తాను పలువురి కాళ్ళ దెబ్బలకు అలక్ష్యంగా తిరిగే రబ్బరు కాలి బంతి స్థాయినుంచి తప్పించి, స్థిరతనీ భద్రతనీ సమకూర్చిందంటారు అయితే, యీ పరిణామంవల్ల బాగా బాగుపడింది పురుషుడే. అప్పటికే తాను సమిష్టి నుంచి తప్పుకుంటూ సొంత ఆస్తిని యేర్పరచుకుంటున్నాడుగాని, యీ గడనను నిశ్చితంగా తన తనూభవుడికే యిచ్చిపోయినప్పుడే దానికి సార్థకత లభిస్తుందని గ్రహించబట్టి పరపురుష సంపర్క సంబంధాలు లేని విధంగా స్త్రీని దంపతిగా తన యింటిపట్టున తన అదుపాజ్ఞలలో వుంచుకోగోరి, దాంపత్యం కోరుతున్నాడు, సాధించుకున్నాడు. సొంత ఆస్తి పెరుగుదలకీ దాంపత్యానికీ మధ్యనేగాక, మొదటి దానికీ పురుషాధిపత్యానికీ భౌతిక పరిస్థితులు అప్పట్లో అనుకూలించాయి. అయితే, దేహ బలాధికుడూ యజమానుడూ కావడంవల్ల, తనకొక ధర్మాన్నీ తన దంపతికొక ధర్మాన్నీ యేర్పాటు చేశాడు. ఆవిడ సుశీల—పతివ్రత—భార్య. తాను యధేచ్ఛావర్తి—బహుస్త్రీ లోలుడు—భర్త. భార్యాత్వం స్త్రీకి తాత్కాలికంగా భద్రతని సమకూరిస్తే సమకూర్చిందేమోగాని, అది బానిసకున్న భద్రతే. నిజానికి, ఇంగ్లీషు మాట 'ఫేమిలీ'కి గల లేటిన్ భాషా మూలంలో, కుటుంబమంటేనే ఆలుబిడ్డలూ బానిసీళ్ళూ పశువులూ అని అర్థం. 'చీడీ' స్వేచ్ఛేకాదు. ప్రాణంసైతం యజమాని అధీనం. అలా మొదలైన అ—క్రమ వైవాహిక వ్యవస్థను, తదనంతర కాలాన మతం 'యావజ్జీవం హోష్యామి' బంధంగా

మార్చింది. ఇదే ముదిరి ముదిరీ భూస్వామిక ఆస్తి సంబంధాలు ప్రబలమైన చారిత్రిక దశలో మరీ వికటించి, పురుషులకి 'రసికత'ని యోగ్యతగా మార్చి, స్త్రీని అంతఃపురాలలో అసూర్యంపశ్యలుగా, వంటింటి కుందేళ్ళుగా, 'కార్యేషు దాసీ కరణేషు మంత్రీ.... శయనేషు రంభా' బాపతు పరికరాలుగా, వంశ వివర్ధనం కోసం— అందునా పుత్ర సంతానం కలిగించి పున్నామనరకం తప్పించేందుకు— నీతి సూత్రబద్ధమైన నిర్బంధ వ్యభిచారానికి మారుపేరైన దాంపత్య సాధనాలుగా మార్చాయి. అనుబంధాలను క్రియలో బంధనాలుగా మార్చాయి. అభిమానాలను అభిజాత్యస్థాయికి పెంచి, సహగమనం ద్వారా సతీత్వసిద్ధి భ్రమ కలిగించాయి. అయినా, ఆదినుంచీ స్త్రీ 'అతి' చరిస్తూనే వుంది— అయితే అధిక సందర్భాలలో దొంగచాటుగా, అరుదుగా మాత్రం నిర్భయంగా, సాహసంతో.

ఈ గ్రామీణ— ఆస్తి భూస్వామ్య సంబంధాలను మన దేశంలో బ్రిటిషువాడు తన స్వార్థంకొద్దీ సడలించి, తెంచివేయ జూచాక, సామ్రాజ్య సంరక్షణార్థం రైళ్ళతో మొదలై దేశీయ 'పరిశ్రమలు' తలెత్తి ఈ శతాబ్ది ప్రారంభానికల్లా సూదిలా మొన జూపి దబ్బనంగా మారసాగిన పెట్టుబడిదారీ ఆస్తి సంబంధాలు ముఖ్యంగా ప్రథమ ప్రపంచ యుద్ధకాలంలో ముమ్మరంగా సాగి బలపడసాగాక, వాటి ప్రాణమూలమైన ఆర్థిక స్వేచ్ఛాఛాయ కళా సాహిత్యరంగాలలో భావస్వేచ్ఛగా వ్యాపించింది. సరిగా ఆ కాలానికే పుట్టింది 'భావ' కవిత్వం: 'నేను స్వేచ్ఛా కుమారుడ !' నంటూ, క్రూరకౌటిల్య కల్పిత కఠిన దాస్య శృంఖలలు తెగదెంచుతానంటూ— యిలా. చలం సాహిత్యం కూడా యీ పరిస్థితులలోనే మొగ్గవిప్పిన 'ఓ పువ్వు'. రాయప్రోలు 'అమలిన' శృంగారం వెర్రి వదలి, విప్రలంభ శృంగారంలోనూ— కన్నీటి కెరటాల వెన్నెలలాగా— ప్రత్యాపేక్షతో గూడిన 'ప్రేమ' భావం పుట్టింది.

ఇది గురజాడ అప్పారావు భావించిన 'ప్రేమ' కానేకాదు: వట్టి 'మరులు ప్రేమని మది దలంచకు' మంటూ, 'ప్రేమ పెన్నిధి' చూపుతూ, లోక జీవన సౌధ నిర్మితిలో పునాదిగా, మనస్సులను ఒండొంటితో అతికి సామరస్యం సాధించే పదార్థంగా గురజాడ భావించాడు. అదే సమయంలో 'మగడు వేల్పన పాత మాటది' అన్నప్పుడు గానీ, శృంగారమొక్కటె 'బతుకు సుకమునకు రాజమార్గము' అన్నప్పుడుగానీ, భావకవుల 'ప్రేమ'ను సూచిస్తున్నాడా అనిపించకపోదు. నిజానికి, 'కన్యక'లో పురుషాధిక్యానికి వికృత పరాకాష్ఠ అయిన నిరంకుశ రాజరికాన్ని కథనంలో తెగనాడినప్పుడూ, 'పూర్ణమ్మ'లో బాల్య వివాహ విషమ ఫలితాల విషాదాన్ని కథనంలోనే నిరూపించి

నప్పుడూ, 'లవణరాజు కల'లోనూ 'ముత్యాలసరాలు'లోనూ వర్ణభేదాలను నిరసించి మంచి చెడ్డలను రెండింటినే ఉత్తమ అధమత్వాలకు కొలబద్దలుగా నిర్ణయించి స్థాపించి నప్పుడూ, చివరకు 'దేశభక్తి'లో కొత్త సామాజిక సంబంధాలను ప్రశంసించినప్పుడూ తెలుగు దేశంలో వాస్తవానికి తొలి ఆధునికుడయ్యాడు. అంతకంటె విపులంగా, గురజాడ కథలు మత వైషమ్యాలకూ 'వేశ్య'లలోనూ కలుగుతూన్న నూతన భావదీప్తనానికీ అక్షరరూపం కల్పిస్తే, నిలిచిన చోట నిలవని విధంగా తన మనస్సునే అద్దంగా మార్చి సంక్రమణ దశలోని తెలుగు సమాజ ఖండాన్ని 'కన్యాశుల్కం' ద్వారా ప్రదర్శించాడు. ఇక లేఖలలో, డైరీలలో, ఆయన ప్రకటించిన భావాలు కొన్ని, స్త్రీ పురుష సంబంధాలను మానవపరంగానే హృదయపరంగానేగాక, బుద్ధిపరంగా శాస్త్రపరంగా విశ్లేషణ చేస్తూ, వైవాహిక వ్యవస్థ ఎలా అక్రమాలతో అన్యాయాలతో రూపు తీరూ చెడి, స్త్రీని అధమస్థాయికి నెట్టివేసిందో చూపాడు. ఒక నవలకు రాసిన స్థూలకథలో స్త్రీకి ఆయుధ విద్యలోనూ శిక్షణ యివ్వాలని వాచ్యంగా అన్నప్పుడు, గురజాడ ఆంతర్యం బహిర్గత మౌతుంది. తర్వాతి రోజుల్లో చలంలాగా థియొసఫీని, బ్రహ్మ సమాజాన్నీ, సంస్కరణోద్యమాన్నీ, అతిలోక ఆదర్శాల అసాధ్యతనీ విమర్శించి, గేలిచేశాడు. ఇలా చలానికి భావభిక్ష పెట్టిన వారిలో గురజాడే ఆద్యుడు. ఈ విషయాన్ని చలమే అంగీకరించాడు. 'ఆనందం'లో భాగంగా, ఎన్నడో గురజాడ రాసిన లేఖను స్వయంగా అనువదిస్తూ చలంరాసిన మాటలు— అప్పారావు తన లేఖలో వెలిబుచ్చిన కొన్ని భావాలను చదివితే, 'అప్పారావుగారికీ నాకూ కనపడ్డ అభిప్రాయబంధుత్వాన్ని చూసి ఆశ్చర్యపడ్డాను.... ఆయన బతికివుంటే యిప్పటి నా వాఙ్మయ మిత్రులవలెగాక మనఃపూర్వకంగా స్వాగత మిచ్చేవారేమో అనుకున్నాను.' (ఆనందం పు. 100). 'భావ' కవులు గురజాడకు చేసింది ముఖ్యంగా Lip-service. రీతినే సంగ్రహించారుగాని రచనా సంప్రదాయాలతో రాజీపడి చలాన్ని కూడా నిజంగా మెచ్చలేక పోయారు. అట్లని, చలం పూర్తిగా గురజాడ మానసపుత్రుడనుకోనేరు ! గురజాడది ముందుచూపు, చలానిది పైచూపు. చలం మనిషిలోని 'పశు' ధర్మాన్ని మళ్ళీ ప్రాచుర్యానికి తెచ్చాడు, గురజాడ మనిషిలో 'దివ్యాంశ'ను చూసి చిత్త సంస్కారాన్ని ఆశించినా, రూసో, కోట్ (Comte), మిల్, వగైరా తాత్వికుల్ని ఆకళించుకునీ వదలి ముందుకెళ్ళి, లీలగానైనా 'పాటకపు జనుల స్థితిగతుల' గురించి ప్రస్తావిస్తూ, ప్రజాస్వామ్యం సార్థకం కావలెనన్నాడు. రాజకీయ పరిభాషలో, గురజాడ బూర్జువా—డెమోక్రట్ మాత్రమేకాదు, బూర్జువా—రేడికల్ కూడా. చలం ప్రధానంగా 'పెటీ బూర్జువా అనార్కిస్టు'— వ్యక్తిగానే కాదు, తాత్వికుడుగా కూడా. ఇవి నిందార్థకాలు కాదని మనవి.

## VIII

# 2

ఈదారెడ్డి రాసినట్టుగా, కాల్పనికతావాదం రూసోతో మొదలైందనవచ్చు. రూసో కోరుకుందల్లా, 'నాగరికత' ముందు దశలో, దివ్యానందం (idyllic happiness) నిరాఘాటంగా అనుభవిస్తూ వచ్చిన ఉదారశీలుడైన ఆటవిక జీవినే (Noble savage). అయితే, 'నాగరికత' అని తాననుకున్నదీ, వర్డ్స్‌వర్త్‌లాంటి వాళ్ళనుకున్నదీ, కొత్త సామాజిక సంబంధాలతో గూడిన 'బూర్జువా' వ్యవస్థనే గనక, 'కాల్పనికత' ప్రారంభంలో నూతన సామాజిక వ్యవస్థమీద బుద్ధిజీవులు సాగించిన తిరుగుబాటే. ఇది దాని ధనాంశ (Positive side). అంతకంటె చాలా వెనుక్కి వెళ్ళి ఆదిమ అకృత్రిమతను ఆదర్శీకరించడం దాని ఋణాంశ (Negative side). చలం సాహిత్యంలో యీ అంశ గోచరిస్తుంది. అయినా, భూస్వామిక సామాజిక సంబంధాలను నిరసించి ఎండగట్టి ఖండించి, చలం మొదటి అంశనే స్ఫుటతరంగా ప్రదర్శించాడు గనక, బేరీజులో ధనాంశదే పైచెయ్యి. అట్లని, రెండోదాన్నీ, దాని వెన్నంటి రాకతప్పని అనర్థాలనూ విస్మరించడం చలంపట్ల పక్షపాతాన్ని చూపడమే. వ్యవస్థకు మాట్లు వెయ్యడమో, అతుకులు పెట్టడమో, సంస్కరించి సంప్రదాయంతో మళ్ళీ పొంతన కలిగించడమో చలం ఆశయం అని అంటే, చలానికే కాదు, వాస్తవానికే అపచారం. చలం ముఖ్యంగా విధ్వంసకారుడు; గౌణంగా మాత్రమే నిర్మాణకారుడు. ఆయనకొక లక్ష్యం వుంది. అది స్త్రీ విమోచనలో సెక్స్‌కు సంబంధించిన అంశం. ఇది చిన్నదికాదు, పెద్దదే. ఒక కార్యక్రమమూ వుంది. అది 'బిడ్డల శిక్షణ' వగైరాలలో కనిపిస్తుంది. ఈ రెంటికీ చెందని విషయాలలో చలంది విశృంఖల విహారమే. తన ఆలోచనలే మారుతూ మారుతూ చివరికి ఎక్కడికో— సమాజానికి దూరంగా— తీసికెళ్ళి విలిపాయి. మరి యీ ఆలోచనల చిక్కుడియ్యడానికి ఏ దువ్వెనా ఈర్పెనా యిందాకా లేదు. ఈదారెడ్డి తన పి. హెచ్. డి. కృషిలో యీ పని చేస్తారని, కనీసం ప్రయత్నిస్తారని ఆశించడం అత్యాశ అవుతుందా?

'అహం' కేంద్రబిందువుగా అనేకమైన ఆ వృత్తంతో చలం భావసరస్సు కలగుండుపాటునుంచి తప్పుకుని స్తిమితానికి రాలేదు. అరుణాచలమైనా దాన్ని కలిగించిందో లేదో? అక్కడా రమణ స్మరణపరాయణుల కనేకులకు చలం వెలే. ఆశ్రమానికి యెడంగా అస్పృశ్యుడిలా విడిగా జీవించాడుగాని అంతే వాసికాలేదు. ఈ ఏకాంతయోగం తనకు తృప్తి నిచ్చిందా? గోరీల మిట్టలో సమాధిబండపై కూర్చుని చేసిన వేదనా

భరితమైన రోదనలు చలం అంతర్వేదనకు దారీ తృప్తి చూపించవడం, వాస్తవానికే ఆశ్చర్యకరం.

చలం తత్వానికి 'స్వ' కీలకం. స్వార్థం తప్పేమిటంటాడు ఒక చోట. అది ఆనంద మిస్తుందా లేదా ? స్వార్థం కానిదేదైనా వుందా ? 'పై వటన పొరతీసిచూస్తే, అంతా నేనే నేను తప్ప ప్రపంచంలేదు నేను అనే వాట్లోంచి తప్పించుకోలేను ... అంతా నేనే. ఈ ప్రపంచమే నేను ఈశ్వరుడే నేను. సృష్టికి మూలసూత్రమే నేను. నా మంచి నా ఆనందం మంచి నేను తప్పించుకోలేను. తప్పించుకుంటున్నాననుకోవడం మూర్ఖం.... నేను కానిదంతా మాయ ప్రపంచం లేనేలేదు. నేనే ఉన్నాను.' ('ఏది స్వార్థం కాదు ?', 'ఆనందం', పు. 105). వ్యావహారికార్థంలో యేమోగాని, తాత్వికార్థంలో, ఇది స్వార్థపరాయణత్వం, అమానుషత్వం కానక్కర్లేదు. 'ఒక సూర్యుండు సమస్త జీవులకు దానొక్కొక్కండై దోచు పోలిక' అంటారే. అలా ప్రపంచమనేది ఏ మనిషికామనిషిదిగానే కనిపించడం సహజమేగాని, ఉన్నది అలాక్కాదే ? మనిషి ఎవడికి వాడుగాలేడే ? అలా ఉండలేడే ? సమిష్టిలో భాగంగా తప్ప తనీగా వుండగల మనిషి దేవుడైనా కావాలి, పశువైనా కావాలి, అని అన్నది అరిస్టాటిలా ? ఎవరంటేనేం గాని, యిది నిజం. కాబట్టి 'స్వ' సౌఖ్యం వుండవచ్చు— పరసౌఖ్యానికి ఆటంకం కానంత వరకు. మనషిలో 'స్వ', 'పర'— (Self-regarding and other-regarding) అంశలు రెండూ వున్నాయని మరో తాత్వికుడు—లాక్ ?— అన్నాడు. చలంది వివరీత వ్యక్తి వాదమైందంటే, ఏ హెర్బర్ట్ స్పెన్సర్ ప్రభావమోవుందని వూహించనక్కర్లేదు. లేదా, బకూనిన్‌వో మరో అరాడ్వాదినో ముగ్గులోకి రమ్మన నక్కర్లేదు. ఇది స్వక పోల కల్పితమే, స్వానుభవ జన్యమే.

చిత్రం ఇది కాదు. ప్రేమలోనరే, ఒకరికోసం మరొకరి త్యాగాన్ని ఆమోదించే చలం, ఆనందం ధ్యాస లేకుండా జీవితాన్ని వుద్యమాలలో 'లోక క్షేమానికి, ప్రపంచానందానికి చేసే ఘన ప్రయత్నాలలో ఐక్యమయ్యే మనిషి'కి దొరికే ఆనందం స్వార్థపరులకు దొరకదని, యిదే ఉత్తమమైందని కూడా అనగలడు. (ఆనందం). మరెవ్వరికీ వంతు పెట్టకుండా ఎంతో కొంత ఆనందం సంపాదించుకోజూస్తే, అది క్షుద్ర రూపాల్లో ప్రసన్నమౌతుందంటాడు. తనే అంతా పొందాలనే ఆబతోగాక యితరులకీ ఆనంద మిద్దామన్న వూహతోచేసే పనులే ఎక్కువ ఆనందకరాలంటాడు. కాబట్టి యిక్కడ ఆనందం స్వార్థ దూషితం, స్వ—సంకుచితం కాదు. మరి యిది చలం భావంలో వైరుధ్యమా అంటే, కాదు. ఆనందంలో అంతస్తులూ తరతమ భేదాలూ ఉత్తమాధమత్వాలూ

ఉన్నాయి అయితే, లోకం సమస్తం సుఖంకోసమని చేసే మహా ప్రయత్నం మానవ సహజమే. ఈ 'యుటిలిటేరియన్' భావచ్ఛాయ వెంటనే ఆధ్యాత్మికతకు మళ్ళి, శరీర సౌఖ్యాలను దూషించే వేదాంతాన్ని ఖండిస్తూ శరీరం ఒక్కటే ఆనంద నిలయమంటూ, 'సంపూర్ణమైన జీవితాన్ని' వెనకటి ఆదిమ ఆర్యుల్లా ప్రస్తుతిస్తూ, 'సృష్టి పుద్దేశమే ఆనందం', 'శృంగారమే సృష్టికి పునాది', శృంగారానికి కాపరానికి చుక్కెదురు. స్త్రీ – పురుష సంబంధాలలో నీతీ బూతూ లేదు, స్త్రీ సౌందర్యం' మహిమాన్వితమైన దంటాడు.

'ఆనందో బ్రహ్మమ్' అనే దానికి సురతానందానికీ పోలికైతే వుందేమో, తన్మయత విషయంలో, అభేదమే లేదా ? భూస్వామికయుగ ప్రాభవదశలో అల్లసాని పెద్దన 'ఎందెదెందెను కందళించు రహిచే నేకాగ్రతన్ నిర్వృతిన్ జెందున్....' అన్నాడే అనుకుందాం, పెద్దనమీద శ్రీ వైష్ణవ ముద్ర ఎంత గాఢంగా పడిందో యేమో గాని, బ్రాహ్మ సమాజం నుంచి వచ్చిన చలం బ్రాహ్మ సమాజంమీద సైతం కేశవ చంద్రసేన్ హయాంలో మధురభక్తి సంప్రదాయ ప్రభావం వుందేమో ! ఆనందానికి అగ్రతాంబూలం యివ్వడం, వ్యవస్థాగతమైన క్షుద్ర భౌతికలంపటత్వానికి ఖండించడానికి గూడా పనికి వచ్చిందని– 'దమ్మిడీల కక్కుర్తి', 'నీచత్వం' వగైరా మాటలు తెలియ జేస్తాయి. 'మతం' తన సార్థకతని పోగొట్టుకుని పాడైందనే బాధ కూడా వుంది. సౌందర్యతృష్ణ వేశ్యాకుల (కళావంతుల) వుపయోగాన్ని సైతం సమర్థింపజేసింది. ఆ కుల సంస్కర్తల కృషినీ తృణీకరింప జేసింది. ఇది న్యాయం కాదు సరిగదా, పరమ అక్రమం.

స్త్రీ విమోచనం సమస్తం 'సెక్సు' మీదనే నిలిచి వుందా ? స్త్రీ జనోద్ధరణకు యిది తొలిమెట్టే కావచ్చుగాని ఇదే దాని పరమార్థమా ? సంభోగంలో తప్పు లేదు, దానికి ముసుగులూ తొడుగులూ మురికి గదులూ అక్కర్లేదు సరే, సభ్యతే అసహ్యమా? పశుకామాన్ని సమర్థించడమేనా ? మనస్సు వాంఛామయమేగాని, వల్మీకంకాదే ! భోగ లాలసతనీ Voluptuousness నీ సమకూరిస్తేనే జీవితానుభవానికి సంపూర్ణత, సర్వ సమగ్రత ఏర్పడినట్టా ? బట్టబయలు వ్యవహారం ఒక్కటే. 'మురుగు వాంఛల్ని తొలగిస్తే, ఇక యీ వుడుపులెందుకు, యిళ్లెందుకు, ఏదో కొన్ని గుడ్డిలో మెల్ల నియమాలెందుకు ?

స్త్రీకి స్వంత వ్యక్తిత్వం కావాలంటావా, ఆక్షేపణేమిటి ? అయితే అది తాను పోరాడి గెలుచుకోవలసిందేగాని, మధ్య యుగాల 'షివల్రీ' పద్ధతిలో స్త్రీ జన సంరక్షణ

ఏకైక ధ్వజంగా నినాదంగా కార్యక్రమంగా— చివరికి ఉన్మాదంగా— పరిణమించి సమాజం సమస్తం 'అనంగ రంగ'మై. 'మార సంగ్రామ భేరి' వేస్తూ ప్రబలమైన ఊహావల్గ దశ్వారూఢులై ఎవరో కొందరు వీరమానులు కలం కత్తులతో సాధించగలంత తేలికపనా?

'తప్పుగాని, ఒప్పుగాని, వెనకముందు చూడకు. తప్పైతే దిద్దుకోడానికి చాలా కాలముంది. వెనక ముందులు యోచించే చచ్చుబతుకుకంటె ధీరత్వంతో ముందుకు సాగి గోతిలో పడేవాడికే యెక్కువ ఆనందముంది యీ లోకంలో.' (ఆనందం పు 18)

ఈ 'షివల్రీ' చలంలో చిన్నతనం నుంచీ వున్నదే స్త్రీ తన దైవం ('చలం'. పు 211). రవి మరణం ఫలితంగా అస్తిక్యతావాదం గురించి అనుమానాలు పొటమరించి తీవరించాక, ఈశ్వరుడి స్థానాన్ని ఆక్రమించిన స్త్రీయే శరణ్యమై మోక్ష ద్వారం (భర్తృహరి అన్నట్లు 'నరకద్వారం' కాదు) అయేలా తనని ఉత్తేజితుణ్ణి చేస్తుందని, స్త్రీని మార్చి స్త్రీని అలా భావించి 'ఆదర్శ' స్త్రీ కోసం అన్వేషించి తపసించి కామించీ మోహించీ రమించీ విరమించీ, 'వెర్రి వేసట'లో తాను కోరుకున్న శాంతికి బదులు 'తీవ్ర తపన'తో గూడిన 'అర్థంలేని అశాంతి' అనుభవించానని తానే రాసుకున్నాడు. (పైదే, పు. 123). 'ఆదర్శ' స్త్రీ అందని మానిపండే, ఆకాశ కుసుమమే అయింది. లీల కూడా తనకు ఆ ద్వారం తీయలేక పోయింది. కృష్ణశాస్త్రి 'ఊర్వశి'లోనూ తనకు 'ఆత్మ' కనిపించక దాచివేత వ్యవహారం అనిపించింది. లీల నిష్క్రమణంతో యీ 'ఆదర్శ' స్త్రీ పిచ్చి వదిలిందంటూ— 'ముందు తాను ఆదర్శ పురుషుడైతే తప్ప, ఆదర్శ స్త్రీ ఎక్కడి నుంచి వొస్తుంది.?' అని తననే ప్రశ్నించుకున్నాడు. ఆదర్శానికి వాస్తవానికి, భ్రమకీ నిష్ఠురమైన నిజానికీ మధ్య తిరగటిలో గింజలా నలిగిపోతూన్న చలం. (పైదే, పు. 284)

డాక్టరు రంగనాయకమ్మ నిజంగానే చిత్తశాంతిని ప్రసాదించి వుండేవారు. భార్య రంగనాయకమ్మ భర్త వైఫల్యాలలో చాంచల్యాలలో చాపల్యాలలో సుడిగుండంలోలా తిరుగుతూంటే చూడలేక, గుండెగాయంతో వెనకపట్టుపట్టి మతవిశ్వాసాలవైపు మళ్ళినా, సంఘసేవ ద్వారా తన ఆశాభంగానికి పూరట కలిగించుకోవాలని ప్రయత్నించి, భర్త ఆదరణకూ బిడ్డల ప్రేమకూ దూరమై ఉన్మాదస్థితిలో పడింది ఆదర్శవాదులు క్రూరులని వెక్కిరించిన చలమే, శృంగారాధిదేవత ఆదర్శంలోపడి తన ఆత్మీయురాలిపట్ల క్రూరంగానే (కనీసం, పర్యవసానంలో— వుద్దేశ పూర్వకంగా కాకున్నా.) వ్యవహరించాడు. కాకుంటే, జాలి చూపాడు. ఆవిడ గుండె జోలెలో కన్నీటి చినుకుల బిచ్చమా?

వెళ్ళి పోయింది. ప్రతికూల విమర్శలు, జీవితం వొడుదొడుకులు, కుటుంబంలో అశ్రుగాధలు— వీటికి తోడు అందని దానికోసం పడే తాపత్రియంలో మిగిలిన అసంతృప్తి, దాని నుంచి బాధ, యివన్నీ తెలుగు దేశపు ధూళినీ గాలినీ కూడా ద్వేషించేలా చలాన్ని అరుణాచల రమణస్థాన్ వైపుకి ప్రస్థానం చేయించాయి.

'అరుణాచలా! ఘనీ భవానంద తరంగ! అంధకార తేజోమూర్తి', 'భగవాన్' రమణ మహర్షి కరుణాకటాక్షం, మందహాసం, చేసైగ యివీ దూరమయ్యాక, సౌరిస్ లోనే ఈశ్వరుణ్ణి చూస్తూ చూస్తూ తమిళ హంధూళికీ గాలికీ తనువప్పగించిన చలం, 'నా బుద్ధి చంచలం' అనే ఒక్క మాటలో తన వ్యక్తిత్వ విలక్షణతని అక్షరబద్ధం చేశాడు. అమ్మణ్ణి పెళ్ళితో మొదలైన స్త్రీజన 'రక్షణోద్యమం' 'స్త్రీ స్వేచ్ఛా యజ్ఞం'గా మారి మండి ఆరాక, తన మనస్సు యుద్ధరంగమై మన్మథుణ్ణి ఈశ్వరుడు ఓడించాక, మళ్ళీ 'శాంతి' కోసం మతంగాని మతాన్ని, ఈశ్వరుడుగాని ఈశ్వరుణ్ణి శరణుజొచ్చి— తాను అర్ధనారీశ్వరుడయ్యాడు.

'ఇదే సత్యం ఇదే మౌనం ఇదే శాంతి.'

## 3

స్త్రీలలో మధ్య తరగతి విద్యావతులు, పురుషులలో మధ్య తరగతి విద్యావంతులు ఉభయ 'జాతుల'లోనూ, చలం మాటల్లోనే యవనవ్వన (adoloscent) ప్రాయం లోని వాళ్ళు, వారి ద్వారా మరికొందరు— అందరూ అక్షరాస్యులే— చలం వ్యక్తిగా మొదలై సాహిత్య–సామాజిక శక్తిగా మారాక ప్రభావితులయ్యారు. జన సామాన్యం మీద చలం ఎన్నడూ గురిపెట్టలేదు. కె. సి. డే. సంగీతం మొదలు, 'సంస్కృతి'లో ఏ అంశమైనా శిష్టులకేగాని పామరులకు కాదంటూ, **intellectual aristocracy** సిద్ధాంతం చెయ్యడం, వ్యక్తి విశిష్టతావాదిగా చలం చెయ్యదగిన పనే.

ప్రజలకు సౌందర్యమెందుకు, అన్నపానాదులుంటే? ఇది క్షుద్ర భౌతికయుగం. భోజనం, పాలిటిక్స్— యివి చాలు, ప్రజలకీ, వారి నాయకులకీ. (మ్యూజింగ్స్ పు. 100). చెక్ పెసరీలు, పొటాషియం, పెర్మాంగనేటు, సోషలిజం, రేషనలిజం— యివి జనానికి సౌఖ్యం కలిగిస్తాయా? అజ్ఞానం, పిరికితనం, జడత్వం, క్రూరత్వం వదలాలి (అదే, పు 129). రాజ్యాంగాలు మారినా, కుటుంబ పద్ధతులు మారినా, 'ఆత్మలోని

రోగం' మానేనా, జనం మారేనా? (పు 130). భూమి మీద స్వర్గం— అరచేతిలో వైకుంఠమే. కాబట్టి? ప్రజలు మూర్ఖులు లెమ్మని 'వాళ్ళకి అర్థం కాకుండా వ్రాసిన నేను మూర్ఖుణ్ణో' (పు. 156) అనిపించినా, తాను రాసిందంతా తన సంస్కారం. ఆత్మ సంస్కరణం కోసమే తప్ప సమాజ సంస్కరణ కోసంకాదని తానే అన్నాడు. జాలి చూపగలడు. దయ (కృప) తలవగలడు— అంతే. అదీ వెనకటిమాటే. 'ఉన్న దేదో అనుభవించడం వివేకమనే సిద్ధాంతానికి వొచ్చాను.' (చలం; పు. 188) Take life as it is. Do not quarrel with it. We have not made this world. Let it be, excuseless, useless, hopeless stupid అని ప్రపంచ విజేతలు చేసిన బోధలతో తనకు ఒకప్పుడు అంగీకారం కుదిరిందికాను. 'ఈ జీవితానికీ నాకూ ఎప్పుడు యుద్ధమే' (అదే. పుట 212)

కళాకారుడికీ సమాజానికి మధ్య యెడబాటు ఎన్నడో వర్గసమాజ ప్రారంభ కాలంలో మొదలై, 19, 20 శతాబ్దాల నాటికల్లా యిది యుద్ధమే అయినప్పుడు, కొందరు వ్యక్తివాదాన్ని కొందరు సమిష్టి వాదాన్నీ ఆశ్రయించారు. ఏ వాదమైనా, యీ యుద్ధం నుంచే— 'బహిరంతర' యుద్ధం— కళ పుట్టుకొచ్చింది. మొదటిదేమో మొదటి వ్యక్తిని విశ్వనియంతగా చూపి, బూర్జువా వ్యవస్థ క్షీణించే కొద్దీ త్రివిక్రముడనిపించిన వ్యక్తినల్లా వామనుణ్ణిగా మార్చి మనిషినే నలుసుగాయెంచి, చారిత్రిక పురోగమన నాయకుడు కావలసిన 'కర్త' (Subject) నల్లా చారిత్రిక పరిణామాల 'కర్మ' (Object)గా కుదించి, క్రియా శూన్యుణ్ణిగా, అంతర్యుద్ధమయుణ్ణిగా 'సందేహజీవి'గా 'సంశయ జీవి'గా మార్చి వ్యక్తిత్వ సాఫల్యాన్నే హరించింది ఇది పాశ్చాత్య సాహిత్యానికీ కళకీ ప్రస్తుతం పట్టివున్న పెద్ద రోగం— వ్యక్తిత్వ విచ్ఛిత్తి. మన సాహిత్యంలో 'అనుభూతి' వాదమనో మరొకటనో యింకా దొంగాటకాలాడుతూంది— నిజానికి బూర్జువా వ్యవస్థ నేటికీ తన ఆధిపత్యాన్ని స్థాపించుకోలేక, భూస్వామ్య వ్యవస్థతో రాజీపడి దాని అస్తిత్వాన్ని యింకా కొనసాగిస్తూనే వున్నా.

ఇలాంటి దొంగాటకం చలానికెన్నడూ లేదు. కాకుంటే, యీ వ్యవస్థ తాలూకు సంకీర్ణతని బోధపరచుకోక, ఒక వేపు బూర్జువా వ్యక్తి విశిష్టతావాదాన్ని చేబట్టుతూనే, ఇంకోవేపు భూస్వామ్య వ్యవస్థ, యింకా ప్రాచీన వ్యవస్థల తాలూకు ఆత్మ, పరమాత్మ, ఈశ్వరుడు, వగైరా మత భావాలను వదిలించుకోలేక పోయాడు. రెంటికీ పనికి వచ్చి నట్టే వచ్చి రెంటికీ చెడ్డాడు. భౌతిక వాస్తవం మారాక ఎంతో కాలానికిగాని మారని భావచైతన్యం గురించి సాహసించి పోరాడి విఫలతచెందినా, గొప్ప వ్యక్తి గనక, ఆ

నిఫలతా కూడా గొప్పదే (heroic proportions). అది తన సొంత విఫలతేకాదు— యీ వ్యవస్థ మాదచ్ఛేదీయే.

స్త్రీ గురించి కూడా చలానికి సవ్యమైన అభిప్రాయాలు లేవంటే చాలా మంది నమ్మరు సరిగదా, రాసినవాణ్ణి చూసినవ్వుతారు. మొగల్ రాజుల, రసపుత్ర వీరుల, ధీర, సుకుమార, మార్దవ సుగుణాలను తలచుకొని కాల్పనికవాదభ్రమల సాలెగూళ్ళలో చిక్కుకున్న చలం 'అరుణ'నో మీరానో, అమీర్నో వారివారి గుణ విశేషాలకోసం మెచ్చాడుగాని, 'మైదానం'లో, 'ప్రేమ'ను బలాధికమైన పురుష పశుత్వానికో లేక సంపన్నవర్గ సంస్కారంగల పురుషమార్దవానికో లోబరచి, భ్రూణ హత్యకీ పూన్చి, 'అందమైన మృగాల'ను చచ్చు మనుషులకంటె అధికమనిపించాడు. 'ఇదివరకు పశువు కన్న అధమమైన బతుకు బతికేదాన్ని— ఇప్పుడు పశువునై సుఖపడుతున్నాను' అన్నప్పుడు సామాజిక కౌటుంబిక నిర్బంధాల నుంచి బయటపడిన మానవ వ్యక్తి మీద పూర్తిగా సహజాతాలకు (Instincts) ఉద్రేకాలకూ ఆధిపత్యం యిచ్చాడు. అయితే, 'ఎంత అసహ్యంగా ఉన్నా సంఘ నిర్మితమైన సంసారంలో, కొంత శాశ్వతత్వం కాలం వల్ల యేర్పడి, భేదించడానికి సాధ్యంకాని బంధనాలున్నాయి' అని రాజేశ్వరిచేత అనిపించడమంతా, వ్యవస్థని సమర్థించడానికి వుద్దేశించింది కాదు, దాని బలాన్ని సూచించడానికే వుద్దేశించింది. ఇక, అరుణనిచూస్తే భర్తనీ మనసారా వలచిన ప్రియుణ్ణిసైతం వదలి, మగవాడంటేనే డోకు పుట్టించి, తామరాకుమీద నీటి బొట్టులా నడిపించి వడిపించి, 'ప్రేమ' కూడా మాయ అనిపించి, పురుషుల్ని ఆటబొమ్మల్లా ఆడించి, 'ఆదర్శ' పురుషుడు దొరక్కుండాచేసి, చివరికి— 'జీవితంలో యీ దేహానికి నా శృంగార భావాలకి యెట్లా ద్వారాలు తెరిచిందో, అట్లానే నా ఆత్మకీ, నా ఆధ్యాత్మిక సందేహాలకీ ఎప్పుడో, ఏ ఆశ్రమంనించో స్వర్గద్వారాలు తెరుస్తుందని నా నమ్మకం'. అని నాయకుడిచేత ఉత్తమ పురుషలో చెప్పించినా, ఇక్కడ మాత్రం చలం స్త్రీగా అరుణరూపం ధరించాడు. తక్కిన రచనలలో చాలా వాటిలో ఉత్తమ పురుషలో చెప్పించిన ప్రతి కథానాయకుడూ చలం కాకపోవచ్చు గాని, చలం నకలే. అరుణ మాత్రం చలంలా కోరిందేమో 'శాంతి'ని, పొందింది మాత్రం Excitement నీ.

విద్యావతులైన స్త్రీలు వట్టికట్టెలుగా మారిపోతున్నారని చలం బాధ. చదువుకొని వుద్యోగాలు చేస్తూన్న ఆడాళ్ల అసలు సూక్ష్మమైన సెక్సుని మరచి, 'శాంతికీ సుఖానికీ దూరమై' 'ఆర్థిక స్వాతంత్ర్యం వచ్చినా సెక్సు స్వాతంత్ర్యం' రాకుండా వున్నారని 'మ్యూజింగ్సు'లో (పు. 160–161) రాశాడు. దేహాన్ని మరచి దేహాలంకరణ

లంజె పడిచస్తున్నారు. వాంఛల్ని చంపుకుంటున్నారు. స్త్రీత్వాన్ని నశింపచేసుకుంటు న్నారు. ఇదంతా 'నాగరకత' మోసం. అది పెరిగేకొద్దీ మనిషి బతుకు రసహీనమై పోతూంది (అదే పు. 184) '....ధనం మోతలో హృదయాల రోదన వినపడదు' (215). సౌందర్యోపాసన కృశిస్తూంది. 'నవనాగరికత' ఆనందాన్ని నశింపజేస్తోంది (244). ఆనందం మనిషి జన్మహక్కు అనే భావం పోతూంది. మనుషులు మరలా తున్నారు. అందరూ కళని అనుభవించే అర్హత పొందాలి. అది అందరి సొమ్ము. కాని, యిప్పుడేమో అది కొద్దిమందికే వుంది (248). ఎందువల్లో చలం పరిశీలిస్తే చాలు, తెలిసి వుండేది. ఆస్తి, తీరికా, తరతరాల విద్యా సంస్కారాలూ కొందరివే అయివున్నాయి. గనక కళానందాస్వాదన కొందరి హక్కు భుక్తమే అయి కూర్చుంది.

స్త్రీలు చపలచిత్తలని ఒకవైపు అంటూన్న చలం, స్త్రీ జాతిని తూలనాడుతున్నా డేమో అనిపిస్తూనే, మరోవైపున పురుషుడికి ప్రేరక శక్తిగా భావించి సత్కారం చేస్తున్నట్లు అనిపించడం వుంది. రెండూ స్త్రీలకు పూర్తిగానే వర్తించేవికావు. స్త్రీ-పురుష భేదాలిప్పుడు ఎంతదూరం వెళ్ళాయంటే, పుట్టుకలోనే అవి భిన్నజాతులని సిద్ధాంతం చేసేంతదాకా వెళ్ళాయి. చలం రచనలు దీనికి దోహదంచేస్తే, అది లోపమే కదా ?

తాను స్థాపించదలిచిందేమిటి ? స్త్రీ కూడా ఒక వ్యక్తి. తనకీ ఒక శరీరంవుంది 'దానికి వ్యాయామం ఇవ్వాలి. ఆమెకి మెదడు ఉంది. దానికి జ్ఞానం యివ్వాలి. ఆమెకి హృదయం వుంది, దానికి అనుభవం యివ్వాలి' (చలం; గొర్రెపాటి వెంకటసుబ్బయ్య, పు. 287). దీనితో ఏ పేచీలేదు. కాని, యిదంతా తన ద్వారానేనా ? వ్యక్తియత్న ఫలితంగానేనా ? మరొక దానితో దేనితోనూ సంబంధం లేకుండానేనా ? ఆధ్యాత్మిక శృంగారం కిందిమెట్టుతో స్త్రీ శృంగారాన్ని నిలిపిన చలం, స్త్రీని ఎత్తినట్టా, దించినట్టా? అతని ఆత్మసాధనలో స్త్రీ ఒక సాధనం, శృంగారం ఒక ప్రయోగం. 'ఈ ప్రపంచమే నా ప్రియురాలు' (మ్యూజింగ్స్ పు. 79). తన అహం విశాలం (Napolionic Ego?) అది ప్రపంచ పరివ్యాప్తం. ప్రపంచానికి సౌందర్యభావం సృష్టి మూలం. సౌందర్యం స్త్రీ దేహాశ్రితం కాబట్టి శృంగారం ద్వారా స్త్రీ దేహాన్ని మనస్సునీ రాబట్టుకుని, సౌందర్యం అనుభవించి, ప్రపంచం గురించి తెలుసుకుని, తజ్ఞతను విజ్ఞతగా, మోక్షంగా మార్చుకోవాలి. దానికిగాను, ముందుగా స్త్రీని తన బంధనాల నుంచి విడిపించి స్వేచ్ఛా జీవిని చెయ్యాలి.

తాను విప్లవకారుడా? అవుననే తన భావం. వివాహ సంస్థాధ్వంసకుడా? అవును. వివాహం లేకుంటే స్త్రీ పురుష సంబంధాలుండవా యేమిటి? ప్రజలు జతగట్టరా యేమిటి? తాత్కాలిక సంయోగాలుంటే చాలవా? అది సంభవమేగాక వాంఛనీయం కూడా. అమరణ దాంపత్యం స్త్రీ శాశ్వత బానిసత్వమే అయితే నేటి వ్యవస్థలో యిది అరుదు కావచ్చు కాబట్టి వికటవర్తనమనో విశృంఖలత్వమనో అనిపిస్తుంది అందుకని చలం నిగ్రహంతో యిలా రాశాడు.

'నేను వాంఛించే మార్పు యీ వివాహంలోవున్న అక్రమాలు అన్యాయాలు పోవాలని. ఈ దుర్మార్గాలు వొదిలించినంత మాత్రాన అసలు చచ్చేటంత దుర్బలంకాదు వివాహం. అంతే కాకుండా వివాహం వొద్దన్న వాళ్ళకి బలవంతంగా కట్టకూడదనీ. వివాహం అయినంత మాత్రాన సర్వమూ నీతిగా తలచడమూ, కానంత మాత్రాన అవినీతి అనడమూ మూర్ఖమనీ నా వాదన!' (మ్యూజింగ్స్ పు 43).

దాంపత్య మొక్కటేనేమిటి వివాహమంటే? Common Law marriages అంటూ యితర దేశాలలో కొన్ని వున్నాయని. ఆగ్నెస్‌స్మెగ్లీలాంటి స్త్రీలు వాటిని స్వయంగా అమలు జరిపారనీ. అందువల్ల కొంపలంటుకుపోలేవనీ. 'విప్లవకారుల' మనుకునే వారికి గూడా తెలియకపోతే. తెలిసినా నేటి మట్టుమర్యాదల దృష్ట్యా లోకనింద గురించి భయపడి అలాంటి భవిష్యదాశాకిరణాల లేతఃత్తుకల్ని తెగటారిస్తే, ఏం కావాలి? కమ్యూనిజం అంటే అర్థం Community of wives అని ఎవడో అన్నాడని. స్త్రీ సమస్యని తేలిక చెయ్యడం ఎలా తగదో, స్త్రీ పురుషులు యధేచ్ఛామైథునాన్ని అవలంబించే glass of water theory (లెనిన్) అలాగే తగదని నిజమైన విప్లవకారుడు భావించాలి. భావించకుంటే, తప్పు తనదే. నిజానికి. క్రమంగా వీటిని ప్రోత్సహిస్తూ, ప్రతికూల విమర్శకులకు వయాన వీటి విశిష్టతను విప్పిచెప్పి. మరింత విస్తృత పరిధిలో యీ తాత్కాలిక దాంపత్యాలను అమల్లోకి తేవాలి.

## 4

చివరిగా రచయితగా చలం గురించి నాలుగు మాటలు తాను రచయితనే కాననీ, రచన తన పరమోద్దేశంకాదనీ (an end in it self) ఒకటికి పదిమార్లు రాసిన చలం. వినయంతో అలా రాశాడనుకోవడమా లేక కపటంతో రాశాడనుకోవడమా? ఒకటి మాత్రం స్పష్టం. తనవి కల్పనా కధలుకావు కాబట్టి 'ఫిక్షన్' కిందికి రావని

అనుభవని వుండవచ్చు. 'ఫిక్షన్' కానక్కర్లేకుండా. 'ఫిగ్మెంట్ ఆఫ్ ఇమేజినేషన్' అసలే కాకుండా, వాస్తవానుభవం ఒక్కటే ప్రేరణగా ఊహాశాలిత్వం చూపెడుతూ గాఢంగా తీవ్రంగా రాసింది. సాహిత్యం కాకుండా ఎలా తప్పించుకోగలదని ప్రశ్న. అలాగే, తన గ్రంధ పఠనాసక్తి విషయంలోనూ ఆయన రాసిందంతా ప్రత్యక్షర సత్యం కాదు. వినయమే అలా రాయించినా, చివరికి యేమనుకున్నారో ఆయన మాటలే దాఖలా.

'మొదట నేను రాత ప్రారంభించినప్పుడు నేను ఒక రచయితని అవుతానని అనుకోలేదు. ఏవో జరిగిన అన్యాయాలు విని, నా హృదయం నుండి నేను రాసినవి దొంగ నీతిపరుల్లో చలనం పుట్టించడంవల్ల నాకు ప్రోత్సాహం వొచ్చింది. నేను రాసిన మొదట్లోనే కృష్ణశాస్త్రి దీక్షితులు మొదలైన మిత్రులు నాకు గట్టి ఎంకరేజ్‌మెంట్ యిచ్చారు. నేనూ ఒక రచయితనని నన్ను వాళ్లలోకి తీసుకున్నారు. దేశమంతటా విరివిగా నా రచనలు చదివిన వాళ్లనించి విలాపాలు వినొచ్చేప్పటికి నాకు నిశ్చయమైంది, నాకు తెలుగు వాఙ్మయంలో ఒక స్థానం ఉందని. చివరి చివరి కొచ్చేటప్పటికి ఎవరూ రాయని ఏ వాఙ్మయంలోలేని అమోఘమైన రచనలు నానించి వొచ్చాయని రూఢి అయింది. చలం ఒక రచయిత అన్నా సంతోషం లేదు. రచయితని కావాలనేది నా ఆశల్లోనూ, ఆశయాల్లోనూ ఒకటికాదు దానివల్ల నాకేం తృప్తి లేదు. ఇది నా జీవితానికి ఒక biproduct మాత్రమే'. (చలం పు. 325).

'పద్మారాణి', 'శశిరేఖ' వంటివి గ్రాంధిక— వ్యావహారిక సంకరశైలిలో రాసినా, పోను పోను, గిడుగు రామమూర్తి పిడుగులోని జ్వలనశక్తిని లాగేసుకున్నట్టుగా, గురజాడలా ఉచ్చారణనీ, వాడుకనీబట్టి శబ్దాల రూపాలను స్వీకరిస్తూ, ఒకొకప్పుడు 'ఎముకల'ను కూడా బ్రాహ్మణ 'మిర్యాంపిల్లి' పద్ధతిలో 'వెమికలు' చేస్తూ, ఎక్కడి సూత్రాల నక్కడే తెగదించి వచనాన్ని వజ్రాయుధంగా మార్చాడు చలం. వేదననుంచీ నెత్తుటి మూలుగుల్నించీ కోపతాపాల్నించీ ధిక్కార ధోరణితో వెలువడిందనేగాక, శబ్దాలతో దృశ్యాలను కళ్లకు గట్టించగల అనితరసాధ్యమైన ఇంద్రజాలకత్వంవల్ల, తీక్ష్ణతవల్ల, చలం రచనలు షెల్లీ 'వెస్ట్‌విండ్' శక్తిని సంతరించుకోగలిగి, సాహిత్య భాషలోనూ పెను సంచలనం తెచ్చి పెట్టాయి.

మరి, తనకూ టెక్నిక్కూ సగమెరికేనంటాడు చలం. టెక్నిక్ లేక పోవడమే అద్భుతమైన టెక్నిక్. 'సంవిధాన' చాతుర్యమనీ 'విలోమ' పద్ధతనీ, మరోటనీ యింకోటనీ, అర్థాన్ని అధ్వాన్నపుటడవిలో వదలే అనేకులకంటె, యీ విషయంలో

చటం వెయ్యింతలు మెరుగు. అర్థంకానిదంటూలేదు. గూఢార్థాలూ మర్మాలూలేవు. అలాగని వట్టి నిరలంకారతా బట్టతల పద్ధతీలేవు. ఆయా శబ్దచిత్ర నిర్మాణం గాఢకిర్మీర వర్ణాంచితం, ఊహాగరుత్తులతో అదృశ్య లోకాల తలుపులు తోసేసే సుడిగాలిలాంటి రచనాశక్తి, సహజసిద్ధం. రక్తనిష్ఠం అందమా? ఆయన అలాగన్నారుగాని, అప్రియత్న పూర్వకమని మనం అనవచ్చు— పోతన 'సహజ పాండిత్యం'లాగా. చిత్రికలు పట్టడం, చెక్కడం, పోహళించడం, మసాళావెయ్యడం తన పనికాదు. అవన్నీ తక్కువ స్థాయి రచయితల స్వాధిక్యతా ప్రదర్శన తాపత్రయానికే సూచనలు. కళను సృష్టిద్దామని కళావంతులౌతారలాంటి వాళ్లు

కవి ఈశ్వరాంశ సంభూతుడని చలం ఒకచోట రాశాడు (ప్రేమలేఖలు. పు.15) అలాంటివాడికి అదర్శీకరణం, పూర్ధ్వలోక సంచరణం. ముఖ్యంగాని, 'అల్పాలు కల్పించుకుంటున్న క్షుద్రభావాలు'— అంటే 'వాస్తవికత్వం' కాదంటాడు వచనంలో కవిత్వాన్ని పలికించిన చలం కవిత్వానికిచ్చిన నిర్వచనంలోకూడా యీ పారలౌకికమైన అంశ ప్రబలం. 'కవిత్వమంటే భావోద్రేకమనే వెలుగుతోచూడగా పైపొరలు, పైన కమ్ముకున్నదుమ్ము, మాయ, వొదిలి వాటి వెనుక మెరుస్తూ కనపడే నిజస్వరాలు (స్వరూపాలు?)— కవి ఇంకా ఆ సౌందర్య రూపాలవెనక్కి ఇంకా వెనక్కిపోగల దృష్టి సంపాయిస్తే Mystic అవుతాడు'. (అదే, పు. 15–16) చలానికి 'రీజన్' (హేతుబుద్ధి) మీదున్న గురి కంటె స్వభావంలో అంతర్గతంగావున్న సహజాతాల మీద ఎక్కువగా ఉండటం, పై సూత్రీకరణకి అనుగుణమైనదే— 'ఎక్కడ ఏ అంతరాంతర నిగూఢ ప్రాంతాల్లోనో' మనని పాలించే శక్తులున్నాయట (అదే పు. 55–56). ఇక్కడ తర్కం, స్వభావానికి తలవంచాల్సిందే. స్వభావంలోని యీ గూఢశక్తి తనకు అరణ్యస్వేచ్ఛనే యిస్తుంది. తనకి కావల్సింది అదే. (పు. 76) తానున్నది బురదలో, తన ఆత్మేమో ఆకాశంలో. పశుపక్ష్యాదుల స్వేచ్ఛ కావాలి. సంసారం, దాని బరువు బాధ్యతలూ, ఉద్యోగం, దాని నియమ నిబంధనలూ— తన కడుపుకీ హృదయానికీ మధ్య వైరుధ్యాన్ని కలిగిస్తూంచే, రెండింటినీ సంతృప్తిపరిచే ప్రయత్నంచేసి, చేసి, చేసి విసుగుచెందుతూ, 'రెండు రోజులు భోజనం లేకపోతే, నలకూబరుడు కూడా రంభని తలుచుకోడు. రాధకి కడుపునొప్పి వస్తే 'కృష్ణా కృష్ణా' అనడం బదులు 'వామో, వామో' అంటూంది.' అంటూ మనస్సు శరీరం మీద ఆధారపడతుందని అన్న చలమే; కడుపు కక్కుర్తిగాళ్లనీ పైసాయేరుడుగాళ్లనీ అల్పాలనీ క్షుద్రులనీ ఈసడించాడు కూడా. **Man does not live by bread alone** అనే వాళ్లని, alone అనే మాట తీసేసి బతకమంటే చాలు! అయినా మనిషి

మనోబలంతో కల్పనాశక్తితో యోచనతో మృగాలకంటె ఎత్తుకి ఎదిగాడు గనక, సౌందర్యం, మాధుర్యం, ఔన్నత్యం, ఆదర్శం వగైరా అందమైన గాలిబుడగల్లో ఇంద్ర ధనస్సుల సూక్ష్మ ప్రతిబింబాలనుచూసి ఆనందం పొందగలడు పక్షికి గూడు కావాలి. పురుగుకానొల్లదు. కావలసింది దొరకదు, దొరికింది కాబన్లేదు అందుకే వేదన. తాను త్రిశంకువు లౌకిక, పారలౌకికాల మధ్య, శరీర, అశరీరాల మధ్య, వాస్తవ, అధివాస్త వాల మధ్య, అస్తిత్వమే బాధాకులంగా మార్చుకున్న చలం. ఒక వైపు జీవితమే క్షణ భంగురమంటూ మరోవైపు ప్రపంచమే ఆనందధామ మంటాడు. ఇలా అంతర్వైరు ధ్యాలపుట్ట, నిరంతరమైన రొదతో నిండిన తేనెతెట్టె చలం మనస్సు లోకంతోనే కాదు, దానికి సూక్ష్మరూపమైన తనతోనే తాను పోరాటం చేసుకుంటూ సతమతమై, ఉక్కిరి బిక్కిరౌతూ, అందులోంచే తన సాహిత్యాన్ని రావించాడు. తన 'శైలి'ని చూచి మెచ్చు కునే వాళ్ల, తన సాహిత్య వస్తువుని ఈసడించుకునే కపటులని అనుమానం. 'మిమ్మల్ని కదిలించింది నా మాటలు కావు నా మాటలలోని వాస్తవం' (మ్యూజింగ్సు, పు. 240). వీళ్ల 'mealy mou·hed cowards'. styleని పొగడి, ఆ styleని ప్రోత్సహించిన తన బాధని, దాని వెనక మండుతూ 'సిరాలోంచి మీ హృదయాలలోకి పలకాలని చూసే మూగ కంఠాల క్షోభ వినబడకపోతే' తాను వ్రాసియేంలాభం? (అదే, పుట. 192) మరో చోట తనకు అనుచరులే లేరని అంటూ. 'నా రచనలవల్ల సంఘ మేకాదు: ప్రత్యేక జీవనాలు అభివృద్ధిపొందాలని నా ఆశ.' అంటాడు తన అభిప్రాయా లు సరిపడకుండా తన శైలే భేష భేషనే వాళ్ళంటే అరికాలిమంట (ప్రేమ లేఖలు, రెండోభాగం, పు. 47-48). 'అక్షరాలా, పాండిత్యమా, కాదు. సంవత్సరాల మూగ వేదన, అంధకారంలో అన్వేషణ. నాబోటి దీనజీవుల రహస్య హృదయానంతర విషాదం, దిక్కులేని దుర్బలుల జీర్ణ ఆవేశం— ఎవరితోనూ, చెప్పుకోలేని అధమ చారి త్రిల గర్భశోకం— యిదీ నా శైలి!' (అదే, పు. 49) ఇది బాధలోంచి పుట్టింది గనకనే నకిలీ సరుకుగాదు, దిగుమతి సరుకూకాదు. దానికి హృదయ రక్తం జీర లున్నాయి.

ఏమిటీ బాధ? కృశా సొంత బాధ ప్రపంచం బాధయితే, శ్రీ శ్రీ ప్రపంచం బాధని సొంత బాధ చేసుకున్నాడని చలమే అన్నాడు గదా, మరి చలం బాధ?

'ఆనందమా! నాకా? ఏ నిమిషానైన నేననుభవించేది ఆనందమో బాధో, నాకు తెలుసా?.... రాత్రుంకు రాత్రులకు ఇంక ప్రపంచానికి తెల్లవారదమంటో వుందా?

ఆవి నరాల బాధతో, విరహ బాధతో, యీ జన్మ బాధతో, నరాల లోపలి చెప్పలేని బాధతో, అర్థంలేని కారణంలేని బాధతో చీకట్లు చీకట్లు కల్పించుకుంటో యేడ్చిన రాత్రుల' బాధ ' (మ్యూజింగ్సు పు. 149-150).

తనకీ అర్థంకాని బాధని, అస్తిత్వవాదులుచెప్పే angstతో పోల్చి చలాన్ని అస్తిత్వవాదంతో ముడివెయ్యడం ఎంత వరకు సక్రమమో, వాస్తవవిహితమో నాకు తెలీదుగాని. చలం under sexual గనక సెక్సు గురించి, over write చేశాడని మాత్రం చెప్పలేను. అతనికి బాధ మాధుర్యమే— 'బాధా మాధుర్యం'. కృ. శా మాటలా లేదూ ? చలం తనకే తాను పూర్తిగా అంతుచిక్కని తపన, తృష్ణ, వాంఛ, భావం, అభిప్రాయం వగైరాల మిశ్రమం. సంధి యుగలక్షణమని యాంత్రికంగా యీ 'కలగా పులగపు విలయావర్తపు బలవత్ ఝరవత్ పటపర్తన' (శ్రీ శ్రీ: 'కవితా! ఓ కవితా!') ని ఒక్క ముక్కలో తేల్చివేయ్యలేను. 'ఆధ్యాత్మికత' అని తాను భావించిన ఒకానొక ఆత్మోన్నత్య శిఖరాగ్రం వేపు 'మాంసల' (Fleshly) శరీర సౌందర్యపరమైన 'భౌతికత' మీదుగా చేసిన సాహస పూర్వకమైన ప్రయాణం— ఆ క్రమంలోనే అక్రమ మనిపించే అన్వేషణ— చీకట్లో వెదుకులాట— ఎన్నెన్ని విధాలుగానో తోచే చలం వ్యక్తిత్వాన్ని ఫలానా అని చిటికెట్టి చూపడం, నా చేతగాని పని

కాకుంటే, రచయితగా అతనిది అతిశయం, ప్రాగల్భ్యం. 'అతిశయోక్తి లేంది వాఙ్మయమే లదు ' అనే రచయితతో 'అతి సర్వత్ర వర్జయేత్' అని ధర్మ సూత్రం అనడం, పనికిమాలిన పని

ఇంతకీ, ఒక బహిరంతర సంఘర్షణతో గూడిన వ్యక్తిత్వాన్నిచూపే సాహిత్యం గనక, చలం సాహిత్యం కనీసం వివాహ వ్యవస్థ విషయంలో తుఫానులా హోరెత్తించింది. ఇక 'ఆత్మవిద్య' వగైరాలంటారా, అస్మదాదులకు అలివిమాలిన విషయాలు, మావద్ద చెల్లని రూకలు.

చలం సామాజిక విప్లవకారుడా ? కాదు ప్రేమ, పెళ్లి, సెక్సు, సౌఖ్యం విషయాలలో పితూరీదారా ? ఔను, సోషలిస్టా ? కాదు రేడికలా ? ఔను అతని గమ్యం శ్మశానమా ? కాదు. పోని ఉద్యానమా ? అదీ పూర్తిగా కాదు. చలం పూర్తిగా ఏదీ కాదు. హెడోనిస్టా ? స్పిరిచువలిస్టా ? మహానుభావుడా ? ప్రవక్తా ? కాస్త కాస్త. తన జీవితమే విప్లవోద్యమం అంటూ, 'ఇంతకీ నేను చెప్పేదాంట్లో అంత విప్లవకర

మైందేమీ లేదు.' అనగల మనిషిని 'మహా మనీషి, అనో, ఋషి' అనో అని ఆయనకు చేసేదల్లా సత్కారంకాదు, అపచారమే. తనకంటె శ్రీ శ్రీదే విప్లవకరమైన సాహిత్య మని గ్రహించాడు అయితే 'వృద్ధ ప్రపంచానికి' 'కొత్త tonic' తయారుచేసింది. యీ యిద్దరిలో ఎవరు ? క్రుద్ధ వృకోదరుడి గదాఘాతం శ్రీ శ్రీ కవిత్వం. విధ్వంసనమే దాని పరమార్థంకాదు— 'నవ ప్రపంచ నిర్మాణకర్తల ఉత్సాహం' నిశాంతం— 'ఉషా గమనం' (Sic). (మహా ప్రస్థానం—యోగ్యతాపత్రం). తన లోపాన్ని శ్రీ శ్రీ పూరించాడని తెలుసుకున్నాడు చలం. ఈ నిజాయితీయే అతని బలం.

కావలి

31-3-1980. —— కె. వి. రమణారెడ్డి



# చలం సాహిత్య జీవితాదర్శ తాత్పర్యం?

## I

మహిళా జనం యొక్క దయనీయ స్థితిగతులను బాగుపరచాలనే ఆలోచన, రాజా రామమోహనరాయ్ సతీసహగమనాన్ని ఎదుర్కొన్నప్పటి నుండీ, భారతదేశం నలుమూలలా పొటమరించటం ప్రారంభమైంది. భారతీయ భూస్వామ్య సాంప్రదాయిక ఆచార వ్యవహారాలను గురించి మానవతా దృక్పథంతోనూ, హేతువాద దృక్పథంతోనూ ఆలోచించటమూ, ఆచరణలో ఎదురు తిరిగి ప్రవర్తించటమూ రెండింటికీ కూడా అదే ప్రారంభం. ఆ ప్రారంభము యొక్క కొనసాగింపే వీరేశలింగం పంతులుగారి సంఘ సంస్కరణోద్యమం. అందులోనే గురజాడ అప్పారావుగారూ, రఘుపతి వెంకటరత్నం నాయుడుగారుకూడా వున్నారు. పురాణ భారతీయ సంప్రదాయ జీవన ఆలోచనా విధానం పునాదులు కదలించిన త్రిపురనేని రామస్వామిచౌదరిగారిని కూడా ఆ ఉద్యమంలో భాగంగానే చెబితే— ఆ నలుగురూ తలా ఒక రకంగా చలం సామాజిక సాంస్కృతిక జీవిత దృక్పథాన్ని ప్రభావితంచేసి వుండటానికి ఆ చారిత్రిక సాంఘిక పరిస్థితులు అనుకూలించాయి. ఆ నలుగురి ఆలోచన ధోరణులూ ఆచరణ విధానాలూ అనుకూలంగాగానీ, ప్రతికూలంగాగానీ చలం సాహిత్య జీవితంలో అడుగడుగునా కాకపోయినా అక్కడక్కడైనా స్పష్టంగానే కన్పిస్తాయి.

1920లో చలం రచయితగా బయలుదేరేటప్పటికి ఆధునిక తెలుగు సాహిత్య రంగంలో రాయప్రోలు సుబ్బారావుగారి అభినవకవిత దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి నాయకత్వాన భావకవిత్వంగా పరిణమిస్తున్నది. రాజకీయ రంగంలో జాతీయోద్యమ కార్యక్రమంగా సహాయ నిరాకరణోద్యమం ఉవ్వెత్తుగా లేవటానికి ప్రారంభించింది. వామపక్షవర్గసంఘర్షణ చారిత్రిక దృక్పథం యువతరంలో చోటుచేసుకోవటం మొదలయింది.

ఇరవయ్యో శతాబ్దంలో క్రమంగా 1920 నాటికి స్త్రీలకు బాల్య వివాహాలు చేయటం కాస్త తగ్గుముఖం పట్టింది. అందుకు భారత బ్రిటిషు ప్రభుత్వం వివాహ సంస్కరణ శాసనాలు చేయటానికి సుముఖంగా వుండటం కూడా తోడ్పడింది. ఎంతో

ముందునుంచే హడావుడిచేస్తూ 1929 సెప్టెంబరులో శ్రీ హరవిలాస్ శారదగారి శారదా చట్టం రానేవచ్చింది ఇదంతా చలం స్త్రీ వివాహ జీవితం గురించి వెనకాముందులాలోచించి సామాజిక జీవిత విమర్శకుడయిన రచయితగా ధైర్యసాహసాలతో ముందుకు రావటానికి వీలిచ్చిందనటానికి మాత్రమే! స్త్రీ—పురుషుల వివాహ సమస్య అది వ్యక్తిగతమైందిగా పైకి కనిపించినా నిజానికది జటిలమైన సామాజిక సమస్య ఆ విషయాన్ని పైకి రానీయకుండా సంప్రదాయ ఆచార వ్యవహారాల పునరుద్ధరణ దృక్పథంగల తిరోగామి సమాజం మీద విరుచుకపడ్డాడు చలం ఆ పడటంలోనే ఆయన సంస్కరణవాదుల నధిగమించి 'విప్లవ' వాదిగా కనిపిస్తాడు గతాన్ని పునరుద్ధరించుకోవలసిన ఆదర్శంగా ఒకరకం జాతీయవాదులు ప్రచారం చేస్తున్న కాలంలో మంచిగతమున కొంచెమేనోయ్ అన్న అప్పారావుగారి మాటను పట్టుకొని వర్తమానంలోనూ, భవిష్యత్తులోనూ స్త్రీ గురించి ఆమె అనుభవించే పురుష దాస్య విముక్తి గురించీ ఆలోచించిన నిజాయితీగల మేధావి చలం.

మొదటి ప్రపంచయుద్ధం ఫలితంగా ఇంగ్లీషు నవలా సాహిత్యరంగంలో కుటుంబ సంప్రదాయ ఆచార వ్యవహారాల మీద 1920 నాటికే తిరుగుబాటు మొదలయింది. ముఖ్యంగా లారెన్సు రచనల తరువాత సెక్సు విషయాల్లో నలుగురూ కలిసి మాట్లాడుకోటానికి వీలుకాని రహస్య విషయాలంటూ ఏమీలేకుండా పొయ్యాయి. వివాహ వ్యవస్థ స్త్రీ—పురుషులకు సంకెళ్లు వేసి అస్వతంత్రులనుగా చేస్తున్నదని అందుకు వ్యతిరేకంగా తిరుగుబాటు ప్రవృత్తులను తన సాహిత్యంలో ప్రదర్శించిన సోమరసెట్‌మాం ప్రభావం కూడా ఇంగ్లీషు నవలమీద పడింది ఇందుకు తోడు మానవ మనఃప్రపంచపు లోతుపాతుల్లోని భావసంచలనాలను చిత్రించిన రష్యను నవలా రచయితల ప్రభావం కూడా వుంది. ఈ రకంగానూ, ఇంకా చైతన్య స్రవంతి నవలా రచయితల రచనలవల్లనూ అప్పటికప్పుడే తెలుగు నవలా రచయితలు ఇంగ్లీషు నవలల పరిచయాన్నిపొంది ప్రభావాలకులోనై అనుసరణకు ఆరంభించారని చెప్పటం కుదురదేమోకానీ సమకాల ప్రపంచ సాహిత్య కళాకారుల ఆలోచనా ధోరణులలో సామ్యం చూడటం తప్పుకాదు.

విదేశీ సాహిత్య ప్రభావాన్ని అలావుంచినా ఆ కాలంలో ముఖ్యంగా రాజకీయాల్లోలాగే సాహిత్య విషయాల్లో కూడా భారతీయ ప్రాంతీయ భాషా సాహిత్యాలకు బెంగాలీలు కొంత మార్గదర్శకులయినారు ఆ విషయంలో రవీంద్రునీ, శరత్‌బాబునూ వాళ్ల రచనలనూ, ఆలోచనా ధోరణులనూ గమనించటం అవసరం.

జాతీయోద్యమం వీర జాతీయవాదుల నాయకత్వంలో నడుస్తున్న కాలంలోనే చలం రచయితగా ఎదగటానికి ప్రారంభించాడు. ఒకర్ని ఒకరు అణచివేయటమన్నది ఏ రూపంలో జరిగినా, ఏ పరిధిలో జరిగినా అణచివేతకు గురిఅవుతున్నవారి పక్షాన నిలబడి పోరాడటం వీరజాతీయవాదం లక్ష్యాల్లో కదురుకొంటున్న కాలమది రచయితగా చలం తీవ్రవాద సామాజిక భావజాలంతో స్త్రీ స్వేచ్ఛా సంపాదనను విషయంగా చేసుకొని రచనలు చేయటానికి తగిన దోహదకారి వాతావరణం దేశంలో వుంది జాతీయ విప్లవకారుల సంఘాలు—గదర్‌పార్టీ— The bravest deed is the safest అనే సూత్రాన్ని పట్టుకొని దేశంలోనూ, విదేశాల్లోనూ రహస్యంగానూ, బహిరంగంగానూ ప్రవర్తిస్తున్న కాలమది. స్త్రీలు కూడా పురుషులతో సమానంగా ప్రవర్తించేటట్లు వాళ్లకు ధైర్య సాహసాలు కల్గించటంకూడా జాతీయ (టెరరిస్టు) విప్లవకారుల కార్యక్రమంలోవుంది. అఖిలభారత స్థాయిలోవున్న ఈ వాతావరణానికితోడు తెలుగు దేశంలోని సంఘ సంస్కరణోద్యమాలు స్త్రీ సమస్యలను ఆధారంగా చేసుకొన్నవి వుండనే వున్నాయి. సహాయ నిరాకరణోద్యమంలో స్త్రీలు చొరవతో పాల్గొంటున్నారు. ఇటువంటి పరిస్థితుల అనుకూల, ప్రతికూల ప్రభావాల విలక్షణ చైతన్యంతో చలం తన రచనల ద్వారా స్త్రీలు తమ స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కొరకు పోరాటమార్గాలను ఎన్నుకోటం గూర్చి ప్రచారం చేశాడు

ఒక రచయితనుగానీ, ఒక రచనను గానీ ఆయన పుట్టిపెరిగిన అది ఉత్పత్తి అయిన సాంఘిక చారిత్రిక సందర్భాలతో సంవదింపజేసి అధ్యయనం చెయ్యటమొక్కటే ఆచరణకూ, వైరుధ్యాలకూ పరిష్కార రూపంలో సాధింపబడిన విలువలను అంచనా కట్టటానికి మార్గం.

స్త్రీ పురుషుల పెళ్ళి సంబంధాల గురించిన చలం ఆలోచనల అధ్యయనానికి Engels యొక్క Origion of the Family, కొంత సహాయ పడవచ్చు. తాపీ ధర్మారావుగారి 'పెళ్ళి పుట్టుపూర్వోత్తరాలు' కూడా కాలం కలిసివస్తే పనికి రావచ్చు

# II

భూస్వామ్యం పునాది కదలకుండా, బ్రిటీషు వలస రాజ్యమైనందున అందుకు తగు మాత్రంగా కేపిటలిస్టు వ్యవస్థ లక్షణాలుగల బూర్జువావర్గ సమాజంలోని చలం ఎటూ ఆ రకం మనస్తత్వంతో వుండక తప్పదు అయితే మేధావిగా, రచయితగా చలం

అభ్యుదయ నిరోధక పక్షంగాక, అభ్యుదయ సాధక పక్షంలో వున్నాడు ప్రాచీన సంప్రదాయ ఆచార వ్యవహారాలు వర్తమాన జీవిత పరిస్థితులతో అనుకూలంగా సంవదించక పోవటాన్ని, ప్రతికూలంగా ప్రవర్తించటాన్నీ చూడగలిగిన పెటీబూర్జువా అభ్యుదయ శక్తి సామర్థ్యాలు విమర్శనాత్మక వాస్తవికతా దృక్పథంతో జీవిత పరిస్థితులను విశ్లేషించగలవు. అందులోని అభ్యుదయ నిరోధక లక్షణాలను తొలగించుకొనేందుకు ప్రేరేపించేవిగానూ, కాల్పనిక భావాభినివేశంతో విప్లవించటాన్ని ప్రబోధించేవిగానూ వుండే సాహిత్య కళారూపాలను ఆ శక్తి సామర్థ్యాలు సృష్టించగలవు చలం సాహిత్యమంతా ఆ విధంగా రూపుగట్టుకొన్నదే సమకాల సాంఘిక చారిత్రిక వాతావరణ ప్రభావాల్లో మనుషులు ముఖ్యంగా స్త్రీ పురుషులు అన్ని బంధాలతోపాటు వివాహ బంధానికి కూడా లోనుకాకుండా యధేచ్ఛగా పరస్పరం గొప్పగా అనుభవించటాన్ని దాని సాధకబాధకాలతో చిత్రించటం ద్వారా బాధకాలను తొలగించుకొంటూ, సాధకాలను సమకూర్చుకోటానికి సామాజికులకు ప్రేరణ ఇయ్యటమే ఆయన కథలకూ, నవలకూ కూడా అంతర్యం. అందులో విశేషమేమిటంటే పెటీబూర్జువా జాతీయ సాంస్కృతిక దృక్పథాలు వాటి అల్పత్వాలతోనూ, అసమగ్రతలతోనూ, అసమర్థతలతోనూ, అనుచితత్వాలతోనూ, నగ్నంగా బయటపడతాయి. అందుకే 'మనసు మారకుండా, ఆత్మఅభివృద్ధి చెందకుండా, ప్రపంచమంటే అర్థం కాకుండా' (ఆనందం 81) వుండేవాళ్లు చలం సాహిత్యానికి భయపడతారు.

అప్పటికి దేశానికి స్వాతంత్ర్యం వచ్చిందో ఇంకా రాలేదో అసలు స్వతంత్రం అంటే అర్థమేమిటీ అని ఆలోచనలోపడ్డ చలం 1948లో దేశికాచారి వాచకంగా ఇలా వ్రాశాడు. (జీవితాదర్శం 17) 'పరుల ప్రభుత్వం బానిస ప్రభుత్వమే. కానీ మనమీద బరువైకూచోదు. ఎవరో చెప్పిందాకా, ఆలోచించుకొన్నదాకా బానిసత్వమనిపించదు. తెల్లారిలేస్తే పెద్దలకీ, కుటుంబాలకీ, ఇంటిపక్కల మనుషులకీ, పురోహితుడికీచేసే దాస్యం యెన్నడన్నా మనుషులకు తట్టిందా?' నిజంగా స్వాతంత్ర్యాన్ని ప్రేమించే మనిషి దేని నుంచి ముందు బయట పడతాడు? అని. అంటే విదేశీ ప్రభుత్వం నుండి ముక్తిని సాధించుకోటమొక్కటే చాలదు. సామాజికులయిన స్త్రీ పురుషులిద్దరూ ఒకరి నుండీ ఒకరు స్వతంత్రంగా వుండటం ఎవరికి వాళ్లకు అది సొంత హక్కు. దాన్ని సాధించుకోటంలో అవసరమైన పోరాటానికి సంసిద్ధపడాలన్నదే దేశికాచారి మాటల్లోని చలం అంతర్యం.

చలం సాహిత్యం మొత్తానికి ఒకటే ఒక మోటో వుంది. అదేమిటంటే

'Freedom and Equality for the Oppressed Sex'. 'ఏదీ ఎవరి హక్కూ కాకూడని' సామాజిక వ్యవస్థ కావాలి. ఈ లక్ష్యాన్ని సాధించటానికి చలం అనుసరించిన రచనా రీతి అదుకనుకూలపడేదా లేదా అన్నది ఆయన అన్ని రకాల రచనలనూ అధ్యయనంచేసి దహారం మీద బేరీజువేసి చెప్పవలసిన మాట

'ప్రజలలో స్వతంత్రేచ్ఛ విరివిగా వ్యాపించిన కొద్దీ వారిని మోసగించి నిద్రపుచ్చగల నేర్పు ప్రభుత్వానికి అవసరమవుతుంది ... ఇల్లాంటిది ఆఫీసుల్లో, ఇళ్ళల్లో కూడా జరుగుతూ వుంటుంది'. (మ్యూజింగ్స్ 3. పు 8. 9) ఇళ్ళల్లో జరుగుతున్న మోసానికంతటికీ తనొక్కతే ఏలా గురిఅవుతున్నదో, తనకా విషయంకూడా తెలిసి రాకుండా వుండేందుకు కుటుంబ జీవితవ్యవస్థనెంత బలంగా పురుషాధికారం కాపాడుతూ పోషించుకొంటూ వస్తున్నదో చలం బట్టబయలు చేశాడు. ముఖ్యంగా అతని నాటక సాహిత్యానికున్న విలువే అది.

# III

స్త్రీకి స్వేచ్ఛ కావాలనటం— ఆమె దాస్య శృంఖలాలను ఆమె తిరుగుబాటుచేసి తెంచుకోవాలనటం— అంతా మంచిదే. స్త్రీకిగానీ పురుషుడికిగానీ అసలు స్వేచ్ఛ లేకుండా పోవటానికి కారణభూతమైన సామాజిక చారిత్రికాభివృద్ధికి సంబంధించిన ఆలోచన ఉండవలసినంత శాస్త్రీయంగా ఉండకపోవటమే చలం సాహిత్య జీవితానికి పట్టిన గ్రహణం ఆయా ఆర్థిక వ్యవస్థలో మానవ సంబంధాలను నియంత్రించే సాంఘిక రాజకీయ న్యాయ మత తాత్విక వ్యవస్థల ప్రభావాలకు లోనవుతూ, స్త్రీ పురుష సంబంధాలతోనూ, హక్కులతోనూ, బాధ్యతలతోనూ అనేక పరిణామాలు చెందుతూ వస్తున్న కుటుంబ జీవిత చరిత్రనూ, దాని భవిష్యత్పరిణామాన్నీ పట్టించుకోకుండా పురుష దాస్యం నుండి స్త్రీ విముక్తి అని వట్టి ఉపరితలంలో బయలుదేరితే కలిగే మంచీ చెడూ రెండూ చలం సాహిత్య జీవితంలో వున్నాయి.

సాంఘిక జీవితమెటూ లేదు. ఆ ఉన్న కుటుంబ జీవితంలో కూడా స్త్రీకి తెంపు చేసి అనుకోగలిగితే తనదీ అని అనుకోటానికి తనకున్నది తన శరీరం ఒక్కటే. దాన్నే సాధనంగా చేసుకొని స్త్రీ తన స్వేచ్ఛను ప్రకటిస్తుందనీ ప్రకటించాలనీ, చలం తన రచనల ద్వారా చూపించి 'స్త్రీ రచ్చకెక్కినప్పుడు పురుషుల స్థితి యేవిధంగా 'ఎఫెక్టు' అవుతుందా అని ఆలోచించు' (ఆనందం 69) కొనేటట్లు షాక్ చేశాడు.

సమాజాన్ని. స్వేచ్ఛాప్రణయం భావకవిత్వంలో పురుషుడి ముఖంగా నడుస్తుంటే చలం దాన్ని స్త్రీ ముఖంగా నడిపించి వాళ్లనూ షాక్ చేశాడు ఆ విధంగా తన ప్రతి రచన లోనూ చలం స్త్రీని 'రివల్యూషనరీ రొమాంటిక్ హీరోయిన్' అన్నట్లుగాచేసి నిలబెట్టాడు. (చూడు మ్యూజింగ్ 3-184)

ఒక విధంగా చలం రచనలు పురుషస్వామ్య సామాజిక వ్యవస్థకుపట్టిన దురహంకారపు దయ్యాలను వదలగొట్టే లక్ష్యంగలవని చెప్పాలి. అందుకని తప్పనిసరియై తన సాహిత్య జీవితాన్ని సెక్సీగా చూపిస్తాడు చలం పైపైన చూచేవాళ్లకు ఆయన ఆ విధమైన స్త్రీ స్వేచ్ఛకు మాత్రమే మద్దతు ఇస్తున్నాడనిపిస్తుంది విదానించి చూస్తే అది అత్యంత తిరస్కృత వాచ్యంగా ధ్వనిస్తుంది. చలంగారి నవలల్లోని రివల్యూషనరీ రొమాంటిక్ హీరోయిన్సును చూస్తే శశిరేఖ ఆత్మహత్య చేసుకుంది. పద్మావతి చచ్చిపోయింది. రాజేశ్వరి మైదానంలో వుండిపోయింది. సుందరమ్మ మరణించింది అరుణ అసలు అంతు చిక్కకుండా అయిపోయింది. ఎందుకిలా వీళ్ల జీవితాలకు మరణాలనే పరిష్కారంగా చేశాడు రచయిత ? వ్యవస్థమీద తిరుగుబాటు చేసిన స్త్రీల జీవితాలు సుఖ సంతోషాలతో గడుస్తున్నట్లు చూపించటం రచయిత కిష్టంలేదా ? వుంటే ఎందుకు చూపించలేదు ? వుండాలని వున్నందుకు గుర్తుగా దాన్ని జీవితాదర్శంగా ఒక్క లాలస విషయంలో చూపించాడు అంతే. గోపాలరావు ఎటూ వివాహ వ్యవస్థ ముద్రవేసిన భర్త గనుక అతనితో రవణ పట్నంలో కాపురం చెయ్యటంలో విశేషం లేదు. అందువల్ల చలం స్త్రీ పురుష సంబంధాలు సక్రమంగా అంటే అధికారానికీ, వంచనకూ, భయానికీ లోనుకాకుండా వుండే వ్యవస్థనే కోరతాడు అది రావటానికి స్త్రీలు తిరగబడి సంసార జీవితంలో అరాజకత్వాన్ని సృష్టించట మొక్కటే మార్గమన్నట్లు అలాగే రచించాడు. అంతమాత్రంచేత ఆతను 'అరాజకత్వాన్ని' అభిలషిస్తున్నట్లు కాదు అసలు అనార్కిజం యొక్క పర్యవసానం ఒకరి అధికార నిర్బంధాలతో ప్రమేయం లేకుండా ప్రతి వ్యక్తీ సామాజిక స్పృహా చైతన్యంతో ప్రవర్తించట మంటాడు అప్పుడు స్వచ్ఛంద ప్రేమమయంగా స్త్రీ పురుషుల సంసార జీవితముంటుందన్నమాట. అలాంటి జీవితం కొరకు స్త్రీ పురుషులు ఆలోచించుకోటానికి ప్రాతిపదికగానూ, ప్రేరణగానూ చలం తన రచనల్లో అనార్కిజాన్ని ప్రవేశ పెట్టాడనటం సమంజసమవుతుందేమో ఆలోచించాలి. Platonic love, Philistinism- ఈ రెండు ఆలోచనా ధోరణుల ప్రభావం కూడా ఈ విషయంలో చలం సాహిత్యంమీద పడిందేమో చూడటం మంచిది. ముఖ్యంగా Keats Platonism సంగతి ఆలోచించవచ్చు రాయప్రోలు వారి అమలిన శృంగారం

మరీ స ృకాలంలోది కొత్త వ్యవస్థను నిర్మించుకోటానికి వీలుగా పాతవివాహ వ్యవస్థను ఎంతగా పడగొట్టాలో అంతగా పడగొట్టి పెట్టాడు చలం. సామాజిక సాంసారిక జీవిత నిర్మాణ కార్యక్రమంలో పూర్వార్థాన్ని పూర్తిచేసి, ఉత్తరార్థ నిర్మాణానికి కావలసిన భావ ప్రేరణ కలిగించాడు ఆయన సాహిత్యానికి ఆయన ఆశించిన ప్రయోజనమే అది.

రచనా విధానంలో విమర్శనాత్మక వాస్తవికతా విధానాన్ని అవలంభింపక విప్లవాత్మక కాల్పనికతా విధానాన్ని అవలంభించటంచేత పాఠకులను సులభంగా ఆకర్షించ గలిగాడుగానీ, తాను వాళ్ళకు సక్రమంగా అర్థం కావటానికి తగిన వసతిని కల్పించలేక పోయినాడు. అందువల్ల ఉత్తరభారతంలోని పెరరిస్టు ఉద్యమాన్నీ, తెలుగు దేశంలోని రంపఫితూరీనీ జాతీయోద్యమ నాయకులెంత విముఖతతో స్వీకరించారో చలం సాహిత్యాన్నీ కూడా అప్పుడు భాషా సాహిత్య విద్యోపాధ్యాయులంత విముఖతతోనే స్వీకరించాను. అంతటి రచయిత పుట్టిన ప్రయోజనాన్ని ఈ తెలుగు సమాజం ఇప్పటికీ పొందకుండా వుండటానికి అదే కారణమేమో!

అఖిల భారత రాజకీయాల్లో అంబేద్కర్, ఆంధ్ర సాహిత్యంలో చలం— ఇద్దరూ ఏమి సాధించారో ఏమి సాధించలేదో చెప్పటానికి ఎన్నో విషయాలు తెలియాలి.

# IV

చలాన్ని విమర్శించి వ్రాయటంలో ఉన్న చిక్కుకు కారణం ఆయనే అసలు గొప్ప విమర్శకుడు కావటం. విమర్శనయొక్క ప్రయోజనమెప్పుడూ కూడా విషయాన్ని అర్థం చేసుకోటానికీ, అర్థవంతంగానూ అభీష్టాలకు అనువుగానూ మార్చుకొంటూ ఉన్నతంగా అభివృద్ధి చేసుకోటానికీ దోహదకారిగా వుండటం విమర్శన విమర్శన రూపంగానే వుండాలని లేదు సృజన కళారూపాలుగా వుండవచ్చు. చలం నవలలనూ, నాటకాలనూ, కథలనూ అర్థం చేసుకోటానికి ముందుగా ఆయన ప్రేమలేఖలూ, ఆనందం, స్త్రీ, మ్యూజింగ్సూ గట్టిగా చదవటం అవసరం చలం సాహిత్యాన్ని విమర్శించటానికి పడవలసిన అవస్థలు పడలేకనే ఇంతకాలం నుండీ తెలుగు వాళ్లు చలాన్ని చదువుతున్నారుగానీ చదివిన దానికంటె ఎక్కువ తిడుతున్నారు. చలం గొప్ప విమర్శకుడంటే అర్థం తన రచనా దృక్పథాన్నీ, తన సాహిత్య జీవితాన్నీ తానే అనేక సందర్భాల్లో చాటుమాటుగా ఉన్నట్లుండి సూత్రప్రాయంగానే అయినా బాహాటంగా విమర్శిస్తాడని. ఆ సూత్రాలను పట్టుకొని వాటి మార్గదర్శకత్వంలో బయదేరితే కొంత లాభముంటుంది. ఆ విధంగా ఆయన సాహిత్య జీవితాదర్శాన్ని అధ్యయనం చెయ్యాలి

ఏ రకమైన భౌతిక ప్రతిబంధకాలూ బంధాలు కాకూడదు గౌరవస్నేహ మర్యాదలుగల అన్యోన్యానురాగ మొక్కే గీటురాయి. ఆ విధంగా ఏర్పడ్డ స్వేచ్ఛా సంసర్గం మీదనే స్త్రీ పురుషుల సామాజిక కుటుంబ జీవన సంబంధాలు ఆధారపడి వుండాలి స్త్రీకి చలం ఈ రకమైన స్వతంత్ర జీవితం ఏర్పడాలనుకొన్నాడు. ఆయన సాహిత్య జీవిత తాత్పర్యం మీ విధంగానే కనిపిస్తున్నది. అయితే అది వాస్తవిక సత్యంగా ఆచరణలో అవతరించాలంటే సోషలిస్టు సమాజ వ్యవస్థ ఏర్పడి అభివృద్ధి చెందటంలో వుంటుంది. అందువల్ల రచయితగా చలం జాతీయోద్యమం విజయవంతమై దేశంలో సోషలిస్టు సామాజిక వ్యవస్థ ఏర్పడుతుందనీ, అప్పుడు స్త్రీ కుటుంబ జీవితంలో సమున్నత స్థానాన్ని పొందుతుందనీ ఒక గొప్ప ఆశతో అందుకనువుగా భావవిప్లవాన్ని ప్రేరేపించటం లక్ష్యంగా రచనలు చేశాడు. తెలిసి చేశాడా అంటే ఆయన సాహిత్య జీవితాదర్శ తాత్పర్యమదే అయితే అంతా కాకపోయినా కొంతైనా తెలిసి చేసినట్లే చెప్పాలి

ఏం చెప్పినా శ్రీ ఈదారెడ్డి చెప్పాలి. అంతకంటే గూడా తెలిసిన వాళ్ళు చెప్పాలి.

హన్మకొండ.

25–4–1980

డా. కేతవరపు రామకోటిశాస్త్రి



# నివేదనం

నేను విద్యార్థిగా ఉంటున్న (1959–'61) కాలం నుండే చలం సాహిత్యాన్ని అభిమానంతో చదివేవాణ్ని. మిత్రులు నవీన్, బాసిరి సాంబశివరావు, ముదిగొండ వీరభద్రయ్యగారలు నేను కలిసి చలం సాహిత్యాన్ని గూర్చి చర్చించుకునే వాళ్ళం. చలం భాష, శైలి, ఆయన కథలూ, అందులోని స్త్రీల అనూహ్యమైన ప్రవర్తనల్లోని మలుపులు, వారి కాల్పనిక శృంగారం, సౌందర్య దృష్టి, అనుభవతీవ్రత మమ్ములను బాగా ఆకర్షించాయి. సాధారణంగా ఆ దశలో విద్యార్థులకు చలం సాహిత్యంపై అభిమానం ఎక్కువగా ఉంటుంది: ఎందుకంటె వ్యక్తి జీవితంలో విద్యార్థిదశ కాల్పనికదశ కాబట్టి.

చాలా కాలం తరువాత చలం సాహిత్యంపై Ph D. చేద్దామని ఉస్మానియా విశ్వవిద్యాలయం చుట్టు తిరిగాను. కాని అవకాశం లభించలేదు. 1977లో కాకతీయ విశ్వవిద్యాలయంలో M. Phil లో చేరడం జరిగింది. ఇక్కడ నా పరిశోధన పర్యవేక్షకులు డా. కేతవరపు రామకోటిశాస్త్రిగారు 'చలం నవలలు–సామాజిక స్పృహ' అనేవిషయాన్ని పరిశోధనకు నిర్ణయించారు. ఈవిధంగా ఈసిద్ధాంత గ్రంథాన్ని రాయడంజరిగింది.

M. Philలో పాఠ్యప్రణాళిక వినూత్నంగా సాహిత్య విషయాలను వివిధ దృక్పథాలతో వివేచించటానికి వీలుగాను, ఉపయోగపడేదిగాను ఉన్నది. సాహిత్యాన్ని చారిత్రిక, సామాజిక, సాంస్కృతిక, ప్రగతిశీల ప్రతీకాత్మకంగా ఎలా పరిశీలించాలో బోధించడం జరిగింది. ఈ దృక్పథంతో చలం నవలా సాహిత్యాన్ని పరిశీలించడం జరిగింది. వ్యక్తిలోని కాల్పనిక ఆవేగం వెనుక సామాజిక, సాంస్కృతిక స్పృహ ఉంటుందనే దృష్టితో నవలలలోని విషయాన్ని వివేచించడం జరిగింది. నా పరిశోధన పర్యవేక్షకులు డా. కేతవరపు రామకోటిశాస్త్రిగారు ఈ ఆలోచనను రూపుదిద్దడంలో ఎంతో తోడ్పడ్డారు. ఈ విధంగా చలం నవలలకు సంబంధించినంత వరకు నా పరిశోధన ఒక చర్చగా, ఒక ఆలోచనగా, సామాజిక చైతన్య లక్షణంతో కొనసాగింది.

చలం చాలా సంక్లిష్ట సాహితీ వ్యక్తిత్వం కలవాడు. అతనిని స్పష్టంగా అర్థం చేసికొనడానికి అతని సాహిత్యాన్ని నిదానంగా అధ్యయనం చేయడం అవసరం. అలా చేయక అతనిని వివాదాస్పదమైన వ్యక్తిగా నిలబెట్టి సమాజంలో కలవరం పుట్టించడం సాహిత్య విమర్శకు ధ్యేయం కాకూడదు. వివాదాస్పదమైన వ్యక్తిత్వం వెనుక ఉన్న సామాజిక సాంస్కృతిక అంశాలను శాస్త్రీయంగా పరిశీలించాలి. ఈ దృక్పథంతో చలం నవలా సాహిత్యాన్ని పరిశీలించడం జరిగింది.

ఈ సిద్ధాంత వ్యాసాలను రూపొందించడంలో నేనొక పద్ధతిని అవలంబించాను. ప్రతి నవలలోని కథను సూక్ష్మంగా చెప్పటం, దాని మీద సంగ్రహంగా విషయ విచారణ చేయటం జరిగింది. తత్ఫలితంగా విషయాన్ని సులభంగా అర్థం చేసుకోడానికి వీలు అవుతుందని భావించాను. చలం నవలలు ఎనిమిదింటినీ ఇందులో పరిశీలించటం, వాటిల్లో ఆయన స్ఫురింపచేసిన సామాజిక, సాంస్కృతిక సమస్యల పరిష్కారాలను నిరూపించటం జరిగింది. కాల్పనిక రచయిత అయిన చలంయొక్క సామాజిక చైతన్య లక్షణాన్ని నిరూపించడం ఒక్కటే ధ్యేయంగా నేనీ గ్రంథాన్ని రాశాను.

ఈ సిద్ధాంత వ్యాస రచనతోపాటు చలం సాహిత్యానికి సంబంధించిన సమగ్రమైన వాఙ్మయ సూచికను శక్తివంచన లేకుండా కృషిచేసి తయారు చేశాను.

చలంగారిని ఒకసారైనా కలిసి మాట్లాడి ఆయన అభిప్రాయాలు తెలిసికోవడం ధర్మమే అయినా, ఆయన దూరంగా రమణాశ్రమంలో ఉండి నాకు ఆ అవకాశం ఇచ్చే స్థితిలో లేకపోవడంవల్ల ఆ పని చేయలేకపోయాను 1

నన్ను M. Philలో వాత్సల్యంతో ప్రోత్సహించిన మా గురువులు డా. కోవెల సుప్రసన్నాచార్యులు, డా. మాదిరాజు రంగారావుగార్లకు కృతజ్ఞతలు. నాకు ఇంటర్వ్యూ ఇచ్చి తమ అమూల్యాభిప్రాయాలు తెలిపిన శ్రీ గోరాశాస్త్రి, శ్రీమతులు రంగనాయకమ్మ పరిమళా సోమేశ్వర్, అనందా రామంగార్లకు మరియు చలం వాఙ్మయ సూచికను సిద్ధం చేయడంలో సహాయపడిన సర్తకిగారికి కృతజ్ఞతలు.

నా సిద్ధాంత వ్యాసాలను వ్రాతలోనూ, ముద్రణలోనూ సరిచూడడంలో సహకరించిన మిత్రులు శ్రీ డి.వి. నరసింహాచార్యులు, శ్రీ ముదిగొండ వీరభద్రయ్యగారలకు, అందంగా ముద్రించిన మయూరి ప్రింటింగ్ ప్రెస్, హన్మకొండ మరియు పనివారికీ, చలం బ్లాకును ఇచ్చిన మిత్రులు శ్రీ వి. వరవరరావుగారికీ, టైటిల్ వ్రాసి ఇచ్చిన కళాకారులు శ్రీ రాజా భద్రయ్యగారికి కృతజ్ఞతలు.

నా ఈ పుస్తకాన్ని చదివి చలం గురించి ఇంకా లోతుపాతుల్లో అధ్యయనం చేయటానికి మార్గదర్శకంగా తమ దృక్పథాన్ని వ్రాసిన శ్రీ కె. వి. రమణారెడ్డిగారికీ, నా గురువులు శ్రీ కేతవరపు రామకోటిశాస్త్రిగారికీ నా హార్దిక కృతజ్ఞతలు.

హన్మకొండ

15-5-1980. వెన్నవరం ఈదారెడ్డి

---

1. చలం జననం 18 మే, 1894; మరణం 4 మే, 1979.

# విషయసూచిక



( అనుబంధం · చలం వాఙ్మయ సూచిక )





# చలం వాఙ్మయ జీవితం

గుడిపాటి వెంకటచలం ఆధునిక తెలుగు సాహిత్య రంగంలో 1921 నుండి 1950 వరకు దాదాపుగా మూడు దశాబ్దాలు అచలంగా నిలబడి సృష్టించిన సాహిత్యం 'చలం–సాహిత్యం' అనే పేరుతో ప్రసిద్ధి చెందింది.[1] ఇతడు 'విప్లవ ప్రణయ రచయిత[2]'గా; 'సంసారిక విప్లవ సాహిత్య సమ్రాట్టు[3]'గా; 'సెక్స్ వాఙ్మయ బ్రహ్మ[4]'గా తెలుగు దేశంలో ప్రఖ్యాతి వహించాడు

తెలుగు సాహిత్య చరిత్రలో అనంతర ప్రబంధయుగం నుండి వీరేశలింగం పంతులు వరకు భోగప్రధానమైన కామ, శృంగారాలతో కూడిన క్షుద్ర ప్రబంధాలు రచించబడ్డవి అందుకే వీరేశలింగం, ప్రబంధాలవల్ల మేలుకన్నా కీడే ఎక్కువ జరిగిందని గర్హించాడు [5] జాతి జీవితం ఈ విధంగా నిర్వీర్యమైపోయిన సమయంలో ఆవిర్భవించి ధర్మ బాహ్యమైన మూఢాచారాలతో కూడిన జాతిని సంస్కరించబూనాడు. వీరేశలింగం పంతులు (1848–1919) సాహిత్యం ద్వారా సాంఘిక దురాచారాలను ఎత్తిచూపించి ప్రజలు తమ్ము తాము సంస్కరించుకోవడానికి తగిన ప్రేరణ కల్గించాడు. ఉపాధ్యాయ వృత్తిలో ఉండి, రచనా ప్రవృత్తితో సమాజానికి సంస్కార బలం కలిగించాడు.[6] సంఘ సంస్కారోద్యమంతోపాటు తెలుగులో వివిధ సాహిత్య ప్రక్రియలకు అంకురార్పణ గావించాడు. వ్యవస్థలో స్త్రీ కోల్పోయిన వ్యక్తిత్వాన్ని పునరుద్ధరింప చేయటంలో ఎక్కువగా ఇతని సంస్కరణోద్యమం తోడ్పడింది. ఈ ఉద్యమ ప్రభావం చలానికొక స్ఫూర్తి నిచ్చింది.[7] 'స్త్రీ జాతిని జాగృతపరచడంలో చలం తన రచనా కాలంనాటికి ఎంతో ముందు చూపు కలిగిన రచయిత'.[8]

ఫ్రాంసులో వాల్టేర్‌వలె, బెంగాల్‌లో రాజారామమోహనరాయలవలె పంతులు గారు తెలుగు దేశంలో పరిశ్రమించారు. పంతులుగారి సంస్కరణోద్యమం తెలుగు దేశంలో సాంస్కృతిక పునరుజ్జీవనానికి తోడ్పడింది. ఆధునిక తెలుగు సాహిత్య వికాసానికి పాశ్చాత్య సాహిత్యం, భారత జాతీయోద్యమం బాహ్య శక్తులుగా రూపొందగా; స్త్రీ పురుషుల సాంసారిక జీవితంలోని అన్యోన్యాన్ని గురించిన ఆలోచన [illegible]

శక్తిగా పనిచేసి సాహిత్యంలో సుప్రతిష్ఠం కావడం జరిగింది. తత్ఫలితంగా రాయప్రోలు నవ్య కవిత్వారంభకుడైనాడు. అలాగే గురజాడ కూడా మానవతాదృక్పథంతో నవ్య కవిత్వానికి స్ఫూర్తిని ఇచ్చాడు. ఈ శతాబ్దపు తొలిసంవత్సరాల్లో (1910-1930) చారిత్రిక, సాంఘిక, దేశభక్తి నవలలు వ్రాసిన నవలాకారులలో చిలకమర్తి, వేంకట పార్వతీశ్వర కవులు, ఉన్నవ లక్ష్మీనారాయణ ముఖ్యులు. వీరిలో గురజాడ, చిలకమర్తి రచనలు చలాన్ని చిన్నతనంలో బాగా ఆకర్షించాయి[9]

18వ శతాబ్దంలో జె. జె. రూసో (1712-78)చే ప్రతిపాదింపబడిన స్వాభావికతాపునరుద్ధరణవాదం యొక్క ప్రేరణతో ఉదయించిన మానవతావాదం ఆంగ్ల సాహిత్యంలో కాల్పనిక కవిత్వానికి (Romantic Poetry) మూలమైంది మానవతా వాదం వ్యక్తి చైతన్యానికి తోడ్పడింది.[10] ఆంగ్లసాహిత్యంలో రాజకీయ ధార్మికభావాలే రొమాంటిసిజానికి దారి తీసాయి. ఆనాటి ఆంగ్ల రొమాంటిక్ సాహిత్యంలో పాత సంప్రదాయాలపై తిరుగుబాటు, సాంఘిక నైతిక శక్తుల ప్రభావం, స్వతంత్ర రచనాభి వ్యక్తి కనబడుతుంది. ఆనాటి రొమాంటిక్ కవులు పారిశ్రామిక నాగరకతను నిరసించారు. నాగరకతా పరిసరాలను వదలి పారిశ్రామిక ప్రభావంలేని ప్రాంతాల్లో జీవించారు. షెల్లీ, బైరన్ ఇటలీ, గ్రీకులలో; వర్డ్సువర్తు, కోలరిడ్జులు పల్లె ప్రాంతాల్లోని చెరువు గట్లమీద నివసించారు. డేవిడ్ థోరూ ఒక చెరువుదగ్గర కాలం గడిపాడు. పారిస్ నగరంలో నివసించే సింజ్ ఐర్లాండ్ గ్రామాల్లో నివాసం ఏర్పాటు చేసుకున్నాడు కాబట్టి ఆనాటి ఆంగ్ల రొమాంటిక్ కవులు మంచిచెడ్డలను తాత్వికులవలె చెప్పడం కాకుండా వాని లోనారసి, జీవితాల్లో దర్శించారు. వీరు మానవ ప్రవృత్తులలోని రహస్యాలను, ఆవేశాలను, ఇంద్రియ శక్తులను, మానవ ప్రకృతికిగల సంబంధాలను పరిశీలించారు. వీరి రొమాంటిక్ కవిత్వం నిగూఢ మార్మికత్వంతో, తాత్విక దృష్టితో, ప్రగాఢ కవితా భావావేశంతో నిండిపోయింది. వీరు ఏ ఇజాన్ని ఆశ్రయించక ప్రకృతిని, దైవత్వాన్ని ఆశ్రయించారు. ఇటువంటి ఆంగ్ల సాహిత్యంలోని రొమాంటిక్ తత్వం తెలుగు సాహిత్యంలో ఇరువదవ శతాబ్దంలో ప్రవేశించింది. ఇది కృష్ణశాస్త్రి కవిత్వంలో పరాకాష్ఠ నందుకొన్నది భావకవులలో చలానికి, కృష్ణశాస్త్రి నండూరి సుబ్బారావుగారలు ఆరాధ్యులు. ఆంగ్లభావకవితా ఉద్యమానికి, తెలుగు భావకవితా ఉద్యమానికి దాదాపు ఒక శతాబ్దం వ్యత్యాసముంది.

ఈ కాల్పనికోద్యమ కాలంలో నవలా సాహిత్యానికి చలం, విశ్వనాథ, బాపిరాజుగారలు ప్రతినిధులు. జాతీయోద్యమం, పాశ్చాత్య నాగరకతల ప్రభావం వీరిపై గాఢంగా పనిచేసింది. తత్ఫలితంగా వీరు తాము గాఢంగా నమ్మిన సిద్ధాంతాల ప్రచారం కొరకు నవలలను వ్రాసారు. ఇందులో చలం ఆద్యంతం రొమాంటిస్ట్.11 తరువాత విశ్వనాథ, శ్రీ శ్రీలు భావకవితామార్గం నుండి తప్పుకొని భావ, భౌతికవాద సాహిత్య ప్రస్థానకులైనా; చలం రొమాంటిస్ట్‌గానే మిగిలిపోయాడు విశ్వనాథ, బాపిరాజు తాము ఏర్పరచుకొన్న స్థిరమైన దృక్పథాలతో నవలలను వ్రాసారు. చలం తనకున్న సందేహాలతోనూ, తాను పోరాడిన భావాలతోనూ నవలలను వ్రాయడం జరిగింది. చలం లేవనెత్తిన సమస్యల పర్యవసానంలోని బాగోగులను ప్రత్యక్షంగా విశ్వనాథ, బాపిరాజులు తమ నవలలలో చూపారు. విశ్వనాథ సాహిత్యంలో నేపథ్యంగా ఉండే సంప్రదాయం, చలం సాహిత్యంలో ఆంతరంగికంగా తరంగితమైన సౌందర్య దృష్టి బాపిరాజు సాహిత్యంలో కనబడుతుంది. చలం వ్యక్తిలోని అవ్యవస్థవల్ల కలిగే దుష్పరిణామాలను తన నవలలలో చూపెట్టగా, విశ్వనాథ, వ్యక్తి వ్యవస్థను ఎలాభంగ పరుస్తున్నాడో చూపాడు.

కాల్పనికోద్యమం జర్మనీలోపుట్టి ఆంగ్ల, ఫ్రెంచి దేశ సాహిత్యాలను ప్రభావితం చేసింది. అక్కడ సంప్రదాయానికి వ్యతిరేకంగా ఇది బయలుదేరింది. 'ఈ కవిత్వ ప్రధాన గుణములు 1. ప్రకృతిప్రీతి 2. గత వైభవ పునరుద్ధరణము 3 ప్రణయతత్వం 4. ఆత్మాశ్రయత్వము 5. అద్భుతత్వము 6 సాహస ప్రియత్వము'12 అంతేగాక 'రొమాంటిసిజం యొక్క ముఖ్య లక్షణాలు భావావేశం, వ్యక్తిత్వ ప్రకటన, చింతాక్రాంత హృదయం, మధ్యయుగపు నాగరకత ఎడల అభిమానం, శిథిలావశేషాల యెడల శ్రద్ధ, ప్రకృతి రహస్య పరిశోధన, మానసిక శక్తుల వ్యక్తీకరణ, ప్రకృతి జీవితం యెడల ఆశ్చర్యజనకమైన దృక్పథం, నూతన విషయాలను శోధించడంలో అమితోత్సాహం, సామాన్య నిరాడంబర జీవితాన్ని ఆరాధించడం, ప్రజాస్వామిక దృష్టి' 13 మరియు 'బుష్‌వంటి కొందరు విమర్శకులు క్లాసికల్ రొమాంటిక్ సాహిత్యాలకుగల తేడాను విస్పష్టంగా చెప్ప ప్రయత్నించారు. క్లాసికల్ సాహిత్యం వాస్తవానికి సన్నిహితంగా, నాగరిక జీవితానికి సంబంధించినదిగా ఉండగా, రొమాంటిక్ కవిత ఆదర్శంవైపు మొగ్గుతూ, జానపద జీవితాన్ని ఆశ్రయిస్తుంది. ఒక దానిలో మేధ, మరొక దానిలో భావనాశక్తి ప్రాధాన్యం వహిస్తాయి. సంప్రదాయాన్ని

ప్రతిపాదించేదొకటికాగా, తిరుగుబాటు మరొక దానికి ఊపిరి. క్లాసిజమ్‌కు వస్తువు లోకపు సమస్యలు, అందరినీ కలవరపరచే రాజకీయ, మత, తాత్విక విషయాలు: రొమాంటిక్ కవితకు వస్తువు వైయక్తిక సమస్యలు, వ్యక్తిపరమైన ఆలోచనలు, అనుభవాలు, తాత్విక చింతనలు. దోషరహితంగా, అలంకార భూయిష్టమైన రచన ఒకటికాగా, భావతీవ్రత మరొకదానిని ఆశ్రయిస్తుంది. నియమబద్ధమైన, సంప్రదాయ సిద్ధమైన రచన ఒకటికాగా, వ్యక్తిత్వాన్ని పోషించే రచన మరొకటి'[14] ఈ రొమాంటిక్ లక్షణాలు స్త్రీ పురుషుల ప్రణయంలో అన్వయించి సంఘ సంస్కరణకు చలం పూనుకొన్నాడు. ప్రేయసీ ప్రియుల మధ్య సంబంధాన్ని 'కూరిమి' అని 'అనురాగం' అని, 'వలపు' అని పూర్వ కవులు పిలిచేవారు. భావకవుల వలననే 'ప్రేమ' అనే పదం 'వలపు'కు పర్యాయపదంగా ఉపయోగంలోనికి వచ్చింది.'[15] కాల్పనిక దృష్టి వైవాహిక రంగంలో ప్రేమకు ఎక్కువ విలువను ఇచ్చింది. ప్రేమలేని వివాహాన్ని తిరస్కరించింది.[16] సులభసాధ్యంకాని ప్రియురాలిని ఆరాధించడమే రొమాంటిక్ ప్రేమ అని రస్సెల్ అభిప్రాయం.[17] భావకవిత్వం అమూర్త భావాల్ని, అదృశ్య రూపాల్ని, ప్రతీకలద్వారా రూపు కట్టిస్తుంది.[18] కాల్పనిక ప్రవృత్తి స్వేచ్ఛగా సౌందర్య దర్శనం చేస్తుంది. స్వేచ్ఛా చిత్తవృత్తితో తాను దర్శించిన సౌందర్యానికి అక్షరరూపం ఇవ్వడమే రొమాంటిక్ కవిత్వం.[19] ఇట్టి సౌందర్యాభిరతితో స్వేచ్ఛగా సమాజగత సంప్రదాయాలనేగాక, కావ్యకళా సంప్రదాయాలను కూడాకాదని అభివ్యక్తిలో కాల్పనిక కవులు స్వతంత్రతను కనబరచారు. ఇటువంటి రొమాంటిసిజం యొక్క మౌలిక స్వరూపం కృష్ణశాస్త్రిగారి కవితలో చోటుచేసుకుంది. భావకవులు ఊహా ప్రేయసులతో కాలం గడిపారు. వీరి ప్రేయసీప్రియులకు సాంఘికములైన కట్టుబాట్లు లేవు. సామాజిక దృక్పథంలేని ఈ కాల్పనిక ప్రియులు వ్యవస్థలో సంచరించునపుడు కలిగే విషాద పరిణామాలను చలం తన నవలలలో చూపాడు. అయితే చలం రచనా ధోరణి కాల్పనికతకు అనుకూలంగా ఉన్నట్లు విచిత్రంగా, అసాధారణంగా స్ఫురించుట చేత అతని సాహిత్యం తీవ్ర అలజడిని సృష్టించింది.[20]

కవితారంగంలో ఈ భావకవితా చిత్తవృత్తి పురుషునివైపు నుండి సాగితే; చలం ఈ చిత్తవృత్తిని స్త్రీ ప్రవృత్తి నుండి తన సాహిత్యంలో చూపించాడు. అందుకే చలం స్త్రీలు స్వేచ్ఛ కొరకు వ్యవస్థతో పోరాడినట్లు కనబడతారు. కందుకూరి వారి

చలం నవలలు

సంస్కరణవాదంగాని, నవ్య కవిత్వపు అమలిన శృంగారతత్వంగాని, గురజాడ మానవతా దృక్పథంగాని, భావకవుల కాల్పనిక చిత్తవృత్తిగాని స్త్రీలకు సమాజంలో, సంస్కరణ రంగంలో కావలసిన ధైర్యం, ఆత్మవిశ్వాసం అంతగా కలిగించినట్లు తోచదు. అటువంటి స్థితిలో రొమాంటిక్ దృక్పధాన్ని భావకవులవలె పురుషునిపై పెండి సాగించక, స్త్రీ పరంగా రూపొందించి సామాజిక చైతన్యానికి చలం ప్రధాన కారకుడయ్యాడు.

స్త్రీని వ్యాపార వస్తువుగా, ఆస్తిగా భావించి అమ్ముకునే కొనుక్కునే సమాజంలో జరిగే వివాహ వ్యవస్థను వీరేశలింగంపంతులు నుండి అందరూ వ్యతిరేకించారు. ఆయన శిష్యుడు అయిన చలం అదేపని చేసాడు. తన ఇచ్ఛాప్రవృత్తితో సంబంధం లేకుండా తానొక వస్తువుగా మరొక పురుషునకప్పగింపబడినపుడుగాని; తన ఇష్టంకాని వానిచేత అనుభవింపబడటం తప్పనిసరి అయినప్పుడు స్త్రీ లేచిపోతుంది. లేకపోతే ఆత్మహత్య చేసికొంటుంది. అటువంటి స్త్రీలకు గుండె ధైర్యం కల్గించడానికి చలం సాహిత్యం ఉపకరించింది సమాజం మూఢ విశ్వాసాల నుండి తేరుకొనుటకు స్త్రీలు లేచి పోవడమే మంచిదని ప్రోత్సహించాడు. వృద్ధులు డబ్బులుపెట్టి కన్యలను కొనుక్కొని వివాహం చేసికొనుట, వాళ్ళు చావగానే వీళ్ళు వితంతువులగుట జరుగుచున్నది. ఆ వితంతువులు దుర్భరమైన జీవితాన్ని గడపడం, అలాకాకపోతే అక్రమమార్గంలో ప్రవర్తించటం, ఇదంతా సమాజానికి మంచిదికాదని విధవలకు వివాహాలు చేయడమే శ్రేయస్కరమని వీరేశలింగంపంతులు ఉద్యమించాడు. ఆయన శిష్యుడైన చలం ఇష్టములేని భర్తలను వదలి వచ్చిన వాళ్ళతో లేచిపొమ్మన్నాడు. అప్పుడైనా స్త్రీలను అమ్మేవాళ్ళకు, కొనుక్కొనే వాళ్ళకు, వధువుల ఇష్టంలేకుండా పెళ్ళిళ్ళుచేసే పెద్దలకు జ్ఞానోదయం కలుగుతుందని ఆశించి, చలం రచనలు సాగించాడు. ఈ గురుశిష్యుల ప్రభావం సమాజంపై సత్ఫలితాలను ఇచ్చింది.

స్త్రీ స్వేచ్ఛను అనుభవించడానికి తగిన స్థితిలో లేదు. పురుషులు మితిమీరి స్వేచ్ఛగా ప్రవర్తించుట జరుగుచున్నది. వేశ్యల పుట్టుకకు కారణమైన సమాజం, వేశ్యా వృత్తిని నీచంగాచూచి అసహ్యించుకొనగా ఆనాటి సంస్కారవాదులు తీవ్రమైన వ్యాఖ్యానాలు చేసారు. కట్టమంచి రాంలింగారెడ్డి వంటివారు కూడ కులస్త్రీలను తెగడి వారకాంతలనే మెచ్చుకొన్నారు.[21] ఇటువంటి వారిలో చలం అతివాది. దీనినిబట్టి ఆనాటి

సామాజిక చైతన్యం

సంస్కారవాదులు వేశ్యావృత్తిని ప్రచారం చేస్తున్నట్లుగాదు. వేశ్యావృత్తిని మాన్పడానికి, వారికి ఆత్మవిశ్వాసాన్ని కలిగించి ఆ దుర్వృత్తి నుండి కాపాడటానికి, పాపాలు చేసినప్పటికి పశ్చాత్తాపంతో సన్మార్గానికి రావడానికి ఉద్దేశించిన దృక్పథం అది. ఇట్లు తీవ్రమైన అభినివేశంతో వ్యవస్థ విచ్ఛేదనానికిగాక, వ్యవస్థను సంస్కరించడానికే చలం కృషి చేసాడు.

సమాజంలో స్త్రీల ప్రవృత్తులను, కోరికలను నిర్దాక్షిణ్యంగా అణచివేసినా అట్టి స్త్రీలు వ్యభిచరిస్తారని, తద్వారా నాగరిక సమాజానికి ఎంతో నష్టం కలుగుతుందని తన సాహిత్యంలో ధ్వనింపచేసాడు. అయితే చలం తన నవలలలో స్త్రీ స్వేచ్ఛగా తిరిగి వివాహ వ్యవస్థను ధిక్కరించినట్లు తెలుపుతాడు. అందులకు దారితీసిన సామాజిక, వైయక్తిక, రొమాంటిక్ ప్రవృత్తులను కూడా చూపుతాడు. అటువంటి పరిస్థితులలో ఆ స్త్రీ అలా చెయ్యక తప్పదని తెలియచేయాలన్నదే చలం ఉద్దేశ్యం. అట్టి స్త్రీని పతిత అని దూషించక ఆమె ప్రవృత్తిని సమర్ధించినట్లుగా, ఆమె పక్షాన వ్యాఖ్యానిస్తున్నట్లుగా నవలలలో కనబడతాడు. నిజానికి అతడు వ్రాసింది పతితల చరిత్రయే 22 అయితే పాఠకులకు చలం ఆ విపరీతిని ప్రోత్సహిస్తున్నాడనే భ్రమ కలుగుతుంది. నిజానికి అలాంటి క్షుద్రపరిస్థితులు లేని వ్యవస్థనే చలం కాంక్షిస్తున్నాడు. అయితే మేలిమి అతని సాహిత్య లో పరోక్షంగా లభిస్తుంది. చలం వివాహ వ్యవస్థను వ్యతిరేకిస్తాడనేది ఎక్కువ ప్రచారంలో ఉన్న అంశం వివాహ వ్యవస్థలోని లోటుపాట్లను తొలగించడానికే అతి తీవ్ర దృక్పధాన్ని కలిగియున్నాడని భావించవచ్చును 23 అందుకే వివాహంలోని పవిత్రతను, విగ్రహాన్ని, ఏకపత్నీవ్రతాన్ని, పాతివ్రత్యాన్ని వ్యతిరేకించలేదు 24 సమాజం, మొనాగమీ, గమముల వైపుకు ఎదగాలన్నదే చలం ఆశయం.25 అయితే వీనిని మానవాళిపై బలవంతంగా రుద్దకూడదన్నదే చలం భావం దానితోపాటు వానిని సమాజంలో మనస్ఫూర్తిగా ఆచరించకపోతే వచ్చే అశాంతి, అలజడి ఈర్ష్యా ద్వేషాలూ చాల భయానకంగా ఉంటాయనేది చలం నిజజీవితంలో రుచిచూచిన చేదు నిజాలను సాహిత్యంలో ధ్వనింపచేసాడు. వ్యక్తి, విజ్ఞానంతో దమంవైపు ఎదగాలన్నదే అతని ఆశయం. స్త్రీ ఉత్పత్తి మాతృకకాబట్టి పురుషునివలె స్వేచ్ఛగా వ్యవహరించ వీలు లేదు సృష్టి ఆమెపై ఉంచిన ఈభారాన్నిచూచి పురుషుడు స్వార్ధంతో, కామంతో, గౌరవం పేరు మీద తన క్రౌర్యాన్ని చూపెడుతున్నాడనే విషయాన్ని చెప్పాడు. వీనితో పాటు స్త్రీ తన సహజ ప్రవృత్తు ను నిగ్రహించుకోకుండా, పరిస్థితుల తోడ్పాటుతో స్వేచ్ఛగా

తిరిగితే అనుభవించే పతనావస్థను చూపాడు. అయితే స్త్రీ పతనాన్ని విమర్శించక, ఆమె ప్రవర్తనను సమర్థిస్తూ, రొమాంటిక్ స్ఫూర్తితో వ్రాసాడు. పాఠకులు చలం నవలల లోని పురుషుని క్రౌర్యాన్ని మరచారు. స్త్రీ పతనదశను మరచారు. కాని చలం ఆ స్త్రీ-పురుషులలో వర్ణించిన శృంగారం, సౌందర్యం, స్వేచ్ఛలను మాత్రమే పాఠకులు గ్రహించి చలాన్ని అపార్థం చేసుకున్నారు.26 అందులకనుకూలంగానే చలం కూడ కొంతవరకు వానిని సమర్థించుకునేందుకు సమ్యగ్దృష్టితోగాక, పాక్షికంగా సాంఘిక విలువలను అధిక్షేపించు దృష్టితో వ్రాసి అపార్థానికి గురైనాడు.

చలం జీవితాన్ని సెక్సు వైపునుండి చూసాడు. జీవితానికి సెక్సువల్ల లభించే ఆనందం ముఖ్యం. అది వివాహ వ్యవస్థలో లభించనపుడు స్త్రీ స్వేచ్ఛగా వ్యవస్థనుండి బయటపడాలని చెప్పాడు. వ్యవస్థ వ్యక్తి అస్తిత్వాన్ని మరచినపుడు, స్తబ్దంగా ఉన్నప్పుడు దానిని చైతన్యవంతం చేయడానికి వివాహ వ్యవస్థే అక్కరలేదన్నంత తీవ్ర స్థాయిలో చెప్పాడు. చలం కేవలం ఆనందానికి, అందులో సెక్సు ద్వారా కలిగే ఆనందానికీ, దాని విశృంఖలత్వానికి పట్టాభిషేకం చేయలేదు. సెక్సు ద్వారా ఆనందం లభించిన దానికి అతీతమైన సౌందర్య దృష్టివైపు కళ్ళు తెరువుడని చెప్పాడు. భౌతికవాదులకు కాల్పనికలోకాలను చూపాడు. కాల్పనికవాదులకు భౌతికసుఖాలను చూపాడు. వ్యవస్థలో సుఖం లభించకపోతే, ధిక్కరించుమని చెప్పాడు. స్వేచ్ఛలో శరీరంద్వారా నీచమైన సహజాత ప్రలోభాలకి తలొగ్గ కూడదని స్త్రీలను హెచ్చరించాడు. ఆయన ఏ దృక్కోణంతో సమస్యను పరిశీలిస్తాడో ఆ దృష్టితో ఆ విషయాన్ని రొమాంటిక్‌గా సమర్థించి వ్రాస్తాడు కాబట్టి ఆయన అభిప్రాయాలు పరస్పర విరుద్ధాలుగా కూడా కన్పిస్తాయి. వ్యవస్థలో సెక్సు ఆనందానికి నీతి అడ్డం వచ్చినపుడు దానిని అధిక్షేపించాడు. ఈ ఆనందానికి డబ్బు, మర్యాదవంటి కృత్రిమ విలువలు అడ్డు వచ్చినపుడు వానిని తిరస్కరించాడు స్త్రీకి ఆర్థిక స్వావలంబనం కావాలని కోరాడు ఆది కమ్యూనిస్టు వ్యవస్థలో లభిస్తుందంటే. ఆ వ్యవస్థను ఆహ్వానించాడు. మరొకసారి ఆ వ్యవస్థలో స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలు ఉండవంటే దానిని ధిక్కరించాడు, ఇలా చలం వ్యక్తిత్వం అతని సాహిత్యంలో ప్రతిబింబించింది. స్త్రీ-పురుషులు సమరసంగా సృష్టిలీలను కొనసాగిస్తూ వ్యత్యాసాలు లేని దివ్యానుభూతులను పొంది సమాజంలో ఒదిగి పోవాలన్నదే చలం ఆశించిన జీవిత పరమార్థం వివాహంలోని లోపాలు పోవడానికే వివాహమే అవసరం

లేదన్నంత తీవ్ర సంచలనకారి దృక్పధం (Shock treatment out look). తో సాహిత్యంలో దర్శనమిస్తాడు.[27] "తిరుగుబాటు ఆదర్శం తిరుగుబాటు అవసరం లేక పోవడం. టాగూరు అన్నట్లు తుఫాను ఆదర్శం శాంతి" [28] అన్నదే చలం సాహిత్య లక్ష్యం. సెక్సును కేవలం ధర్మంగా గుర్తించారేగాని వాంఛగా తలుపలేదు చలం నాటి వృద్ధవరులు.[29] ఆ వాంఛలోని తీవ్రతను చూపి. అది అల్పాంశమైనప్పటికీ, మానవుని మూర్తిమత్వం పైన దాని ప్రభావం అధికంగా ఉంటుందని సమాజాన్ని హెచ్చరించాడు. చలం కాల్పనిక రచయిత కాబట్టి ప్రేమకు అలౌకిక సౌందర్యాన్ని ఆపాదించి సాహిత్య రచన గావించాడు. అంతేగాని అతని సాహిత్యం అశ్లీలంకాదు.[30]

చలం మొదలు బ్రహ్మసమాజ వేదాంతం చేత 'ఈశ్వరుడు' అనే అలౌకిక శక్తిని, దాని సౌందర్యాన్ని ఆరాధించాడు. తరువాత అతనికి జీవితంలో సంభవించిన కొన్ని విషాద సంఘటనల (కుమారుడు రవి మరణం) వల్ల కలిగిన హేతువాద ప్రశ్నలకు అతనిలోని ఈశ్వరతత్వం సమాధానాలనిచ్చి తృప్తి పరచలేకపోయింది. వయస్సు, అది కల్పించిన కల్లోలాలను అదుపులో పెట్టలేనిమనస్సు, దాన్ని స్వేచ్ఛగా వదిలిపెట్టే పాశ్చాత్యభౌతిక విజ్ఞానం తోడుకాగా 'స్త్రీ'ని ఆరాధించాడు స్త్రీ ఆరాధనా వలయంలో మోహవాయువులు తాకటంవల్ల అతనిలో అలజడి, అశాంతి రేకెత్తినవి. తరువాత 'స్త్రీ'ని వదలి రమణాశ్రమంచేరి ఈశ్వర ధ్యాన సాధనలో పడ్డాడు. చలం జీవితంలో ఇదిఒక క్రమ పరిణామం. రొమాంటిక్ ఈశ్వరవాదిగామారే అవకాశంఉంది. అంతేగాని నేటి చలంలో నాటి చలం లేడనీ, నాటి చలంలో నేటి చలం లేడనిచెప్పటం సమంజసం గాదు.[31]

తెలుగునవలా సాహిత్యంలో 1872 నుండి 1920 వరకు రచనాపద్ధతిని రెండు భాగాలుగా చేయవచ్చును. 1872 నుండి 1900 వరకు ఒకదశ, రెండవదశ 1900 నుండి 1920 వరకు. 1920 నుండి 1940 వరకు మూడవదశ 1921 నుండి చలం తెలుగునవలా సాహిత్యరంగంలో కనబడతాడు. మొదటిదశలో తెలుగునవల వచన ప్రబంధ స్థాయిలో సంఘ సంస్కరణ లక్ష్యంగా సాగింది. ఈ కాలపు రచయితలలో క్లిష్ట సమాస రచన కానిపిస్తుంది. రెండవదశలో మధ్యతరగతి జీవితం ప్రతిబింబించింది. ఆ రచయితలు నీతినియమాలకు, సాంఘిక విలువలకు అధిక ప్రాధాన్యాన్ని ఇచ్చారు. ఈ దశలో చారిత్రిక, దేశభక్తికి సంబంధించిన

విషయాలుకూడా కనిపిస్తాయి. మూడవదశలో రొమాంటిక్ దృక్పథంతో తమభావాలను ప్రతిబింబించే పాత్రలను సృష్టిస్తూ ఇంతకు పూర్వం వచ్చిన సాంఘిక నవలలకు, తరువాత వచ్చే మనోవైజ్ఞానిక నవలలకు వారధిగా రచనలు సాగించారు. ఈకాలంలో చలం, విశ్వనాథ, బాపిరాజులు ధృవతారలై ప్రకాశించారు.

చలం తన సమకాలీన సమాజంలోని సమస్యలనే స్పృశించాడు. మత విశ్వాసాలలోని అంధత్వాన్ని విమర్శించాడు. మానవతా దృక్పథంతో స్త్రీల సమస్యలను చర్చించాడు. కాని వాని వెనుకఉన్న శాస్త్రీయాంశాలు వివేచించలేదు.[32] స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను రొమాంటిక్ దృష్టితో అనుభూతివాదంతో స్పృశించాడు. చైతన్య ప్రవంతి రచనాపద్ధతి, మార్మికవచన కవితారచన, వ్యక్తివాద కాల్పనికత్వం; అస్తిత్వ వాదలక్షణం మున్నగు లక్షణాలు అతని నవలలలో కన్పిస్తాయి.

చలం తెలుగు సాహిత్యంలో నవ్యమార్గంలో పయనించి రచన కావించిన వారిలో పేర్కొనదగినవాడు. ఇందులకు పాశ్చాత్య సాహిత్య సంస్కారం చలాన్ని ఎంతగానో ప్రభావితం చేసింది. అంతేగాక ఠాగూర్ బ్రహ్మ సమాజ ప్రభావం కూడా చలంపై ఉంది. 'దేశం ఇట్లానే గొడ్డుపోయి, ప్రస్తుతం వొచ్చిన గ్రంథాలకన్న గొప్పవి రాకపోతే తప్ప 1900 సం॥ తరువాత ప్రచురించిన పుస్తకాలలో ఒకటి కూడ కొంతకాలం తరువాత నిలవదు.

మన సారస్వతంలో (New channels of thought and path of art) అభిప్రాయాలలో కొత్త కాలవలూ, కళలో కొత్త మార్గాలూ ప్రారంభించిన వాళ్ళు కొద్ది మంది వున్నారు. వాళ్ళలో నేనొకణ్ణి. ఈ కాలపు రష్యన్, ఫ్రెంచి కథలూ నాటకాలలో ప్రశస్తమైన వాటి రకాల్ని తెలుగులోకి ప్రవేశపెట్టాను. పశ్చిమ సారస్వతం లోంచి స్కాట్ తరవాతి ఉద్దేశ్యాలేమీ తెలుగులోకి రానేలేదు. ఇంతవరకు నేను కొన్ని మంచివి వ్రాశాను. కాని నా టెక్నిక్ and ఐడియాస్ చాల పాశ్చాత్య వాతావరణాన్ని సూచిస్తాయి.'[33] అని చలం చెప్పాడు.

స్కాటు తరువాత వచ్చిన నవలాకారుల గురించి క్లుప్తంగా చెప్పటం సమంజసమని తోస్తున్నది. ఎందుకంటె వారి ప్రభావం చలంపై ఉంది కాబట్టి.

## సామాజిక చైతన్యం

స్కాటు తరువాత చార్లెస్ డికెన్స్ (1812–1870) తన నవలలలో మానవతా వాదాన్ని ప్రతిపాదించాడు.

థాకరే (1811–1863) తన నవలలలో చైతన్యవంతమైన జీవిత విమర్శ గావించాడు.

జార్జియాలియట్ (1819–1880) మనస్తత్వశాస్త్ర పరంగా పాత్రల అంతర్మథనాన్ని, దాన్ని ప్రభావంచేసిన వారసత్వ లక్షణాలను నవలలలో చూపాడు.

జార్జిమెరిడిత్ (1829–1909) నవలలలో స్త్రీలు ప్రధాన భూమికను వహిస్తారు.

థామస్ హార్డీ (1840–1928) నవలలలో విధి తన వివిధ రూపాలలలో మానవ జీవితాలను ఎట్లు మారుస్తుందో చూపాడు ఇతని నవలలలో బీదలు, అణగారిన అర్తులు కనబడతారు.

హెచ్. జి. వేల్సు (1886–1946) జీవితాన్ని హేతువాద దృష్టితో చూసి సంప్రదాయ మూఢాచారాల నుండి ప్రజలను మేల్కొల్పునట్లు రచనలు చేసాడు.

వర్జీనియావుల్ఫ్, జేమ్సుజాయిస్ (1822–1941) తమ నవలలలో చైతన్య స్రవంతి కళారూపాన్ని ప్రవేశపెట్టి నవలా సాహిత్యంలో కొత్త మలుపును తెచ్చారు.

హక్సలే (1894–1964) తన సిద్ధాంతాల ప్రచారం కొరకు నవలలను సాధనంగా వాడి పాఠకుని మేధస్సునకు ఆవేశాన్నిగాక, వివేచనాన్ని కలిగించాడు.

డి. హెచ్ లారెన్స్ (1885–1930) నవలలలో పురుషుడు స్త్రీకి అధీనుడైనట్లు తెలిపి స్త్రీ–పురుషుల సమస్యలను కవితా దృష్టితో చిత్రించాడు 34

1948నకు పూర్వం తెలుగు నవలా సాహిత్యంలో కాల్పనిక దృక్పథాన్ని ప్రవేశపెట్టిన వారిలో చలం ప్రముఖుడు. కాల్పనిక రచయిత సంఘ సంస్కరణ భాగంలో తాను కూడా ఒక అంశంగా ఉంటాడు. అందుకే చలం తన సాహిత్య ఉద్దేశ్యం

తన్ను తాను సంస్కరించుకోవడానికే అని చెప్పాడు. దానితోపాటు సమాజాన్ని సంస్కరించాలనే వాంఛ కూడా కనిపిస్తుంది. సంఘ సంస్కారరంగంలో సాహిత్యపరంగా ఒక ప్రభంజనంలాగా లేచినాడని చెప్పవచ్చు. అయితే రొమాంటిక్ రచయిత సమాజాన్ని వాస్తవంగా చూడలేడు. ఆదర్శాల బంగారు రంగులు తన లోకాలకు పులుముతాడు. తన లోకంలో తటస్థుడుగా ఉండక తాను గూడ అందులో భాగస్వామి అవుతాడు తాను కలలుగనే ప్రపంచంవైపు సమాజాన్ని ఆకర్షిస్తాడు రొమాంటిస్టులకు వ్యక్తి దృక్పథమే ఎక్కువగా ఉంటుంది. వ్యక్తి కొరకు సమాజం అన్నభావం తీవ్రంగా ఉంటుంది. సమాజం కొరకు వ్యక్తి అన్న దృక్పథాన్ని తిరస్కరించలేరుగాని దాని ప్రాధాన్యాన్ని రచనలో స్పృశించరు. వ్యక్తి యొక్క విశ్వతోముఖమైన స్వరూపమే సమాజం. సమాజం యొక్క సూక్ష్మ రూపమే వ్యక్తి. ఈ రెండింటికి సమన్వయం అన్యోన్యమై ఉండాలి. ఈ రెండు అవినాభావ సంబంధంతో కూడికొన్నవి. వ్యక్తి కోరికలను సమాజం మన్నించాలి. సమాజ అస్తిత్వాన్ని వ్యక్తి పరిరక్షించాలి. సమాజం—వ్యక్తి మధ్య వ్యత్యాసం ఏర్పడ్డప్పుడు; ఒకదానికొకటి భంగకరంగా తయారైనపుడు సంస్కర్తలు వానిని సరిచేసి సమతూకంలో సాగేలా చేస్తారు. సమాజం, వ్యక్తి కోరికలను అలక్ష్యం చేస్తున్న సమయంలో చలం సాహిత్యరంగంలో ప్రవేశించి వ్యక్తి ప్రాధాన్యాన్ని ముఖ్యంగా స్త్రీ ప్రాముఖ్యాన్ని, ఔన్నత్యాన్ని నొక్కి చెప్పాడు. ఆమె వ్యక్తిత్వ వికాసాలకు తన రచనను సాగించాడు. ఈ విషయాలతో వ్రాయబడిన గ్రంథాలు స్త్రీ, బిడ్డల శిక్షణ.

చలం సాహిత్యానికి కేంద్ర బిందువు 'స్త్రీ'. స్త్రీ—పురుషుల సంబంధాన్ని భిన్న కోణాలతో చూసి రచన చేసాడు. 'మైదానం' వంటి నవలల్లో ఇంద్రియ సుఖాల ప్రాధాన్యతను తెలపడానికి, 'శశాంక'వంటి నాటకాల్లో ప్రేమ తత్వాన్ని హృదయస్థాయిలో చూపడానికి, 'పురూరవ'వంటి నాటకాల్లో ఇంద్రియాతీతమైన సౌందర్యానుభూతిని వివేచించడానికి ప్రయత్నించాడు. ఇటువంటి చలం రొమాంటిక్ దృక్పథం సామాజికాంశాలతో కూడినదే. సమాజ పటిష్ఠతకు వ్యక్తి సంస్కారం క్రోడీకరించబడాలి. బిందువు వ్యాపించి లోకమంతా వ్యాపిస్తుంది. అది తిరిగి సంకోచాన్నిపొంది బిందువుగా మారుతుంది. వ్యక్తి వికాస స్వరూపమే సమాజం. సమాజ సంకోచ రూపమే వ్యక్తి. చలం తనను తాను సంస్కరించుకోవడం ద్వారా వ్యక్తి సంస్కారాన్ని, వ్యక్తి సంస్కారం

ద్వారా సంఘ సంస్కారానికి కృషి చేసాడు. శరత్ సంఘంలోని మూఢత్వాన్ని విమర్శించి, బ్రాహ్మ సమాజానికి, హిందూ సమాజానికి వ్యతిరేకియై చివరికి హిందూ మతం వైపు మొగ్గు చూపినట్లుగానే, రొమాంటిక్ కవులు పారిశ్రామిక వాతావరణాన్ని విడిచి పల్లె పరిసరాల్లో జీవించినట్లుగానే; చలం సంఘంలోని దురాచారాలను ఖండించి, ఆస్తికత్వాన్ని అధిక్షేపించి హిందూ, బ్రాహ్మ సమాజానికి వ్యతిరేకియై ఈశ్వరాశీర్వాదాల కొరకు చివరికి రమణాశ్రమంలో చేరి సాధనలు చేస్తూ శాంతిని పొందుతున్నాడు. రొమాంటిక్ భావుకులకు ప్రకృత్యుపాసన ద్వారా ఆధ్యాత్మిక లోకాలను అందుకోవాలనే జిజ్ఞాస ఉంటుంది. స్త్రీని చలం దేవతగా ఆరాధించాడు. స్త్రీ ఆరాధనా దృక్పథంతో ఆధ్యాత్మిక లోకాలకు వెళ్ళిపోయాడు 'కామిగానివాడు మోక్షగామిగాడు.' అన్నదానిలోని అర్థమిదే. చలం సాహిత్యంలో టెక్నిక్ లేదు. ఆ దృష్టితో రచన చేయలేదు. చలం 'emotional and unconscious writer'. కందుకూరి స్త్రీ జనోద్ధరణ పురుషుని ఆధిపత్యం క్రింద జరగాలని, అంతకుతప్ప వేరే మార్గంలేదని భావించాడు. కాని చలం పురుషునితో సమానంగా స్త్రీ సమాజంలో వ్యవహరింపబడాలని భావించాడు. ఈ విషయంలో తెలుగు రచయితలలో చాల ముందుచూపున్న రచయిత చలం ఒక్కడే. చలం తన సిద్ధాంతాల ప్రచారం కొరకు సాహిత్యాన్ని చేబట్టారు. సహజంగా కళా దృష్టి ఉండికాబట్టి టెక్నిక్ కొరకు తాపత్రయ పడకుండానే టెక్నిక్ ఆవిర్భవించింది. భారతదేశం 'స్త్రీ'ని శక్తి స్వరూపిణిగా అనాదినుండి గుర్తించింది. చలానిది కామం గాదు, మోహం. స్త్రీని ఆరాధించిని వ్యక్తికి, ఆ స్త్రీ జీవిత స్వరూపాన్ని ఇవ్వదు. అందుకొరకే చలం అశాంతితో భగవంతుని ఆశ్రయించాడు.[35]

తనపై ప్రాచ్య, పాశ్చాత్య రచయితల ప్రభావం గురించి చెబుతూ, చలం ''Indian writers రవీంద్రనాథ్‌టాగూర్, Foreign మొపాసా, మాఘం, బెర్నార్డ్‌షా''[36] అని అన్నారు.

తెలుగు సాహిత్యానికి చలం రచనలు కొత్త అలంకారాలు. కథలు, నవలలు, నాటికలు, నాటకాలు, వ్యాసాలు, మ్యూజింగ్స్, ప్రేమలేఖలు రచించి నాటికీ నేటికీ వివాదాస్పదమైన రచయితగా గణింప బడుచున్నాడు. చలం శైలి, కవితాస్పర్శతో, మార్మికత్వంతో కూడికొని ఉంటుంది. వ్యావహారిక భాషోద్యమానికి చలం సాహిత్యం కాంతిరేఖ.[37] చలం సాహిత్య ప్రభావం తెలుగు సాహిత్యంపై

మరువరానిది. చలం పుస్తకాలు గుజరాతీ, మరాఠీ, ఉర్దూ, పంజాబీ, కన్నడం, అరవంలోకూడ అనువదించ బడ్డాయి.[38]

ప్రతి రచయిత సమాజ శ్రేయస్సు కొరకే; తనకు, తన సమాజానికి సమన్వయం కుదిరేందుకే రచన సాగిస్తాడు. ఈ దృష్టితో చలం రొమాంటిక్ సాహిత్యాన్ని అవలోకించిన; అతని సాహిత్యం కూడా సామాజికాంశాలతో, సమస్యలతో కూడికొని ఉండి సమకాలీన సమాజం అందులో ప్రతిబింబిస్తున్నదని స్ఫురిస్తుంది. సమకాలీన సమాజం చలం సాహిత్యం ద్వారా, ముఖ్యంగా నవలా సాహిత్యం ద్వారా ఎటువంటి సామాజిక దృక్పథం కలిగి ఉండాలో; ఉండటానికి అవకాశం కల్పిస్తున్నదో; అనే అంశాలు ఈ పరిశోధనలో వివేచింపబడుచున్నవి.

---

## అధోజ్ఞాపికలు:

1. వివరణ: చలం మొదటి రచన 'శశిరేఖ' రచనా కాలం 1921. చలం రమణాశ్రమంలో స్థిరపడడానికి 1950లో వెళ్ళాడు. ఈ మధ్య కాలంలో రచించిన సాహిత్యమే ప్రాముఖ్యం వహించింది.

2, 3, 4: అరుణ, వివాహం–అన్న నవలలలో ఎమెస్కో పుస్తక సంస్థవారు చలాన్ని పరిచయం చేయడానికి వాడిన విశేషణాలు.

5. 'వసుచరిత్రకోసం చిన్నప్పుడు మోసంచేసిన పంతులుగారు పెద్దయ్యాక 'వసు చరిత్రాది గ్రంథములు సహితము చదువతగినవి కావు.' అవిసహితము పరిమళ యుక్తమై విష స్వభావముగల పుష్పమాలవలె తమ సౌరభముననుభవింప బూనువారిని కామోన్మత్తులజేయక మానవు' అనే అభిప్రాయానికి వచ్చారు. తారాశశాంక విజయంలాంటివి తగలబెట్టమన్నారు.'–శ్రీ ఆరుద్ర–గద్య తిక్కన–సంఘ సంస్కర్త కందుకూరి వీరేశలింగంపంతులు–వికాసలహరి–యువభారతి–ప్రచురణ–18–పుట–106.

6. 'వెనకటి తరంవారిలో గిడుగు రామమూర్తిగారికీ, వీరేశలింగం పంతులుగారికీ, గురజాడ అప్పారావుగారికి ఎట్లాంటి ప్రాముఖ్యం వుందో ఈ తరం ఆంధ్రుల

సమాజ చరిత్రలో 'చలం'గారికి అంతటి ప్రాముఖ్యం ఉందనుకునే వారిలో నేనొకడిని. ఈ వ్యక్తులందరూ సమాజంలో వారందరూ సుఖంగా జీవించాలి అన్న ఆశయంతో కృషి చేసినవారే బాల వితంతువుల ఘోరపరిస్థితిని చూసి వీరేశలింగంగారు ఎంతో బాధ పడ్డారు. పాశ్చాత్య భావాలను సగం సగం అర్థం చేసుకున్న వ్యక్తులు, వేశ్యావ్యాసంగంతో కుమిలిన సమాజంగా పడినప్పుడు ఆ సమాజం స్థితినిచూసి బాధ పడ్డారు, గురజాడ అప్పారావుగారు. అల్లాగే ఆర్థిక, నైతిక, మానసిక స్వేచ్ఛలు లేకపోవడంవల్ల సమాజంలో వచ్చే అరిష్టాలను గ్రహించి బాధపడ్డారు వెంకటచలంగారు'.

—బుచ్చిబాబు—చలం (వ్యాసం)—నన్ను మార్చిన పుస్తకం—పుట—126.

7. 'వితంతు వివాహాలు సాధించిన వీరేశలింగంగారు స్త్రీ నీతి చట్టాల్ని వెక్కిరించిన చలానికి Spiritual father—'

—చలం—మ్యూజింగ్స్ (చలం సాహితీ ప్రచురణ—పుట—384 )

8. శ్రీ గోరాశాస్త్రిగారు నాకు 6–6–1977 రోజున ఇచ్చిన ఇంటర్వ్యూలో తెల్పిన అంశం.

9. 'కాని అంతకన్న మంచి నవలలు చిలకమర్తి లక్ష్మీనరసింహం మొదలైన వారిని చిన్నప్పుడు చదివాను'.

—చలం—సృజన—మే—1968—పుట—10.

10 'Man is the measure of all things' మానవుడే అన్ని విషయాలకు ప్రమాణం, అని గ్రీకు దార్శనికుడు ప్రొటాగరస్ అభిప్రాయం. మానవతా వాదాన్ని ఒక తత్వంగా ఆలోచన చేసిన ప్రసిద్ధాచార్యుడు. భారతీయులు దీన్ని గురించి ప్రకటించిన అభిప్రాయాలు మనకు అక్కడక్కడా కనిపిస్తాయి. అయితే పాశ్చాత్యులు దీన్ని వివేచిస్తూ ఒక తత్వంగా రూపొందించారు.

—డా॥ మాదిరాజు రంగారావు—మానవతావాదం—చివరకు మిగిలేది—విమర్శని—జనవరి—78. [మరియు]

'యూరోపులో వచ్చిన రినైజాన్సు, రిఫర్మేషన్, రివల్యూషన్, రొమాంటిక్ రివైవలు మొదలైన అనేక వైజ్ఞానికోద్యమాల ఫలితాలను జీర్ణించుకొని ఏ

చలం నవలలు

విధమైన మత ప్రసక్తిలేని లౌకిక సాహిత్య ప్రక్రియ రావడానికి పరమ పవిత్ర మైన జీవన విధానంగా పదునాల్గవ శతాబ్దంలో పెట్రార్క్ ప్రతిపాదించిన మానవతావాదానికి అత్మమైన వ్యక్తి చైతన్యము యొక్క గుర్తింపు కారణం.'
—డా॥ కేతవరపు రామకోటిశాస్త్రి—సంపాదకుడు—తెలుగు నవల గురించి—విమర్శిని—జనవరి '78.

11. 'చలం ఆద్యంతము రొమాంటిస్ట్. ఈ దృష్టితో చూస్తే ఒక చలమేగాదు, ఈ కాలము రచయితలందరు మనకు అర్థం అవుతారు. స్వేచ్ఛా గానం యీ కాలం వారి గళాల నుంచి వెలువడిన ఒకే ఒక నాదం'.

—మొదలి నాగభూషణశర్మ—తెలుగు నవలా వికాసం—పుట—77.

12. డా॥ సి. నారాయణరెడ్డి—ఆధునికాంధ్ర కవిత్వము: సంప్రదాయము: ప్రయోగము—పుట—199.

13. గోపరాజు సాంబశివరావు M. A —ఆంగ్ల సాహిత్య చరిత్ర—పుట—328.

14. శ్రీ వడలి మందేశ్వరరావు—క్లాసిక్—రొమాంటిక్—భారతి—ఫిబ్రవరి—1979—పుట—22.

15. శ్రీ గోరాశాస్త్రిగారు నాకు 6–6–1977 రోజున ఇచ్చిన ఇంటర్వ్యూలో తెలిపిన అంశం.

16 'స్త్రీ—పురుష సంబంధాల రంగంలో ప్రేమ, వివాహం యివి బూర్జువాభావజాలం లోని ప్రధాన సూత్రాలు. వీటికి అనుగుణంగా సాహిత్యంలో కూడ రొమాంటిసిజం అనే కొత్త సంప్రదాయం బయలుదేరింది. యిది హృదయానికి హృదయానుభూతులకు ప్రాముఖ్యం యిచ్చేది. యిది సాంఘిక, రాజకీయ, ఆర్థిక, మత రంగాలన్నిటిలోనూ బూర్జువా సూత్రాలను సమర్థిస్తుందనీ, ప్రచారం చేస్తుందనీ చెప్పనక్కరలేదు. కానీ యిది వైవాహిక రంగంలో ప్రేమకు అపారమైన విలువనిస్తుంది. ప్రేమలేని వివాహాన్ని వ్యభిచారమంటుంది, ప్రేమలేని కుటుంబ జీవితాన్ని నరకమంటుంది. ప్రేమ వివాహమన్నప్పుడు విధిగా విడాకుల స్వేచ్ఛ అందులో భాగంగా వుంటుంది. బూర్జువా నాగరకతలో

భాగాలైన యీ రొమాంటిక్ భావాలే మొత్తం మీద చలం సాహిత్యంలోని భావాలు.

—శ్రీ రాచమల్లు రాంచంద్రారెడ్డి—చలం మీద డా॥ విమ్మగడ్డ దాడి—పీఠిక—ఫిబ్రవరి—1977—పుట—3.

17. "To say that romantic love was unknown before the middle ages would not be correct, but it was only in the middle ages that it become a commonly recognised form of passion. The essential of romantic love is that it regards tho object as very difficult to posses and as very precious. It makes therefore great efforts of many kinds to win the love of the beloved object, by poetry, by song, by feats of arms or by whatever other method may be thought most pleasing to the lady. The belief in the immense value of the lady is a psychological effect of the difficulty of obtaining her and I think it may be laid down that when a man has no difficulty in obtaining a woman, his feelings towards her does not take the form of romantic Love"

—Butrand Russel— Marriage and morals
—Page No. 37

18. "The relative aims of classical and romantic art were summed up by Heine as follows. "Classical art had to express only the finite and its forms could be identical with artists idea, romantic art had to represent or rather to typify; the infiinite and the spiritual and had therefore to be expressed symbolically, classical art may be said to posses objective beauty, since universal types are

presented, the artists being chiefly a technical medium of realisation. Romantic art on the other hand is subjectively beautiful since individual impressions are presented, the artist being primarily a psychological medium of interpretation. The rules evolved from classical traditions were not suited to romantic ideas; the former aimed at symmetry of outline and perfection of form, whilst the later aimed at the expression of individuality. The romantic movement therefore discussed formal beauty in favour of emotions intensity"

—Everyman's Encyclopaedia-vol-10-Pillory Santa Barbara-Page No. 506.

19. 'చిత్తవృత్తి విశేషాలలోనూ ప్రకృతి సిద్ధములైన పదార్థాలలోనూ ఒక వినూతన సౌందర్యమును తాను దర్శించిన దానిని భావించుటచేత సూక్ష్మసూక్ష్మ సుషుమ్నా మార్గములలో దీర్ఘీకరించుకొనుచు అవి స్పష్టమైన ఆలంబనముగా కవనము చేసినచో నది రొమాంటిక్కు కవిత్వము'.

—డా॥ కేతవరపు రామకోటిశాస్త్రి—భావ కవిత్వ విచారము—విమర్శిని—1976—పుట—60.

20 'సాంఘిక సమస్యల పరిష్కారానికి సాంఘిక సమన్వయలను తన వస్తువులుగా తీసికొని పరిష్కార మార్గాన్ని చూప ప్రయత్నించడం, ఆ చూపడంలో మనకు విచిత్రంగా అసాధారణంగా తోచే త్రోవల త్రొక్కడం— ఇవే చలం రచనలు కలిగించిన అలజడికి కారణం'.

—శ్రీ కె. వెంకటరామశాస్త్రి—చలం భావాలు—తెలుగుతల్లి—ఏప్రిల్—1945—పుట—57.

21. 'మన యిల్లాండ్రు ఏ కత్తెలుంగాదు, వంటగత్తెలు తప్ప. విద్యయు స్వయంవరణముగలవారు గణికలు సామన్యమున మిన్నలు. తక్కినవాండ్ర బ్రతుకెట్టిది. శారీరిక క్రియలచే నిండినది.'

—శ్రీ. కట్టమంచి రాంలింగారెడ్డి—కవిత్వతత్వ విచారము (మే '1973 ప్రచురణ) పుట—187.

22. 'నా రచనల సంఘటనలకి అబలల ఆర్తి ఆధారం. సంఘ బహిష్కృతులైన స్త్రీలు నాలో confied చేసుకున్న చరిత్రలు నా రచనలకి ఆధారం.'
—చలం—సృజన—మే. 1968—పుట—9.

23. 'మరి వివాహంలేని సంఘం చాలా ఆరోగ్యంగా, ఆనందంగా వుంటుందని కలలు కంటాడు చలం. తన సొంతం అనే భావన వదిలిపోవాలంటాడు. మరి అది అతని వుత్తవాదనో, 'థియరీ'యో, లేక అతని అనుభవమో ! కాపరాల్లోని చిక్కులు తీర్చే విధం కనబడక, ఆ పిచ్చి థియరీని కల్పి చాడేమో !'
—చలం—జీవితాదర్శం—పుట—34.

24 'వివాహం విచ్ఛేదం అవుతుంటే స్త్రీ పురుషులు స్వేచ్ఛగా ప్రేమించుకుంటారంటే, నేనందుకోసమే ప్రయత్నిస్తున్నానంటే, నాకేమీ భయపడవలసిదింగాని, సిగ్గు పడవలసిందిగాని కనిపించదు. నాకీ scandel చూస్తే భయంలేదు యిక్కడ ప్రశ్న యేమిటంటే నిజంగా నా ప్రయత్నం అదేనా అని— నేను వాంఛించే మార్పు యీ వివాహంలో వున్న అక్రమాలు అన్యాయాలు పోవాలని, ఈ దుర్మార్గాలు పోదిలించినంత మాత్రాన అసలు చచ్చేటంత దుర్భరం కాదు వివాహం '

—చలం—మ్యూజింగ్స్ (చలం సాహితీ ప్రచురణ)—పుట—33.

25 'ప్రస్తుతం మనుష్యుల స్వభావం యీ మోనాగమీ అనే దానికి చాలవరకు ఎడ్జస్టు కాలేదు. కాని మనుష్య స్వభావంలోని అపాయకరమైన ఉద్రేకాల్ని, శక్తుల్ని, ప్రజాక్షేమంకోసం, విద్యవల్లా, శిక్షణవల్లా, చట్టాలవల్ల అదుపులో వుంచినట్లే, యీ కామవాంఛల్ని కూడా, అదుపులోవుంచి యీ మోనాగమీ ఆదర్శంవేపు మళ్ళించే ప్రయత్నం చేయాలి.'
—చలం—స్త్రీ—పుట—95.

26. 'మొగవాడు స్వార్థపరుడైన ప్రభువని (tyrant), సృష్టి స్త్రీపైన చూపే

కౄర్యాన్ని ఆధారంగా స్త్రీని బాధ పెడుతున్నాడనీ, నేను వ్రాసే చేదు సత్యాన్ని Bitter truth ని చెప్పడానికి నేను పూసే శృంగారపు చెక్కరని చప్పరించు కోడం కోసమే, ఇప్పుడు నా కథలు చదువుతున్నారని నాకు తెలుసు.'

—చలం—చలం ఉత్తరాలు (దీక్షితులుగారికి)—తేది 31—3—'37—పుట—140.

27. 'Shock చేయ్యాలనే గుణం నా మొదటి పుస్తకాలన్నిటిలోనూ వుంది.'

—చలం—సృజన—మే—1968—పుట—10.

28 చలం—స్త్రీ—పుట—15.

29. వివరణ: వ్యక్తుల్లో ఉండే సహజాతాలు, వాటివల్ల కలిగే వాంఛలను వ్యవస్థ తీర్చాలి. అది ఒక క్రమపద్ధతిలో జరిగిపోవాలి. అది సమాజపు ధర్మం. అయితే ధర్మాన్ని ఆశ్రయించి వాంఛలకు స్థానాన్ని కలిగించకపోతే విషమ పరిణామాలు ఏర్పడతాయి. వృద్ధులైన పురుషులు కన్యలను పెళ్ళి చేసుకోవడంవల్ల స్త్రీల వాంఛలకు ప్రాధాన్యతనీయక వివాహ వ్యవస్థా ధర్మం పేరున పురుషులు స్త్రీలను అణచిపెట్టుట వలన విపరీత పరిణామాలు ఏర్పడుచున్నవి. దానిని ఈ విధంగా చలం చెప్పాడు.

'Sex అనేది వాంఛకాక ధర్మమయి పోయింది ఈ దేశంలో— చాలాకాలం ధర్మంగానే నడిచిందేమో? పరిస్థితులు మారి వాంఛగా మారుతోవుంటే adjust కాలేకుండా వున్నారు, ఈ నూతన వ్యవహారాలకి తలిదండ్రులూ, భర్తలూ.'

—చలం—మ్యూజింగ్స్—పుట—49.

30. 'ఈ ఫిక్షన్‌ని ఆయన కత్తికి మారుగా, కోపంతో, తీవ్రమైన కచ్చతో వాడి వుంటారనిపిస్తుంది. ఈ ఫిక్షన్ చదువుతున్నప్పుడు మనకి చలంలో చాలా మంది అన్నట్లు సెక్స్ కనపించదు. సౌందర్యారాధన, మనుష్యులపై తీవ్రమైన కోపం, వారి అజ్ఞానాన్ని ఛేదించాలనేటువంటి ఆవేశం కనిపిస్తుంది.'

—మాలతీ చందూర్—చలం—మహిళ (పత్రిక)—జనవరి—1977.

31. 'నాటి చలంలోవి నేటి చలంలో వున్నవి అంటె అర్థం, ఆనాటి చలంలోని సంఘ విప్లవ భావాలు నేటి చలంలోనూ వున్నవి— నేటి చలంలోవి నాటి

చలంలోలేవు అంటె అర్థం ఈనాటి చలంలోని అతీంద్రియానుభూతి, అశరీర శక్తి, తత్వామర క్తి నాటి చలంలో లేవు.'

—సంజీవ దేవ్—వ్రివేశిక—చలం జీవితం—సాహిత్యం—పుట—24.

32. 'చలం రొమాంటిక్ ఉద్యమం నుండి వచ్చాడంటే మేం ఒప్పుకోం. అతడు పెటి బూర్జువా సంప్కృతి నుండి వచ్చాడు. అతనిది శాస్త్రీయ దృష్టి కాదు.'

—రంగనాయకమ్మ (నాకు 5-6-1977 నాడు ఇచ్చిన ఇంటర్వ్యూలో తెలిపిన విషయం.)

33. చలం ఉత్తరాలు (దీక్షితులు గారికి)—తేది 25-1-'29—పుట—12.

34. (Page–51): Sir Walter Scott (1771–1832) 'In the novels which Scott wrote there are found the romantic, the historical, the comedy of manners and all other elements of English fiction.'

Page-67: Charles Dickens (1812–1870) 'His main contribution to the English novel was that he was the first English novelist to write the hamanitarian novel.'

Page 76: William Thackeray (1811–1863) 'He was the first novelist in England to use the novel to express a conscious, considered criticism of life.'

Page 86: George Eliot (1819–1880) 'All the novels of George Eliot are examples of psychological realism.'

Page 94: George Meredith (1829–1909) 'Women plays an important role in the novels of Meredith.'

Page 98: Thomas Hardy.. 'His gratest quality as a writer in his sincerity and his innate sympathy for the poor and the down trodden.'

Page 111: H. G. Wells: 'Wells was essentially a liberator who wanted to liberate his contemporaries from the burdens of superstitions, traditional beliefs and un restrained emotions.'

Page 119: Virginia Woolf: 'of the group of stream of consciousness' novelists Virginia Woolf is considered to be the best'

Page 129: Aldous Huxley (1894–1964) '—But he did for the novel what Shaw did for the drama; that is he made the novel a form of capable of propogating great ideas and thus making an appeal to the intellect rather than the emotions of the reader.'

Page 129: D. H. Lawrance: 1885–1930. '—Regarding the relation between the saxes, Lawrance presents man's subjection to woman not woman's subjection to man.'

—B. R. Mallik—English novel.

35. శ్రీ గోరాశాస్త్రిగారు నాకు 6-6-'77 నాడు ఇచ్చిన ఇంటర్వ్యూలో తెలిపిన విషయాలు.

36. చలం–సృజన–మే–1968–పుట–9.

37. 'పైగా ఆ భాష భయంలేని, సంకోచంలేని, భీతిలేని పాత గోడల్ని పడగొట్టే తీవ్రవాది ఓ master stylist చేతిలో పడ్డది. చాల త్వరలో వీళ్ళ కృతక భాషలన్నీ తుప్ప కూలాయి. చలం శైలిలో, రాతలో, అంత తీవ్రత, అంత inevitability, అంత భయంకరాకర్షణ వుండి పోయింది.'

–చలం–చలం (ఆత్మకథ)–పుట–124.

సామాజిక చైతన్యం

38. 'నా కథలు, గుజరాత్, మరాటీ, ఉర్దూ, పంజాబీలోకి నన్నడక్కుండానే తర్జుమా అయినాయని తెలుసా? కన్నడంలో, అరవంలో చాలా కాలంనించి వాటి పరిచయమయింది.'

—చలం—చలం ఉత్తరాలు (దీక్షితులు గారికి)—తేది 7–1–'44—పుటలు—246–247.

# 1. శశిరేఖ: కథ

శశిరేఖ చాలా చిన్నప్పటి నుండి రామారావును ప్రేమించసాగింది. పెళ్ళంటే ఏమిటో సరిగా తెలియని వయస్సులోనే ఆమె రామారావునే పెళ్ళి చేసుకోవాలనుకుంది. కాని అది అలా జరుగలేదు. తల్లిదండ్రుల బలవంతం మీద ఇష్టంలేని పెళ్ళి చేసికొనవలసివచ్చింది. ఆ తరువాత కొన్నాళ్ళకు శశిరేఖకు బలవంతంగానే కార్యం చేయడానికి కూడా తల్లిదండ్రులు, అత్తవారివైపు వారు ప్రయత్నం చేసారు పెళ్ళప్పటికంటె తరువాత కాస్త ఊహ రావడంవల్ల శశిరేఖ కార్యానికి ఒప్పుకోలేదు ఆమాట ముందు తల్లిదండ్రులతోను, ఆ పిమ్మట భర్తతోను నిర్భయంగా చెప్పింది ఉభయులు గూడ తన మాటను అర్థం చేసికొన్నట్లు కనిపించక పోవడంచేత, ఇక లాభంలేదని శశిరేఖ అంతకు పూర్వమే పరిచయమై ఉన్న కృష్ణుడు అనే ప్రియునితో వాడపల్లికి లేచిపోయింది.

వాడపల్లిలో కృష్ణుని మిత్రుడు సుందరరావు అనే డాక్టరు ఉన్నాడు ఆయన సహాయంతోనే శశిరేఖా కృష్ణులు అక్కడ కాపురం పెట్టారు కృష్ణుని తల్లిదండ్రులు ఉద్యోగరీత్యా గోవిందపురంలో ఉంటున్నారు. నెమ్మదిగా శశిరేఖాకృష్ణులు గోవిందపురానికి చేరారు. శశిరేఖ వెళ్ళిపోయిన తరువాత డా. సుందరరావు తన ఉద్యోగాన్ని గోవిందపురానికి బదిలీ చేయించుకున్నాడు అక్కడ మళ్ళీ శశిరేఖ, కృష్ణుడు, సుందరరావు ముగ్గురు కలిసిమెలిసి తిరుగసాగారు. ఒకసారి ముగ్గురు పడవ మీద తిరుగుతుండగా, శశిరేఖ జారి నదిలో పడింది కృష్ణుడు, సుందరరావు ఆమెను కాపాడి ఆస్పత్రిలో చేర్చారు. అక్కడ సుందరరావే ఆమెకు వైద్యం చేసాడు. ఇంతలో కృష్ణుడు తన తల్లికి జబ్బు చేసిందని తెలిసి వెళ్ళిపోయి కొన్నాళ్ళదాకా అక్కడే ఉండిపోవలసివచ్చింది. ఆస్పత్రిలో సుందరరావు శశిరేఖకు జాగ్రత్తగా వైద్యం చేసాడు. క్రమంగా శశిరేఖ సుందరరావులకు పరస్పరం మోహం కలిగింది. సుందరరావు హాస్పిటల్ నుండి ఆమెను లేవదీసికొని ఆ ఊరు వదలి వెళ్ళిపోయాడు. వారిద్దరు అనేక

---

శశిరేఖ—ఎమెస్కో ప్రచురణ—1972

సుందర ప్రదేశాలు తిరిగారు. క్రమంగా సుందరరావుకు ఆమె మీద మోహం నశిం చింది. ఆమెను నీచంగా చూడడం ప్రారంభించాడు. తాను ఉద్యోగం వదలిరావడంచేత తనకు కలిగిన ఆర్థిక నష్టానికి, కష్టానికి ఆమెదే బాధ్యత అన్నట్లు ఆమెను నిందించడం, కొట్టడం, తిట్టడం మొదలు పెట్టాడు. శశిరేఖకు సుందరరావు ప్రవర్తన అసహ్యంగా తోచింది. చెప్పకుండానే వెళ్ళిపోదామని ఒకనాడు బయలుదేరి రైలు స్టేషనుకు పోతూండగా ఇంటిప్రక్క కాంభోట్లు అనే అతను ఆమె ప్రయాణానికి అడ్డుపడ్డాడు. ఆమె వెళ్ళలేక పోయింది. ఇంతలో సుందరరావు బండి ప్రమాదానికి గురియై స్పృహ కోల్పోగా ఇంటికి తీసికొని వచ్చారు. అంతవరకు అతనిని వదలి వెళ్ళిపోదామనుకున్న శశిరేఖ ఆపదలో ఉన్న సుందరరావును చూచి వెళ్ళలేక అతనికి సపర్యలు చేస్తూ అక్కడే ఉండిపోయింది. సుందరరావుకు ఆరోగ్యం కుదుట బడింది ఇక్కడ సుందర రావుకు వైద్యంచేసిన డాక్టరు, శశిరేఖ చిన్నప్పుడు ప్రేమించిన రామారావే ఇక్కడ శశిరేఖ రామారావును గుర్తించి పరిచయాన్ని పెంపొందించుకుంది. తరువాత రామారావు శశిరేఖను పెళ్ళి చేసికొంటానన్నాడు. ఆమెగూడా అంగీకరించింది రామారావు శశిరేఖను సుందరరావు నుండి విడదీసి తీసికొనిపోయి వేరే చోట ఒక అద్దె ఇంట్లో ఉంచాడు. శశిరేఖ, రామారావు ఇంటికే కలసి వెళదామంది. పెళ్ళి కాకుండా కలసి తన ఇంటికి వెళ్ళగూడదని రామారావు అన్నాడు. అంతేగాక పెళ్ళికాక పూర్వం స్త్రీ-పురుషులు ఇద్దరు కలిసిమెలిసి ఉండరాదని కూడా రామారావు చెప్పాడు. రామారావుకు నీతి నియ మాలపై పట్టుదల ఎక్కువ. శశిరేఖకు రామారావు దృష్టిలోనున్న నీతినియమాలు అర్థంలేనివని దృఢ విశ్వాసం. పెళ్ళైందాకా రోజులన్నీ ఎందుకు వృథా చేయాలని ఆమె ఆరాటం. రామారావు అంగీకరించకపోతే, ఆమెకు అతనిపై అనుమానం గూడా వచ్చింది. లోకాన్ని చూసి నీతినియమాలని పేరుపెట్టి ఇంతగా భయపడేవాడు, రేపు పెళ్ళైన తరు వాత తనను నీచంగా చూడకుండా ఉంటాడని నమ్మకమేమిటి అనేది ఆమె అనుమానం. ఇలా ఆమె సందిగ్ధావస్థలో ఉండగా శశిరేఖను వెతుక్కుంటూ సుందరరావు వచ్చాడు. తన పొరపాటు క్షమించమని, ఆమెను దేవతలాగా చూచుకొంటానని బ్రతిమాలితే శశిరేఖ సరే అని రామారావుకు చెప్పకుండా అతనితో వెళ్ళిపోయింది. కాని తాను ఆశించినట్లుగా సుందరరావు ప్రవర్తనలో పెద్ద మార్పేమి రాలేదు. అతనంటే శశిరేఖకు క్రమంగా అసహ్యమే కలగడం ప్రారంభించింది. తత్ఫలితంగా అతని దగ్గర ఉండడం భరించలేక అతనికి చెప్పకుండా వెళ్ళిపోయింది. ఈసారి శశిరేఖ నవజీవనదాసు అను

బ్రాహ్మ మతస్థుని రక్షణలోనికి పోయింది. అతడు శశిరేఖ పాపభూయిష్ఠమైన జీవిత విషయాలను విని, ఆమెను సన్మార్గంలో పెట్టడానికి ధర్మారావు అనే వానితో పెళ్ళి చేయడానికి ప్రయత్నించాడు శశిరేఖ, తాను ధర్మారావును ప్రేమించడం లేదు. కావున పెళ్ళాడనని చెప్పింది ఇలా వివాహ ప్రయత్నం విఫలంకాగా నవజీవనదాసు ఆమెకు మరొక మంచిమార్గం చూపిద్దామని కలకత్తాలో జరుగుతున్న బ్రహ్మోత్సవాలకు తీసి కొనిపోయాడు. ఆ ఉత్సవాలకు శశిరేఖ మొదటి ప్రియుడు రామారావు కూడా వచ్చాడు. రామారావు శశిరేఖను అక్కడ కలిసికొన్నాడు. రామారావుతో ఆమె, తాను ఇంతకు పూర్వం అతనితో చెప్పకుండా వెళ్ళిపోయినందులకు పశ్చాత్తాపపడుతూ మాట్లాడింది. ఆ ఉత్సవాల రోజులలో రామారావు గదిగి శశిరేఖ వెళ్ళి చనువుగా మాట్లాడుతూ ఉండేది. పెళ్ళి కాకుండా దగ్గరకు చేరరాదన్న రామారావు శశిరేఖ దగ్గరగా ఉన్నప్పుడు విగ్రహించుకోలేక, అనుభవించి పాపంచేసినట్లు బాధపడుతూ ఆమెను విడిచిపెట్టి వెళ్ళి పోయాడు. అలా వదలిపెట్టి పోయినందులకు, దుఃఖపడి విరక్తితో, రామారావు పశ్చాత్తాపంతో తిరిగివచ్చి చూసేసరికి ఆత్మహత్య చేసికొని చచ్చిపడి ఉంది. ఈ విధంగా ఆమె జీవితం అంతమైంది.

ఇది చలం మొదటి నవల. దీని రచనాకాలం 1921. చలం ఈ నవలను మొక్కపాటి రామ్మూర్తిగారికి అంకితం ఇచ్చాడు. 1926లో స్వామి శివశంకరశాస్త్రి గారు ఈ నవలకు 'ప్రవేశిక'ను కూర్చారు. నవలలోని సంభాషణలు తప్ప మిగతా రచన అంతా గ్రాంధికంలోనే జరిగింది. చలం మిగతా రచనలన్నీ వ్యవహారికంలోనే రచింపబడినవి. ఈ నవల రచించేనాటికి చలం వయస్సు 27 సంవత్సరాలు.

తన కాలంలో బహుళ ప్రచారంతో ఉన్న రొమాంటిక్ భావాలు, స్వేచ్ఛా ప్రణయ సిద్ధాంతాలను వాస్తవ జీవితంలో ప్రవేశపెట్టడంవల్ల వచ్చే పరిణామాలను చూపుటకు చలం ఈ నవలను వ్రాసినాడనిపిస్తుంది.



# శశిరేఖ: విషయ విచారణ

శశిరేఖకు పదోయేటనే పెళ్ళైంది. ఈమె తల్లితండ్రులు బలవంతంగా ఈమెకు పెళ్ళి చేసారు. ఈమె పెళ్ళి వద్దని ఎంత ఏడిచినప్పటికి వారు వినలేదు. తాను రామారావును ప్రేమించానని, అతనినే పెళ్ళాడుతానని చెప్పినప్పటికీ వారు వినలేదు. **శశిరేఖ మాటలు తెలిసిన మాటలు** కావని శశిరేఖ రామారావుల వయస్సులో భేదం హెచ్చు అని, అతడు సీమ నుండి వచ్చి పెళ్ళాడే వరకు శశిరేఖ వయస్సు పెరిగి పోతుందని, అయినా అతడు ఆమెను అప్పటికి పెళ్ళి చేసుకుంటాడో లేదో అని ఆమెకు బలవంతంగా ఇష్టంలేని పెళ్ళి చేసారు. తాను రామారావును ప్రేమించానని అంత వయస్సులో చెప్పుట అనుభవంతో చెప్పినది కాదని, ఆ మాటకు విలువ ఇచ్చుట సమంజసం కాదని ఆమె తల్లితండ్రులు భావించారు. ఆవిధంగానే శశిరేఖ త్వరలోనే రామారావును మరచిపోయింది. కృష్ణుడు అనే మరొకనితో ఆమెకు స్నేహమైంది. క్రమంగా అతడామెకు ప్రియుడైనాడు. బలవంతపు కార్యాన్ని భర్తను తిరస్కరించింది. తల్లితండ్రులను కూడా విడిచిపెట్టి శశిరేఖ కృష్ణునితో లేచిపోయింది. ఇష్టంలేని భర్తతో తల్లితండ్రులు బలవంతంగా శశిరేఖకు కార్యం చేయుటకు ప్రయత్నించటం చేత ఆమెకు కృష్ణునితో లేచిపోవుటకు మార్గమేర్పడింది. కూతుళ్లకు పెళ్ళి చేయుటలో తల్లితండ్రులుపడే తొందర, ఆ తొందరలో వారి ఇష్టాలను అణచిపెట్టే ఈ తల్లిదండ్రుల ఆలోచనారహితమైన నిరంకుశ ప్రవర్తనమూ, అది కారణంగా వ్యక్తిత్వం వికసించిన తరువాత పెద్దల ప్రవృత్తికి ఎదురు తిరిగి తమకు నచ్చిన పురుషునితో లేచిపోయి, వ్యవస్థను ఎలా స్త్రీలు ఛిన్నాభిన్నం చేయగలరో దానిని ఈ నవల ద్వారా చలం చెప్ప దలచిన విషయం.

స్త్రీ—పురుషులు దంపతులుగా వ్యవస్థలో జీవిస్తూ, సామాజిక దృక్పథంతో వ్యవహరించాలి కాని రొమాంటిక్ దృక్పథం కలిగిన స్త్రీ పురుషులు వ్యవస్థాగత జీవితాన్ని కోరక ఆనందానికి, స్వేచ్ఛకు అధిక ప్రాధాన్యమిచ్చి భంగపడుతున్నారు. వారి ఊహాలు నిత్యజీవితంలో ఫలవంతం కావు ఇటువంటి దృక్పథం కలిగినవారు, శశిరేఖా కృష్ణులు. వీరి పరస్పర పరిచయం రొమాంటిక్ ధోరణిలో జరిగింది. కృష్ణుడు శశిరేఖతో

"నువ్వు లేకపోతే నీ కోసం ఎదురు చూస్తో ఆ కాలవ వొడ్డున కూర్చుండే వాణ్ణి" (పుట–38) "ఎరక్కపోతేనేం? ప్రేమ దేవత కోసం ఎదురుచూస్తో కూచునేవాణ్ణి ఈ వెన్నెట్లో" (పుట–38) అని అంటాడు. అలాగే శశి కృష్ణునితో "నువ్వింత సులభంగా కనబడ్డం ఈశ్వరుడికి నేను చేసినపని యిష్టమని తెలుస్తోంది" (పుట–25) వీరిది రొమాంటిక్ ప్రేమ అనే భావంతో చలం ఇట్లు వ్యాఖ్యానిస్తున్నాడు. "పూర్వ యవ్వనమున వికసించిన పువ్వు తుమ్మెద నెట్లాకర్షించుచున్నదో, సూర్యకిరణముల వేడికి మంచు యేల కరుగుచున్నదో, వసంతమున కోయిల యేల కూయుచున్నదో, అందునకే ఆమె ప్రేమించెను" (పుట–23) వీళ్లిద్దరు ప్రేమించుకున్నామని, ప్రేమతో జీవిస్తున్నామని భావించారు. కాని మనసులోని ప్రేమ అనే అమూర్త భావాన్ని వ్యవస్థలో వివాహం ద్వారా స్థిరపరచుకోలేదు. వారికి వివాహం అన్న తలంపే రాలేదు.

తరువాత శశిరేఖకు సుందరరావుతో పరిచయ మేర్పడింది. కృష్ణుడు లేని సమయంలో ఆమెను సుందరరావులో బరచుకొనడానికి ప్రయత్నించాడు. ఆస్పత్రిలో ఆమెకు వైద్యంచేస్తూ బలవంతంగా ముద్దు పెట్టుకొన్నాడు. అందులకు ఆమెకు కోపం వచ్చింది కాని అతని స్పర్శ ఆమెకు ఆనందాన్ని కల్గించింది. కృష్ణుని ఎడల ఆమెకు ఉన్నప్రేమ కారణంగా సుందరరావు చర్యకు కోపం వచ్చింది. తనలోని కామాన్ని సుందరరావు ద్వారా తీర్చుకోవాలన్న సహజాత పరమైన కోర్కె అంతర్గతంగా ఉండడంచేత అతని ముద్దు, దాని స్పర్శ ఆమెకు ఆనందాన్ని కలిగించింది. ప్రేమ నుండి చ్యుతిపొంది సహజాతాలకు లొంగింది. తత్ఫలితంగా సుందరరావు లోబరచుకున్నాడు. అతనితో వెళ్ళిపోయింది. కృష్ణునితో ఆమెకు వివాహమైనట్లయితే ఈ చ్యుతి తప్పేదేమో అనిపించే అవకాశం ఉంది. ఆమెలో వైవాహిక సామాజిక దృక్పథం లేక పోవడంచేతనే ఆమె ఈ విధంగా పతనమైందని చలం చెప్పదలచాడు. అంతే గాక స్త్రీని పరపురుషుని ఆధీనంలో ఉంచిన పరిస్థితుల ప్రభావంవల్ల చలనశీల ప్రధానమైన సహజాతాల ప్రకోపంవల్ల భంగపడు అవకాశం ఉండునని గూడా ఈ సంఘటన ద్వారా చలం చెప్పదలచాడు. సుందరరావు ఫిడేల్ వాయిద్యం, హోదా ఆమెను లోబరచుకొన్నాయి. సుందరరావు ఆమెను అనుభవించడమే ప్రధానమనుకొన్నాడు గానీ సామాజికంగా జీవన సహచరిగా ఆమెను స్వీకరించుటకు సుముఖుడై ఉన్నవాడు గాడు. అందుకే "అతని దగ్గరే ఉండు, నాతోను స్నేహముగా వుండు. నాకంతకన్న ఏమీ

అక్కరలేదు " (పుట-65) అని పలికినవాడు. కాని శశిరేఖ ద్వంద్వ ప్రవృత్తిని వ్యతిరేకించి తాను కృష్ణుని మరచి సుందరరావు తోనే ఉండి పోయింది కాని సుందరరావు ఆమెను తన కామాగ్నికి సమిధగా ఉపయోగించుకుంటూ, ఆమెను తిడుతూ, కొడుతూ బాధ పెట్టాడు. పురుషులు స్త్రీలకు గౌరవం, న్యాయం లేకుండా బాధ పెడుతున్నారని స్త్రీ లోకం మీద సానుభూతి చూపిన సుందరరావు శశిరేఖను ఈ విధంగా అవమానపరచాడు. ఇతనిలో కుహనా సంస్కార దృక్పధం ఉంది. స్త్రీ పురుషులు పరస్పరం గౌరవించుకునే ఒక సామాజిక ఒప్పందం వివాహం వంటిది ఉండాలి, ఈ వ్యవస్థ లేకుండా స్త్రీ పురుషునికి సమస్తం ఒప్పగించిన హీనంగా చూచు అవకాశం ఉన్నదని చలం ఈ మాటల ద్వారా స్ఫురింపచేస్తున్నాడు. "స్త్రీ తన సమిస్తమును తన హస్తములో నుంచిన కృతజ్ఞత చూపు పురుషులు మిక్కిలి యరుదు. స్త్రీ పురుషుని తన శక్తిచే యాజ్ఞయందుంచు కొనవలెను. లేదా పురుషుడామెను నీచముగ లోబరుచుకొనును. అందువలన స్త్రీ పురుషులు ప్రతి విషయమునను సమానులైన గాని ప్రేమయుండదు. ఒకరిపైనొకరాధారపడిరా, ఆ ప్రేమ నశించినదే". (పుట-71) ఎటువంటి సాంఘిక ఒప్పందం లేకుండా, స్త్రీ పురుషునికి లోబడినవుడు ఆమెను అట్టి పురుషుడు నీచంగా చూసి హింసించు అవకాశం గలదని చలం హెచ్చరిస్తున్నాడు. సుందరరావుకు వివాహ వ్యవస్థ ఎడల విశ్వాసంలేదు. పురుషుడు స్త్రీని అనాదిగా అన్యాయం చేస్తూ వస్తున్నాడని అతని నమ్మకం. అందుకు వివాహం తోడైందని భావించాడు. "మొదట పురుషుడు స్త్రీని బలహీనురాలిని చేసి స్వాధీనం చేసికున్నాడు సృష్టియందు పురుషుడికి స్త్రీకంటె ఎక్కువ శరీర బలం వుండడం చేత స్త్రీని తనసొత్తు చేసుకున్నాడు తన నుంచి వెళ్ళిపోతే యీర్ష్య కనక శాశ్వతంగా తనదాన్ని చేసుకోడానికి పెళ్ళి అనేదాన్ని కనిపెట్టినారు. పురుషుడు తనవాడవుతాడు కదాయని స్త్రీ కూడా సంతోషపడ్డది. వివాహానికి అధికారం ఇచ్చేందుకు ఈశ్వరుణ్ణి కూడా తీసుకువచ్చి పెట్టినారు". (పుట-99) ఇది ఇతనికి వివాహం ఎడల ఉన్న అవగాహన. ఇతడు మానవ స్వభావచంచలత్వాన్నే సమర్థిస్తాడు. 'స్వభావ సిద్ధంగా ఒక పురుషుడుగాని, స్త్రీగాని, ఒక స్త్రీతోను, పురుషుడితోను సంతుష్టి పొందరు. జీవితమన్ని విషయముల లోను మార్పుకోరుతుంది. మార్పే జీవనానికి ప్రాణము. ఈ విషయంలో మాత్రము కట్టివేస్తే మానవ స్వభావమూరుకుంటుందా? ఈ కట్టుబాట్లు ఏర్పరచుకొని ఇప్పుడు మనుష్యులు వదలించుకోలేక తంటాలు పడుతున్నారు. (పుట-10) ఇతడు మానవ

చంచల స్వభావాన్ని అరికట్టడానికి సమాజంలో వివాహ వ్యవస్థ అవసరమనే సామాజిక దృష్టి లేనటువంటివాడు కట్టుబాట్లు లేనప్పుడు సామాజికంగా సంభవించే అరాచక పరిస్థితిని విచారించే దూరదృష్టి లేదు ఇటువంటి సుందరరావు, కాల్పనిక జగత్తులో విహరించే శశిరేఖను సహజాతాలకు లోబడే దాసు లోబరచుకొన్నాడు. ఇతడు తన స్వభావం కోరినట్లు స్త్రీలతో సుఖాలను అనుభవించాలనుకున్నాడు. ఈమె కాల్పనిక దృక్పథంతో ప్రపంచంలోని అందాన్నంతా అనుభవించాలనుకుంది. 'అందమయిన దాన్ని చూస్తే నాకింత మేమీ అక్కర్లేదు అందంకోసం ఏమన్నా యిచ్చేస్తాను. ఈ లోకంలోవున్న అందమయిన కట్టడాలు, తోటలూ, పర్వతాలు చూడాలని వుంటుంది. ఈ దేశంలోనే చూడ్డానికి నోచుకోలేదు. ఈ లోకంలోవున్న అందమయిన మనుష్యులందర్తోను స్నేహం చెయ్యాలని వుంటుంది అంత అందమూ నాది కాకూడదూ? ఎన్ని సార్లో ఆకాశంలో యిట్లాంటి అందంచూసి దాన్ని నాది అనుకుంటాను కాని అప్పుడే పోతుంది. లోకంలో అంత అందమూ అంతే గావును' (పుట–55) అని భావిస్తుంది. ప్రపంచంలోని అందాన్నంతా తానొక్కతే అనుభవించాలనుకోవడం ఈమె కాల్పనిక దృక్పథానికి నిదర్శనం. ప్రపంచంలోని అందమైన పురుషులతో స్నేహం చేయాలనుకోవడం ఈమె చంచల ప్రవృత్తికి నిదర్శనం. ఈ దృక్పథం సామాజికమైంది కాదు. అందుచేత అందమనే ఎండమావిని పట్టుకోడానికి పురుషులను మారుస్తుంది. ఆ మార్పుదమే ఆనందం అనుకుంటుంది ఈ విషయంలో సుందరరావు, శశిరేఖ వ్యక్తిత్వాలు ఒక్కటే. అందుకే కృష్ణుని మాటల మీదకన్న సుందరరావు మాటల మీదనే ఈమెకు గౌరవం ఎక్కువ. సుందరరావుకు భోగం ప్రధానం, అందులకు సౌందర్యం తోడు. శశిరేఖకు సౌందర్యం ప్రధానం, అందులకు భోగంతోడు. అందుకే వీరి స్నేహం వికటించింది. సుందరరావు ఆమెను త్వరలోనే నీచంగా చూడడం ప్రారంభించాడు. దానిని అసహ్యించుకొని ఈమె అతనిని విడిచి వెళ్ళడానికి పూనుకుంది. ఈమె తన చంచల స్వభావాన్ని అదుపులో పెట్టలేకపోయింది. ఈమె తన స్వభావ ప్రవృత్తిని అనుసరించింది. అందుకే 'ఖద్రంగా ఆలోచించి నా స్వభావము దేన్ని కోర్తోందో దాన్ని పట్టిపోయినాను.' (పుట–145). అని సమర్థించుకుంది. కాని దాని వలన ఆమె అనుభవించింది విషాదమే. చలనశీలమైన మానవ సహజాతాలను వ్యక్తి స్వభావానికి దత్తం చేయడం వలన పరిణామాలు విషాదానికి దారి తీస్తాయని, చలం చెప్పదలచిన విషయం. ఈ మార్గంలో పురుషునికన్న స్త్రీయే ఎక్కువ ఆపదలకు గురియగునని స్ఫురింపచేస్తున్నారు.

## సామాజిక చైతన్యం

శశిరేఖ ఒకేసారి ఒకరికన్న ఎక్కువ మంది ప్రియులను చలం ఇతర కొన్ని స్త్రీ పాత్రలవలె, జీవితంలోనికి ఆహ్వానించలేదు! క్రొత్త ప్రియుని పరిచయంతో పాతవారిని మరిచింది. అందుకే శశిరేఖ సుందరరావుతో ఇలా అంటుంది. 'నా సంగతంతే అనుకొన్నారా? మీ మీద కృష్ణుని మీద కన్న ఎక్కువ ప్రేమకలిగి నన్ను బలవంతపరచినది కాని, లేకపోతే నా చిటికినవ్రేలు తాకనిచ్చేదాన్నే మిమ్మల్ని? ఎప్పుడు మీ దాన్నయినానో, అప్పుడే కృష్ణుడు నా జీవితములోంచి తొలగిపోయినాడు. ఇంక కృష్ణునితో ఉండలేను, మిమ్మల్ని వదలలేను. కృష్ణుడితో ఉన్నా ఒకవేళ నా దగ్గరికి రానిస్తానా" (పుట—65) అని అంటుంది.

ఈమెది తీవ్ర ప్రకృతి. ఈమె ఆవేశానికి, తీవ్రవాంఛానురక్తికి కారణం ఉంది. "శశిరేఖ తల్లి బాల్యములో అత్తవారి యింటికి పెళ్ళబోయే ముందు ఆమె యింట్లో వుండి ఎవరికీ తెలియకుండ ఆమె ప్రేమను పొందిన పంజాబు కుర్రవాని సంగతి తెలిసియుండుట సాధ్యమైనచో శశిరేఖకు ఎందుకంత అందమో, ఆ చెప్పరాని ఆవేశములేమిటో పల్లెటూరి సాధారణపు బాలికకు తల్లితండ్రులకులేని ఆ గుణములెట్లు వచ్చెనో తెలిసేయుండును." (పుట—40) అని చలం చెప్పుటచేత పంజాబు కుర్రవాని ఆవేశం తీవ్రవాంఛ శశిరేఖకు సంక్రమించిందని తెలుపుచున్నాడు. స్త్రీ—పురుషులు సంయమాన్ని, వ్యవస్థాగతమైన బుద్ధిని కలిగియుండని పక్షమునవారి సంతానానికి అట్టి గుణములే వచ్చునను విషయాన్ని గూడా ధ్వనింప చేస్తున్నాడు.

ఈమెలో వ్యవస్థ ఎడలగల విశ్వాసం అవచేతనలో ఉంది. దానిని స్థిరీకరించి చేతనావస్థలోనికి తెచ్చి ప్రవర్తింప చేయుటకు పరిస్థితులు అనుకూలించలేదు. చేతనావస్థలో చంచల వాంఛాప్రవృత్తి ఉంది. ఇది అవచేతనను అదుపులో ఉంచి ఆమెను అశక్తురాలిగా చేసింది. అందుచే సుందరరావుకు లొబడినపుడు అనుభవాన్ని కాదనలేకపోయింది. కృష్ణుని మరచిపోలేక బాధపడింది. ఆమెలో మంచి, చెడుల మధ్య సంఘర్షణ జరిగింది. తుదకు చెడునకే లొంగింది. ఆమె స్వభావం అటువైపే లొంగింది. ఆ సమయంలో ఆమె మాటల్లో సందిగ్ధావస్థలోపడ్డ చిత్తవృత్తి స్పష్టంగా తెలుస్తుంది. "మిమ్మల్ని వదిల్లేను, వదల్లేను, అయ్యో వదల్లేను, నన్ను రానియ్యకండి దగ్గరికి, నన్ను తీసుకొనివెళ్ళరూ? నా మనోహరా నువ్వేనాకు, ఇంక ఎవ్వరులేరు! మీరు లేంది బతకలేను. రండి రండి ఇంకెందుకు—వద్దు, ఇది తప్పు! జన్మమంతా మీ దాసి నౌతాను.

కాని నన్నడక్కండి. నాకు శక్తి లేదు. బలం లేదు. నన్నువోసింది నమస్కారము చేస్తాను." (పుట–62. 63) అని శశిరేఖ అంటుంది. స్వభావాన్ని కాదనలేక సుందరరావు పొందును కోరింది. కృష్ణునితో ఉన్న ప్రేమను కాదనలేక సుందరరావు పొందును నిరాకరించింది. ఇది ఒక ఉన్మాద ప్రవృత్తి అని చెప్పవచ్చును. ఇట్టి పరిస్థితిలో ఆమెను సుందరరావు లోబరచుకున్నాడు. స్వభావానికి సహజాతపరమైన వాంఛలకు లోబడితే ప్రేమ స్థిరపడదు. వాంఛా స్వభావానికి లొంగినవారు వ్యవస్థను గౌరవించరు అందుకొరకే శశిరేఖ వ్యవస్థలో ఇమడలేదు. తత్ఫలితంగా అశాంతికి గురైంది కృష్ణుని ప్రేమించిన శశిరేఖ సుందరరావును కోరుటలో ప్రేమ లేదు. అది వాంఛ. ఆ వాంఛే ప్రేమఅని భ్రమించి భంగపడుటకు స్వేచ్ఛాయుతమైన కాల్పనిక ప్రవృత్తి ఆమకు తోడ్పడింది. ఈ భావన సామాజిక దృక్పధంతో కూడినది కాక పోవుటచే ఆమె అశాంతికి గురైంది సుందరరావు వాంచనే ప్రేమ అని భ్రమించి భంగపడుటకు స్వేచ్ఛాపరమైన భోగ ప్రవృత్తి తోడ్పడింది. ఈ భావన గూడా సామాజిక దృక్పధంతో కూడినది కాకపోవుటచే క్రియాశీలుడు కాలేక పతనమయ్యాడు.

శశిరేఖ సుందరరావును కోరడంలో ప్రణయభావం ప్రేరణగాలేదు. వాంఛా పరివృతమైన కామముంది. కృష్ణుని ఎడల ప్రేమ సుందరరావు ఎడలవాంఛ ఉన్నందున శశిరేఖ ప్రణయం రూపు కట్టుటలేదు కృష్ణుని ఎడల ఉన్న ప్రేమభావం శశిరేఖలో ఇష్టంలేని పెళ్ళిని. భర్తను ఎదిరించిన స్వేచ్ఛలో రూపు కట్టింది. వ్యవస్థ, వ్యక్తిని మరచిన సంధి దశలో ఆ ప్రేమ ఉత్పన్నమైంది. ఆ ప్రేమ వివాహంచేత స్థిరపరచక బడుటవల్ల. కాల్పనిక తత్వానికి జోడించుటవల్ల చంచలత్వానికి దారి తీసి సహజాత స్వభావం ప్రకోపించుటవల్ల శశిరేఖ. సుందరరావును కోరుట జరిగిందని భావించుట అసమంజసం కాదు. వివాహం లేని ప్రేమ మనస్సులో బలపడుటకు, హృదయాన్ని ఆకట్టుకొనుటకు శశిరేఖ వంటి చంచలస్వభావం కలిగిన స్త్రీకి వీలుపడదు. కాబట్టి శశిరేఖది ఉదాత్తప్రకృతి మాత్రంకాదు 2 నాగరిక ప్రపంచంలో కామంయొక్క వరకకు వ్యవస్థాబద్ధ జీవితం అవసరం. ముఖ్యంగా స్త్రీ ఉత్పత్తి మాతృక అగుటచేత పురుషునివలె స్వేచ్ఛగా వ్యవహరించిన పొందు కష్టాలు అనేకములు. అందుచే స్త్రీ పాతివ్రత్యాన్ని, పవిత్రతను కాపాడుటకు సమాజం అభిలషిస్తున్నది. ఇది ఆమె జీవితానికి మనోబలాన్ని ఇచ్చి ఔన్నత్యాన్ని కలుగచేస్తుంది 3

సామాజిక చైతన్యం

సుందరరావు సాహచర్యంలో శశిరేఖ మనస్సు కంది పోయింది. అశాంతిని పొందింది. రామారావును సుందరరావు ఇంట్లో చూచినప్పటి నుండి అతడు తనను పెళ్ళాడి ఉద్ధరించుననే విషయాలు విన్నప్పటి నుండి ఆమె శాంతిని, సంసారాన్ని కోరింది. అయినప్పటికి ఆమెకు ఇంకను వివాహం ఎడల విశ్వాసం కుదురలేదు ఇంకను "మనుష్యస్వభావము చంచలము" (పుట–104). "మనస్సు సరిగ్గా లేకపోతే పెళ్ళేమి చేస్తుంది". (పుట–104) అని భావించి రామారావుతో వాదించింది ఇందుకు విరుద్ధమైన అభిప్రాయాలు కలిగినవాడు రామారావు ప్రేమ శాశ్వతమని, "పెళ్ళి చంచలత్వాన్ని కొంతవరకు కుదుట పరుస్తుంది ముందు ఎట్లావున్నా శాశ్వతంగా ప్రేమ ఉండాలనే ఉద్దేశ్యంతో వాగ్దానాలు చేసుకుంటేనేగాని స్త్రీ పురుషులకు కలిసి ఉండటానికి అర్హతలేదు" (పుట–104) అని చెప్పి శశిరేఖను మార్చటానికి ప్రయత్నం చేసాడు. అతనితో ఆమె కలిసి ఉన్నప్పుడు స్వేచ్ఛగా, నీతి, అవినీతి అనే భేదం లేకుండా సంచరించింది. కాని రామారావునకు నీతిమీద పట్టు ఎక్కువ గాబట్టి, పెళ్ళి అయ్యేంతవరకు దూరంగా ఉండాలనే ఉద్దేశ్యంతో, పెళ్ళి కాకముందు కలిసి ఉంటే ఎవరన్నా చూస్తే బాగుండదనే భయంతో సంచరించేవాడు ఇలా వ్యవహరించడం చేత శశిరేఖ మనస్సులో విచిత్రమైన ఆలోచనలు చెలరేగాయి "ప్రేమ కలవాడైనా ప్రేమ చూపడా? ఉన్నదని చెప్పును. అన్నియు పెండ్లి అయిన తరువాత అనును కాని ప్రేమయే నిజముగా నున్నచో తన్నెడబాసి ఇల్లుండగలడా? లేకపోయిన తాపిట్టిబెడు జీవితము గడుపుచున్నానని, జాలి తలచి ఈ విధముగ తన్నుద్ధరింపతలచెనేమో! ఒక పాపపు జీవితమును పవిత్రవంతము చేయుచున్నానని కాబోలని తలంపు! ఈ వివాహమును మహాస్వార్థ త్యాగమును చేయుచున్నాడని గాబోలు తన్నుద్ధరించుటకు! ఈ తలపుతో శశిరేఖకు కోపము కలిగెను". (పుట–115) ఇట్టి అసంబద్ధపుటా వేశంతో రామారావు ఎడల తృణీకార భావాన్ని వహించింది ఈ సమయంలో సుందరరావు ఆమెను బలవంతపరచి, బ్రతిమాలి, ఏడ్చి, తనవెంట తీసుకొని పోయాడు. సుందరరావును అసహ్యించుకొనిన శశిరేఖ, రామారావునే ప్రేమించానని చెప్పిన శశిరేఖ, రామారావుని విడిచి సుందరరావుతో వెళ్ళి పోవడంచేత నీతిని, నియతిని విడిచిందని చెప్పవచ్చును సామాజికదృక్పధంలేని వాంఛాపరివృత్తి నియతిని ఆశ్రయించిన కామం కన్న, స్వేచ్ఛను ఆశ్రయించిన కామాన్నే శశిరేఖవంటి స్త్రీలు కోరుదురని చలం స్ఫురింపచేస్తున్నాడు.

ఇందుకు ఫలితంగా శశిరేఖ సుందరరావు నుండి తిరిగి పరాభవం పొందడమే జరిగింది. సుందరరావు ఆమెను కులస్త్రీగా చూడక కులటగానే భావించాడు. అతని స్త్రీ స్వేచ్ఛా సిద్ధాంతం ఆచరణలో స్త్రీని అవమానపరచడానికి మాత్రమే ఉపయోగపడింది. స్త్రీ–పురుషుల ప్రవృత్తులలోని భేదాన్ని చలం ఇలా వ్యాఖ్యానిస్తున్నాడు. "పురుషునికి ప్రేమ ఆటగాని, స్త్రీకి ప్రేమయే జీవనము. ప్రేమించెనా స్త్రీ ప్రేమించువానికి తనకును శాశ్వతమగు బంధనము కలదని తలచును, తన కిష్టములేని పురుషుని స్త్రీ తిరస్కరింప వచ్చునుకాని, తనను ప్రేమించినందులకై ఆతనియెడ ప్రేమ చూపక మానదు. పురుషుని స్వభావమట్టిదిగాదు తన యిష్టము తిరుగగనే పూర్వమువంతయు మరచి పోవును." (పుట–122) ఇక్కడ పురుషుడనగా సామాజిక దృక్పథంలేని కాముకుడనే భావించాలి. చలం సుందరరావు మనస్తత్వాన్ని ఇందులో ధ్వనింప చేసాడు. రామారావు చిన్నప్పటి ప్రేమను ఇంకా పదిలపరచుకున్నాడు. స్త్రీ ఉత్పత్తి మాతృక అగుటచేత, పురుషునిచేత అనుభవింపబడునది అగుటచేత, ప్రేమానుభవాన్ని పొందేది అగుటచేత ప్రియునికి తనకు శాశ్వత సంబంధం కలదని తలుస్తుంది. శశిరేఖ ప్రేమే జీవితమని, దానికి వ్యవస్థకు సంబంధం ఉందని భావించలేదు. అందుచే ఆమె రామారావును మరచి కృష్ణుని, కృష్ణుని మరచి సుందరరావును, సుందరరావును మరచి రామారావును కోరింది. ఈ విధంగా శశిరేఖ సెక్స్‌ను దుర్వినియోగ పరచినందులకు ఆపదలపాలైందని చలం చెప్పదలచాడు. శశిరేఖ జీవితసాదృశ్యం ద్వారా చలం కాల్పనిక దృక్పథం, సామాజిక రంగంలో ఫలించడంలేదని ధ్వనింపచేస్తున్నాడు.

ఇటువంటి పాత్రకు మతపరమైన నైష్ఠిక జీవనంలో అభ్యాసం ఇస్తే బాగుపడుతుందేమోననే ఉద్దేశ్యంతో రచయిత సుందరరావు ఇంటి నుండి నవజీవనదాసు అనబడు బ్రాహ్మమత ప్రచారకుని ఇంటిలో ప్రవేశపెట్టాడు. ఆమెకున్న లౌల్యప్రధానమైన కాల్పనిక దృక్పథం తొలగి పోతుందని ఆశించాడు. కాని అది ఫలవంతంకాలేదు, కాని నవజీవనదాసు పవిత్రమైన నిష్ఠాబద్ధమైన జీవితాన్ని ప్రత్యక్షంగా చూచి శశిరేఖకు వ్యవస్థాబద్ధమైన శాంతి ఎడల అభిమానం తలెత్తింది. అందుకే "ఈయనను చూచినప్పటి నుండియు ఆమె హృదయమున నెన్నడెరుంగని ఆందోళన మొకటి అంకురించెను. తానువేనినంత అమూల్యము నుంచికొనెనో, అట్టి తలపులన్నియును, తన అహంభావమంతయును మంచువలె కరిగిపోవుచున్నట్లు తోచుచుండెను." (పుట–131) నవజీవనదాసు సంగీతాన్ని విని తన జీవితాన్ని సింహావలోకనం చేసికొని బాధపడింది.

సామాజిక చైతన్యం

తన ప్రవర్తనలోని లోపాలను గ్రహింపసాగింది. "కాని ఆరాగము చాలును, కంఠము చాలును, హృదయము కరిగిపోయెను. జీవనమంతయు తిరిగి గడచుచున్నట్లుండెను. ఏమిటీ ఆవేశము. ఏమిటీ మహాఆందోళనము. ఎందుకో తెలియక శశిరేఖ వెక్కివెక్కియేడ్వ నారంభించెను. కన్నీళ్ళలోనుండి ఆమె జీవితమునందలి మలినత్వమంతయు, భారమంతయు. కఠినత్వమంతయు, కడగబడుచున్నట్లుండెను" (పుటలు–131, 132) ఇలా శశిరేఖ తన దృక్పథంలో ఎక్కడో లోపమున్నట్లు. ఆ లోపాన్ని గ్రహించలేని అహంకారం తనకున్నట్లు, దాని ఫలితంగా తనలో ఆందోళనం అశాంతి అని బాధపడుతూ ఉండింది. తనలో ఉన్న లోపాన్ని ఇతరులు చూపిస్తే సహించదు గొప్ప ఆవేగంతో ఖండిస్తుంది. చంచలత్వం వల్లనే అట్టి అశాంతి ఆమెకు కలిగింది అని నవజీవనదాసు అంటే, ఆ విషయంలో తాను పశ్చాత్తాప హృదయంతో బాధపడినా, పైకి ఒప్పుకోదు. ఆమె అహంతో "అంతే అనుకున్నారా? నేను అనుభవించిన కష్టాలు ఒక కష్టాలా? అనుభవించిన సుఖమో? ఆ సుఖంలో నూరోవంతు అనుభవించడానికి నేను పడ్డ బాధ తిరిగి పదిసార్లు పడతాను. మీరు చెప్పే శాశ్వతమైన శాంతి ప్రేమనసలు అనుభవించని వాళ్ళకి. అట్లాంటి ప్రేమననుభవించాను గనుకనే యిప్పడీ అశాంతి" (పుట–143) అని అంటుంది. నిజమైన ప్రేమ అశాంతిని కలిగిస్తుందని ఆమె అసంబద్ధ వాదన. పెళ్ళిని తన దృక్పథాన్ని నవజీవనదాసుతో ఈ విధంగా అంటుంది. 'పెళ్ళి ప్రేమించడానికి. అదికాదు. ప్రేమిస్తారుగనకే పెళ్ళి. సౌఖ్యపెడతాడా లేదా, మంచివాడా కాదా, అనేది ప్రశ్నకాదు. ప్రేమిస్తున్నాడా లేదా అనేది కూడా అంత గొప్ప ప్రశ్న కాదు ఆడదానికి నేను ప్రేమిస్తున్నానా లేదా అనేది వక్కటే సంగతి. ఎంత నీచుడుకాని, దుర్మార్గుడుకాని, దరిద్రుడుకానీ, స్త్రీ తాను ప్రేమించిందా, ఇంక ప్రాణమున్నా యిచ్చివేస్తుంది. అదే వివాహం. తక్కినవి కావు.' (పుట–142). కాబట్టి తాను ధర్మారావుని పెళ్ళాడనని చెప్పింది. అతని మీద తనకు ప్రేమ లేదు అని చెప్పి నవజీవనదాసు ప్రతిపాదనను తిరస్కరించింది. ఇక్కడ శశిరేఖ ఇష్టంలేని పెళ్ళిని తిరస్కరించుటలో ప్రేమకు ఆమె ఇచ్చిన స్థానం ప్రశంసనీయమైంది. కాల్పనిక దృక్పథం ప్రేమకు అత్యున్నత స్థానమిచ్చిందనే విషయం ఈమె మాటల్లో ధ్వనిస్తున్నది. పెళ్ళిని గురించిన నవజీవనదాసు అభిప్రాయం గమనింపదగింది. అతడు శశిరేఖతో 'పెళ్ళిని గురించి నీవు తప్పు అభిప్రాయాలు పడుతున్నావు. లోక వ్యాపారం జరగడం ముఖ్యమైన వుద్దేశ్యం. ప్రేమ వున్నవాళ్ళకే మంచి సంతానం పుడుతుంది. కనక ప్రేమ కావాలన్నారు. అది

గాక మానవ స్వభావం దుర్బలం, పెళ్ళి అయితే పాపంలో పడకుండా వుంటారు.' (పుట–142). ఇందుకు సమాధానంగా శశిరేఖ 'పాపానికి లోబడకుండా వుండడానికా పెళ్ళి? ఇష్టంలేనివాణ్ణి పెళ్ళి చేసుకోవడమంత పాపం యీ లోకంలో ఇంకేమీ లేదు.' (పుట–142). అని అంటుంది. నవజీవనదాసు 'లోక వ్యాపారం' కొరకు పెళ్ళి అంటే; శశిరేఖ 'ప్రేమ' 'ఇష్టం' కొరకు పెళ్ళి అంటుంది. వీరిద్దరివి రెండు పాక్షిక దృక్పథాలు. రెంటిని సమన్వయించిన ఇష్టమైన వాణ్ణి పెళ్ళి చేసుకొని ప్రేమగా ఉంటూ లోక వ్యాపారానికి ఉపయోగపడడమే పురుషార్థమని చలం చెప్పదలచిన విషయం.

సుందరరావు మీద ప్రేమ పోయిన తరువాత ఆమె రామారావుని ప్రేమించింది. రామారావు కూడా ఆమెను ప్రేమించాడు. పెళ్ళాడతానని చెప్పాడు. కాని శశిరేఖ తన స్వభావాన్ని, స్వేచ్ఛని విడిచి నియతితో కూడిన వివాహ వ్యవస్థలో జీవించడం నీచమనుకుంటుంది. 'నా నైజమే స్వేచ్ఛ. నా స్వేచ్ఛ నిచ్చివేసి నేనెందుకు బ్రతకడం' (పుట–176) అని అంటుంది. తన సహజాతాలకు, స్వభావానికి లోబడి నడచుకోవడమే స్వేచ్ఛ అని అనుకుంటుంది. నిజానికి అదే బానిసత్వమని ఆమెకు తెలియదు. అందుకే రామారావుతో పెళ్ళి లేకుండా కలిసి వుంటానంది. పెళ్ళాడటానికి నిరాకరించింది. వివాహ వ్యవస్థను తిరస్కరించింది.4 ప్రేమే ప్రధానంగా స్వేచ్ఛగా జీవించటం అన్నది అస్పష్టంగా తోస్తుంది. వ్యవస్థలో ప్రేమే ప్రధానంగా జీవించడం వీలుపడదని అంటుంది. అంటే స్వేచ్ఛగా ఇష్టమున్నవాడితో ఇష్టమున్నన్నాళ్ళు శరీర సుఖాలను అనుభవించడమే ప్రేమఅని భావించినట్లు తోస్తుంది. ఇది వ్యవస్థలో వీలుపడదు కావున ఆమె వివాహానికి ఒప్పుకోలేదు, కాని రామారావు తమ ప్రేమను వివాహ వ్యవస్థ ద్వారానే తీర్చుకోవాలని పట్టుబట్టాడు. తన నైజాన్ని వదలుకోలేని శశిరేఖ రామారావును పెళ్ళాడి, ప్రేమ పోగానే అతనిని విడిచి వెళ్ళిపోయి భంగపెట్టి అతనికి అశాంతిని కలిగించదలచుకోలేదు.

అటువంటి శశిరేఖ సౌందర్యానికి ఆకర్షితుడై, ఏకాంతంగా ఆమెను తన గదిలో అనుభవించి, తాను చేసిన పనికి బాధపడి ఆమెను విడిచి రామారావు వెళ్ళిపోయాడు. శశిరేఖ, రామారావు నీతి, నియతిగల జీవితాన్ని చూచి అతనితో స్నేహం తన ప్రకృతికి సరిపడదని మరియు లోకంలో తన నైజంతో జీవించడం అసాధ్యమని తలచి నైరాశ్యంతో ఆ గదిలోనే ఆత్మహత్య గావించుకొన్నది.

సామాజిక చైతన్యం

శశిరేఖ ఈ విషాదాంత సంఘటనవల్ల స్త్రీ వాంఛా ప్రవృత్తి వ్యవస్థాగతం గానపుడు దుఃఖమయ మౌతుందనేది చలం చెప్పదలచిన విషయం రామారావుది సంస్కార దృక్పథం వ్యవస్థాబద్ధమైంది సామాజిక దృక్పథంతో కూడుకొన్నది ఆయన జీవితం నీతి, నియమం, నిగ్రహంతో కూడుకొన్నది. అలాంటి నిగ్రహపరుడే ఏకాంతంలో ఆమెవల్ల వాంఛను తీర్చుకొన్నాడు అవివాహితతో భోగ జీవితాన్ని గడపడం వ్యవస్థాపరంగా సమంజసం కాదని అతని పశ్చాత్తాపంవల్ల చలం చెప్పదల చాడు అని భావించవచ్చును. స్త్రీని పవిత్రంగా చూడడం ఆమె ప్రవృత్తికి న్యాయం చేకూర్చడం వ్యవస్థలోనే జరుగుతుందని నమ్మినవాడు రామారావు ఈమె ప్రవృత్తిని నవీనాభిప్రాయాలు గలిగిన రామారావే మన్నించలేదు కావున శశిరేఖ వంటి పాత్రలు వ్యవస్థలో మనలేవు నీతి, ధర్మం, ఈశ్వరుడు మొదలైన భావాలతో నిగ్రహాన్ని పోషించుకొంటున్న రామారావే శశిరేఖ సౌందర్యానికి చలించి లొంగిపోయాడు నిగ్రహం అంతగా సాధింపబడని సమాజంలో శశిరేఖ వంటి స్త్రీల సౌందర్యానికి వివాహ వ్యవస్థ మాత్రమే భద్రత చేకూరుస్తుంది అలాంటి వ్యవస్థ లేనపుడు స్వేచ్ఛా ప్రణయాన్ని, మార్పులో ఆనందాన్ని కోరే స్త్రీ—పురుష ప్రవృత్తులు అలజడికి, అశాంతికి గురిఅవుతుంటాయి ఈమెకు వివాహంలో ప్రేమలభించినట్లయితే ఇలాంటి అసంబద్ధ సిద్ధాంతాలతో, కాల్పనిక దృక్పథంతో జీవితాన్ని నాశనం చేసికొనేది కాదేమో' కావున తలిదండ్రులు తమ కూతుళ్ళకు పెళ్ళి నిశ్చయించే సమయంలో వయస్సు, అందం సంస్కారం, ప్రేమలను దృష్టిలో పెట్టుకోవాలని చలం హెచ్చరిస్తున్నట్లు భావించ వచ్చును వివాహ వ్యవస్థలో ప్రేమకు చ్యుతి జరిగినప్పుడు స్త్రీ బయటపడి స్వేచ్ఛగా తన స్వభావాన్ని అనుసరించి శరీర వాంఛలను తీర్చుకుంటూ, అదే ప్రేమ, ప్రణయమని భావిస్తూ నియతి లేకుండా వ్యవహరించినపుడు సమాజంలో సృష్టింపబడు అలజడిని చలం చూపి సమాజం వివాహ విషయంలో ఈ విషయాలను దృష్టియందు ఉంచుకొనాలని హెచ్చరిస్తున్నాడే తప్ప శశిరేఖ జీవితం ఆదర్శమైందిగా చెప్పటంలేదని గ్రహించాలి[5]

మానసిక శాస్త్ర ప్రకారంగా చూసిన చలం సృష్టించిన శశిరేఖ పాత్ర మానసిక దౌర్బల్యంచేత వ్యవహరించిన "Neurotic heroine" అని చెప్పవచ్చును[6] సాహిత్యోద్యమాల దృష్టితో చూస్తే ఈమె కాల్పనిక దృక్పథంలోని స్వేచ్ఛా ప్రణయ తత్వంచేత వ్యవహరించిన పాత్ర అని చెప్పవచ్చు

థామస్ హార్డీ నవల "Tess of the Dubervilles" ప్రభావం ఈ నవలపై ఉన్నదంటారు.[7]

సాంఘిక స్పృహ కలిగిన రచయితల్లో రొమాంటిసిజం ఫలించదు. చలం తరువాతి నవలాకారులు సాంఘికాంశాలను గ్రహించి రొమాంటిక్ అంశాలను వదలి వేసారు. చలం రొమాంటిక్ అంశాలను గ్రహించి సాంఘికాంశాలను వదలి వేసాడు. అందుచేత ఇతని నవలలలో రొమాంటిక్ అంశాలే సాంఘికాంశాలను శాసిస్తున్నట్లు కనబడతాయి అందుచే నీతి వక్రించినట్లు తోస్తుంది. కాని చలం పరోక్షంగా సామాజికాంశాలను స్పృశించుటలో రొమాంటిక్ దృక్పథం విఫలమైందని చెప్పదలచిన విషయం. కాల్పనికతలో హేతువు. శాస్త్రీయ దృక్పథం లోపించడంచేత శశిరేఖ వంటి చలం స్త్రీ పాత్రలు కష్టాలను పొంది వ్యవస్థలో ఇముడలేక విష్క్రమించినవి. వ్యవస్థలో స్త్రీ లోకం ఉన్నత దశను పొందడానికే సమాజాన్ని హెచ్చరించి మరమ్మతుచేసే "Shock treatment" రచనలు చేసాడు.[8] అందుకే రచనలో శశిరేఖ ప్రవర్తనను రచయిత సమర్థించినట్లు కనబడుతుంది. అది కేవలం శశిరేఖవంటి పతితలలో ఆధిక్యంగా ఉన్న అంశాలనుచూపి వారిని దేవత్వానికెత్తడంలోని అంతరార్థం ఏమిటంటే; వారి అపమార్గాల వల్ల పొందిన బాధలకు ఉపశమనం పలికి సన్మార్గంలో పెట్టడానికే గాని పాతివ్రత్యాన్ని ధ్వంసం చేయడానికి గాదు.

---

అధోజ్ఞాపికలు:

1. వివరణ: 'మైదానం' నవలలో రాజేశ్వరి అమీర్, మీరాలను ప్రేమించి, తన జీవితంలోనికి ఆహ్వానించింది. 'అరుణ' నవలలో అరుణ ముగ్గురితో స్నేహంగా వ్యవహరించింది. కాని శశిరేఖ ఒకేసారి ఒకరికన్న ఎక్కువ మంది ప్రియులను జీవితం లోనికి ఆహ్వానించ లేదు.

2. 'లోకం దృష్టిలో శశిరేఖ పతిత. కాని ఆమె నైర్మల్యము, అమాయకత్వము, త్యాగశీలత, ఆమెనొక ఉదాత్తమూర్తిగ చేయుచున్నవి.'
—డా. సి. ఆనందారామం—సిద్ధాంత గ్రంథ వ్రాతప్రతి—పుట—22.

3. 'పతివ్రత స్త్రీకి భూషణమే. అది అత్యవసరము తుచ్ఛమైన కోర్కెలకు లోబడకుండా ఇంద్రియ జయాన్ని పొందడం ఆమె మనోబలాన్ని అభివృద్ధిచేసి ఆమె స్వభావానికి మెరుగునూ, ఔన్నత్యాన్ని ఇస్తుంది. తన మృదుత్వాన్నీ, మనోలావణ్యాన్నీ, అమూల్యమైన నిర్మలత్వాన్నీ యెవడికిపడితే వాడికి విచక్షణ లేకుండా, అనర్హుడైన వాడికి, తాత్కాలికంగా వాడిముందు పారెయ్యడం ఒక్క నిమిషపు కామం కోసం వృథా చేయడం మూర్ఖమైన పని.'

– స్త్రీ –(పద్మజ పబ్లికేషన్స్–పునర్ముద్రణ–1975)–పుటలు–36–37.

4. 'శశిరేఖ ప్రణయమే ప్రధానముగా జీవించునది. ప్రణయములేని వివాహమును తిరస్కరింపవచ్చును. కాని రామారావుతోడి వివాహమును సహితము తిరస్కరించి అసలు వ్యవస్థను అర్థరహితమని భావించినది.'

–డా. సి. ఆనందారామం–సిద్ధాంత గ్రంథ వ్రాతప్రతి–పుట–23.

5. (అ) 'కాబట్టి శశిరేఖను 'లా' దృష్టితోను, ధర్మశాస్త్రాల ప్రకారము సాంఘిక నీతి ననుసరించి చూస్తే శశిరేఖ నీతిరేఖకు వక్రగతి పట్టినట్లు కన్పడక మానదు. అటుగాక మన జ్ఞానచక్షువునకు చిరకాలము నుండి పట్టిన చత్వారము పోగొట్టుకొని హృదయమును విశాలము చేసుకొని చూసినట్లైతే మన శశిరేఖయు నొక చల్లని చంద్రరేఖలాగే కనబడుతుంది. శశిరేఖది యొక వ్యక్తి స్వాతంత్ర్యమును మనో ధర్మమును నిర్భయముగ వ్యక్తపరచు ఆదర్శక జీవితమే.'

–ఏ. వి. రత్నముగారు–శశిరేఖ–వ్యాసం–భారతి–నవంబర్–1928.

(అ) 'స్వాతంత్ర్యములేని సామాన్య స్త్రీలవంటి పతివ్రత కాదు. స్వధర్మ ప్రకారము ఈమె నిస్సంశయముగ పతివ్రత.'

–శివశంకరశాస్త్రి–(శశిరేఖ నవలలోని 'ప్రవేశిక' నుండి)

6. వివరణ: వాంఛలను వాని దౌర్బల్యాలను పలుదృక్కోణాల నుండి నేటి నవలాకారులు చిత్రిస్తున్నారు. బుచ్చిబాబు 'చివరకు మిగిలేది' నవలలో 'దయానిధి' పాత్ర; రాచకొండ విశ్వనాథశాస్త్రిగారి 'అల్పజీవి' నవలలో సుబ్బయ్య పాత్ర; గోపీచంద్ 'అసమర్థుని జీవితయాత్ర'లో సీతారామయ్య పాత్ర; ఇవి మనో

దౌర్బల్యంచేత వ్యవహరించిన పాత్రలనవచ్చు. వీరిని 'Neurotic heroes' అని అనవచ్చు. శశిరేఖ పాత్ర గూడా అలాంటిదే అని భావించవచ్చు.

7. థామస్ హార్డీ నవల 'Tess of the Duber villes' ప్రభావం శశిరేఖ మీద గలదు.'

—డా. బొడ్డపాటి కుటుంబరావు—ఆంధ్ర నవలా పరిణామము—పుట—319.

8. 'సుబ్రహ్మణ్యశాస్త్రిగారు మన సంప్రదాయాన్ని అందంగా చూపుతూ కథలు రాస్తుండే రోజుల్లోనే 'చలం' అనే తుఫాను తెలుగు దేశానికి వచ్చింది. తెలుగు సాహితీ సీమకు 'చలం' యిచ్చిన 'షాక్ ట్రీట్‌మెంట్' సామాన్యమైంది కాదు. తెలుగు సాహిత్య చరిత్రలో చలం అంతగా తీవ్రమైన దూషణ భూషణలకు గురిఅయిన వ్యక్తులు చాలతక్కువ మంది. 'పీటర్ వెస్ట్‌లాండ్' అనే సాహిత్య విమర్శకుడు డి. హెచ్. లారెన్స్ గురించి చెబుతూ— 'By many he was accepted as a writer with something important to say, by others he was rejected as a neurotic imposter'— అన్న మాటలు చలంగారి విషయంలో కూడా వర్తిస్తాయి.'

—శ్రీ కోడూరి శ్రీరామమూర్తి—'మూడు దశాబ్దాల తెలుగు సాహిత్యంలో 'స్వీయ చరిత్ర'—వ్యాసం—భారతి—డిసెంబర్—1978.



# 2. దైవమిచ్చిన భార్య: కథ

సుందరవరం జమీందార్ కూతురు పద్మావతి. అక్కడి తహసీల్దార్ కొడుకు రాధాకృష్ణ. వీరిద్దరు బాల్య స్నేహితులు. సరిగా పెళ్ళి వయస్సు రాకముందే పద్మావతికి మేనమామతో పెళ్ళైంది. ఆయనకు అది రెండో పెళ్ళి. ఆయనకు అప్పటికి 25 సంవత్సరాలు. ఆయన పేరు న్యాయమూర్తి.

పెళ్ళికాగానే న్యాయమూర్తి ఇంజనీరింగ్ చదవడానికి విదేశాలకు పోయాడు. పద్మావతి సుందరవరం వదలిపెట్టి తల్లిదండ్రులతో చెన్నపట్నం వెళ్ళిపోయింది. రాధాకృష్ణ కూడా సుందరవరం వదలి చదువుకొరకు ఏలూరు వెళ్ళి పోయాడు.

ఏడు సంవత్సరాల తరువాత బి. ఏ. పరీక్ష ఇచ్చి ఎండాకాలపు సెలవులకు సుందరవరంకు రాధాకృష్ణ వచ్చాడు. అప్పటికి అతనికి మంచి యవ్వనం కూడా వచ్చింది. ఆ ఎండాకాలంలోనే పద్మావతి కూడా సుందరవరానికి తిరిగి వచ్చింది. రాధాకృష్ణకు పద్మావతితో ఉన్న బాల్యస్నేహం ఇప్పుడు ప్రేమగా మారింది. అతడు తన హృదయం నిండా పద్మావతినే నింపుకొన్నాడు. ఈ సంగతి పద్మావతి కూడా తెలిసికొన్నది. కాని తనకు వివాహం అయింది కనుక భర్తను గురించి మనస్సు ఆటు లాగుచున్నది. కనుక రాధాకృష్ణను గురించి ముందు వెనుకల ఆలోచనలతో సతమతమై రాజీమార్గంగా పద్మావతి రాధాకృష్ణకు దేశసేవాతత్పరత మొదలైన ఆదర్శ భావాలను చూపించి అతని మనస్సును అటువైపు త్రిప్పగలిగింది. రాధాకృష్ణ ఆమె చెప్పిన ఆదర్శాలకు తాను నిలబడగలగటమే, ఆమె ప్రేమకు పాత్రం కావడానికి మార్గమని, అలాగే దేశ సేవలో నిమగ్నుడైనాడు.

రెండు మూడేళ్ళకాలం గడిచింది. విదేశాల నుండి తిరిగి వచ్చిన న్యాయ మూర్తితో పద్మావతి సంసారం చేస్తున్నది. రాధాకృష్ణ; పద్మావతి ఇలా న్యాయ మూర్తితో కలిసి యుండడం చూసి ఈర్ష్య పడ్డాడు. పద్మావతి తనను మనస్ఫూర్తిగా

---

దైవమిచ్చిన భార్య—ఎమెస్కో ప్రచురణ—1968.

ప్రేమిస్తున్నదని రాధాకృష్ణకు తెలుసు. అంత చనువుగా వాళ్ళు ఇంట్లో అప్పుడప్పుడు ప్రవర్తించేవారుకూడా. కాని రాధాకృష్ణకు పద్మావతి తనను ప్రేమిస్తూ న్యాయమూర్తితో కాపురం చేయగలగడం సమస్యగా పరిణమించింది. రాధాకృష్ణ ఆమెను తనతో తీసుకొని పోవాలని ఎంత ప్రయత్నం చేసాడో పద్మావతి రాధాకృష్ణతో ప్రేమగా ఉంటూ న్యాయమూర్తి వద్దనే తాను ఉండాలని అంతకంటె ఎక్కువగా ప్రయత్నించింది. న్యాయమూర్తికి తెలియకుండా కొన్నాళ్ళు, తెలిసి కొన్నాళ్ళుగా పద్మావతి, రాధాకృష్ణుల స్వేచ్ఛా ప్రణయం కొనసాగింది.

రాధాకృష్ణకు శకుంతలతో పెళ్ళైంది. పద్మావతిని ప్రేమిస్తూనే అతను శకుంతలను పెళ్ళాడాడు. అందుకు కారణం తండ్రిమాటను కాదనలేకపోవడమే. అలా పెళ్ళిచేసికొన్న తరువాత ఐదారేళ్ళపాటు రాధాకృష్ణ ఇంగ్లాండు వెళ్ళివచ్చాడు. వచ్చిన తరువాత మళ్ళీ పద్మావతిని కలిసికొన్నాడు. ఇంగ్లాండు పోయి వచ్చిన రాధాకృష్ణకు పద్మావతి తనతో స్వేచ్ఛగా ఎవరికీ భయపడవలసిన అవసరం లేకుండా తిరగాలని ఉంది. కాని పద్మావతికి అది ఇష్టంలేదు. రాధాకృష్ణతో తన సంబంధం రహస్యంగానే ఉండాలని ఆమె వాంఛించింది. రాధాకృష్ణ పద్మావతిని న్యాయమూర్తి నుండి విడదీసి తీసికొని పోవాలని చేసిన ప్రయత్నానికి పద్మావతి గట్టిగా అడ్డుపడింది. క్రమంగా ఈ సంగతి న్యాయమూర్తికి తెలిసి అక్కడి నుండి కాపురం మార్చటం మంచిదని సింగాపూర్‌కు ఆమెను తీసికొని వెళ్ళాడు. పద్మావతి గత్యంతరంలేక న్యాయమూర్తితో వెళ్ళి పోయింది.

పద్మావతికి న్యాయమూర్తివల్ల సంతానం కలిగింది. శకుంతల రాధాకృష్ణులకు కూడా సంతానం కలిగింది.

పద్మావతి మనశ్శాంతి కొరకు అనేక ప్రాంతాలుచూస్తూ మలబార్ ప్రాంతానికి వచ్చింది. అక్కడ అనుకోకుండ రాధాకృష్ణ కలిసాడు. శారీరిక సంబంధం లేకుండా ఇద్దరూ ప్రేమగా తిరిగారు. పద్మావతి వెంటనున్న పనిమనిషి వీరి ప్రవర్తనను గురించి న్యాయమూర్తికి తెలియచేసింది. వీరి అక్రమ సంబంధాన్ని కోర్టుకు ఈడ్చి జైలుకు పంపించాలని న్యాయమూర్తి పెద్ద ప్రయత్నం చేసాడు. ఈ ప్రయత్నంనుండి పద్మావతి న్యాయమూర్తిని తప్పించలేక పోయింది. ఈ కేసు ఋజువైతే తనకు,

రాధాకృష్ణకు అప్రతిష్ఠ రావడం, తమ జీవితాలు బజారుపాలు కావడం జరుగుతుందని; అలాకాక పూర్వమే ఆమె; రాధాకృష్ణ గదికిపోయి, అతని దగ్గరే చనిపోయింది. చనిపోయిన ఆమెను చూచి న్యాయమూర్తి దుఃఖించాడు. తామిద్దరు కలిస చీల్చి చంపినట్లు రాధాకృష్ణతో న్యాయమూర్తి అంటాడు.

ఇది చలం రెండవ నవల. దీని రచనా కాలం 1923.



# దైవమిచ్చిన భార్య: విషయ విచారణ

చలం సాహిత్యంపై విమర్శలు, ప్రతి విమర్శలు కొల్లలుగా వచ్చినవి. ఇంకా వస్తున్నవి. మానవ జీవితంలో ప్రధాన భూమికను వహించే స్త్రీ–పురుష సంబంధాలు, వాళ్ళ మనస్తత్వాలు అర్థమైనట్లు కనిపించినా, అర్థం కాకుండా ఉన్నవి ఎన్నో! వాని స్వరూపం పరిపూర్ణంగా ఏకకాలంలో గోచరించదు. అవి దేశకాల పరిస్థితులనుబట్టి అనేక రూపాల్లో గోచరిస్తుంటాయి. సామాజిక వ్యవస్థకు స్త్రీ–పురుష సంబంధాలు ఒదిగిపోయి సంస్కృతీ నిర్మాణంలో ప్రధాన పాత్రను వహిస్తున్నాయి. స్త్రీ–పురుషులు సహజంగా, గౌరవంగా ప్రేమించుకొని పెళ్ళి చేసికొని సుఖపడే సామాజిక వ్యవస్థా రచనకు తోడ్పడాలన్నదే చలం సాహిత్యోద్దేశ్యం. అయితే చలం ధ్వజమెత్తింది వివాహాలలోని లోపాల మీద, వానిని సమర్థించే సమాజం మీద, వానిని స్థిరపరచే స్త్రీ–పురుషుల ప్రవృత్తుల మీదగాని; వివాహ వ్యవస్థా నిర్మూలనం మీద కాదు. చలం తన నవలలలో ఒక్కొక్క దృక్కోణం నుండి ఆయా విషయాలను ప్రతిపాదించాడు. చలం తన మొదటి నవల 'శశిరేఖ'లో వివాహంలేని స్వేచ్ఛా ప్రవృత్తి, స్త్రీ ఎడల ఎటువంటి ప్రభావం చూపించి ఎట్టి అనర్థాలకు దారి తీస్తుందో చూపాడు. రెండవ నవలయైన ఈ 'దైవమిచ్చిన భార్య'లో ప్రేమలేని వివాహ వ్యవస్థలో స్త్రీ ఉండి. దానిని అధిగమించలేక, వివాహం లేకుండా ప్రేమ ఉన్నచోట మరొక వ్యక్తితో వ్యవహరించిన స్త్రీ పొందే భంగపాటును చూపాడు. చలానిది రొమాంటిక్ దృక్పథం కాబట్టి రచనలో ఆత్మాశ్రియ ధోరణి, వ్యక్తి స్వేచ్ఛావాదం, సమాజాన్ని, వ్యవస్థను అధిక్షేపిస్తున్న తీవ్రధోరణి కన్పిస్తుంది.[1] శృంగారాన్ని గొప్పగా రాస్తాడు. రచనలో ప్రచారదృష్టి కనబడుతుంది. అతడు తన ఉధృత రచనా ధోరణిలో వ్యవస్థను విమర్శించిన గుణం కనబడుతుంది. కాని అతడు విమర్శించింది లోపభూయిష్ఠమైన వ్యవస్థను మాత్రమే. అతని దృక్పథంలో గూఢంగా ఆచరణయోగ్యమైన సామాజిక దృక్పథం ఉంది. అయితే దానిని అర్థం చేసుకోక సమాజం అతనిని విమర్శించింది. అతడు వ్యవస్థను నిర్మూలించడానికి ప్రయత్నించలేదు. ఉన్న లోపాలను స్పష్టంగా ప్రదర్శించి సరిచేసుకోమని హెచ్చరించాడు.[2]

చలం కేవలం స్త్రీ–పురుషుల కామ సంబధాలను మాత్రమే ప్రధానంగా చిత్రించాడు అని అనడం సమంజసం కాదు.3 చలం ఈ నవలలో స్త్రీ–పురుషుల సహజమైన ప్రేమను భంగపరచడానికి ప్రేమలేని వివాహ వ్యవస్థ, దానికితోడు ఆర్థిక స్వావలంబనంలేని స్త్రీయొక్క సామాజికమైన అస్వతంత్రత ఎలా తోడ్పడుతున్నాయో పద్మావతి పాత్ర ద్వారా చూపాడు.

చలం తన సాహిత్యంలో పురుషుని అధికారం క్రింద స్త్రీ నలిగి పోతున్నదనే విషయాన్ని ప్రస్తావించాడనేది ఒక అభిప్రాయం 4 తన రచనల ద్వారా స్త్రీ–పురుషులలో విప్లవభావాలు, తిరుగుబాటు తత్వాన్ని నేర్పినాడనేది మరొక అభిప్రాయం.5 ఈ భావాలు ఆధారంగా చలంగారి 'దైవమిచ్చిన భార్య' అనే నవలలోని ఇతివృత్తం ఆధారంగా వ్యాఖ్యానిస్తే ఆతని సాహితీతత్వం అర్థమవుతుంది. చలం తన రచనలలో స్వేచ్ఛా ప్రవృత్తిని ప్రదర్శించిన మాట వాస్తవమేగాని, అది స్త్రీ–పురుషుల విషయంలో సమస్థాయిలో లేదు. స్త్రీల విషయంలో ప్రదర్శించినంత స్వేచ్ఛాప్రవృత్తి పురుషుల విషయంలో ఆయన చూపలేదు. చలం సాహితీ తత్వమంతా ఇక్కడ ఉంది. ఎవరు ఎవరి మీద తిరగబడాలి? పురుషుడు స్త్రీకన్న శారీరకంగా బలిష్ఠుడు. సామాజికంగా నియంత లక్షణాలు గలవాడు స్త్రీ శారీరికంగా, సాంఘికంగా బలహీనురాలు. పైపెచ్చు ఆమె ఉత్పత్తి మాతృక. పురుషుడు గూడ సంపూర్ణంగా స్త్రీ జాతిమీద తిరుగుబాటు చేయలేడు. స్త్రీని పురుషుడు తన అదుపాజ్ఞలలో ఇంటిని దాటిపోకుండా కట్టుదిట్టం చేయగలడు. కనుక స్త్రీ–పురుషుల విషయంలో ఒకరిమీద మరొకరు తిరుగబడడం అనేది లేదు. అధికృత చూపడం అన్న విషయం గూడా లేదు. స్త్రీ–పురుషులు పరస్పరం తిరుగబడడం పాలకులపై పాలితులు తిరుగబడడంవంటిదిగాని, పాలకులు పాలితులపై అధికారం చూపటంవంటిదిగానిగాదు. స్త్రీ తిరుగుబాటు చేయడం అంటే స్వేచ్ఛగా సమాజంలో సంచరించడమే తత్ఫలితంగా సమాజంలో అరాచకం, అశాంతి నెలకొల్పడమే. వివాహవ్యవస్థలో ముఖ్యంగా స్త్రీ జాతికి జరిగే అన్యాయాలపై సమాజదృష్టిని ఆకర్షించి, హెచ్చరించడానికి స్త్రీ తిరగబడితే జరిగే పరిణామాలను చూపాడు తత్ఫలితంగా వివాహ వ్యవస్థను సంస్కరించుకొని సమాజం పురోగమించడానికి చలం సాహిత్యం తోడ్పడింది

వ్యక్తులలో శారీరిక సంబంధమైన సహజాతాల ప్రకోపం ఉంది. మానసిక సంబంధమైన అనుభూతులు ఉన్నవి. వ్యక్తి చుట్టు సమాజం ఉంది తత్సంబంధమైన

కట్టుగాట్లు ఉన్నవి. సహజాతాలు, అనుభూతులు, సమాజ వ్యవస్థలో ఏర్పరచిన కట్టుబాట్లు పరస్పరం సమన్వయింపబడి తోడ్పడినపుడు స్త్రీ–పురుషులు వ్యవస్థలో ఆనందాన్ని పొందుతారు. సుఖపడతారు సమాజ పురోగమనానికి సహకరిస్తారు. అయితే సమాజంలో ఈ మూడింటికి సమన్వయం కుదరకుండా ఉండటం అనేక రకాలుగా చారిత్రిక, భౌతిక, ఆర్థిక శక్తులు పనిచేయటం మీద ఆధారపడి ఉంటుంది. వీనిని సరిచేయడానికి వ్యక్తులు, వ్యవస్థ సహకరించుకోవాలి. అట్లా సహకరించుకోనప్పుడు ఘర్షణ ఏర్పడి, అరాచక పరిస్థితులకు దారితీసి ఒకదాని అస్తిత్వానికి మరొకటి భంగం కల్గించేదిగా తయారౌతుంది. ఇటువంటి ప్రమాదాలు చలం సమాజంలో చూచాడు. వ్యక్తుల శారీరిక మానసిక, సాంఘిక ప్రవృత్తుల కనుగుణంగా వ్యవస్థ ఉండాలని చెప్పడానికి, స్తబ్ధంగా ఉన్న సమాజాన్ని మేల్కొల్పడానికి వ్యవస్థే అక్కరలేదన్నంత తీవ్ర స్థాయిలో చెప్పడానికి, శరీరావసరాలకు ఎక్కడలేని ప్రాధాన్యతనిచ్చి, ఆ ఆనందం తప్ప లోకంలో వేరే ఆనందం లేదన్నంతగా కాల్పనిక రచనా దృక్పథంతో సాహిత్యాన్ని సృష్టించాడు. స్త్రీ–పురుషుల శారీరిక, మానసిక వ్యవస్థలను సమాజం చూడడమే గాకుండా, స్త్రీ, ప్రవృత్తిని పురుషుడు గూడా గమనించడానికి తగిన హెచ్చరికలను చలం తన సాహిత్యంలో చేసాడు. స్త్రీకి వివాహ వ్యవస్థలో ప్రేమ అవసరం లేదు. కుటుంబంలో ఆస్తి హక్కులేదు. స్త్రీకి కావలసిన విద్యలేదు. ఇలా తనకంటూ ఏమీలేని స్త్రీని బలవంతంగా ప్రేమలేని వివాహ వ్యవస్థలో బంధించడంవల్ల ఆ వ్యవస్థ స్త్రీ యొక్క శారీరిక, మానసిక అవసర ప్రవృత్తులను తీర్చనందున, వానిని తీర్చుకొనడానికి స్త్రీ వ్యభిచరిస్తున్నది. అందువల్ల ఆ విధంగా సమాజం లోలోపల కుళ్ళిపోతున్నదని చెప్పడానికే ఈ నవలను వ్రాసాడు.

ప్రేమ, వివాహం ఈ రెండూ కలిసిపోకపోతే ఆ వ్యక్తుల జీవితం ఎన్ని ఇబ్బందులకు గురిఅవుతుందో, వాళ్ళ ప్రవృత్తులవల్ల సామాజికమైన వ్యవస్థా ధర్మం ఎంత అస్తవ్యస్తమవుతుందో, సమాజాన్ని ఈ విధంగా కలుషితం చేసిన ఆయా వ్యక్తుల జీవితాలు నిరర్థకాలై ఏ విధంగా విషాదాంతమై ముగిసినవో చలం ఈ 'దైవమిచ్చిన భార్య' నవల ద్వారా నిరూపించాడు.

ఈ నవలలో నాయిక పద్మావతి. పద్మావతికి రాధాకృష్ణ యందు ప్రేమ. కాని న్యాయమూర్తితో పెళ్ళైంది. వివాహానికి ప్రేమకు కూడా స్త్రీ–పురుషుల మధ్య

శారీరక సంబంధం ఉండడం సహజం. అందుచేత పద్మావతికి రాధాకృష్ణ మరియు న్యాయమూర్తితో శారీరక సంబంధం ఏర్పడింది. న్యాయమూర్తికి పద్మావతి భార్య అవడం చేత వ్యవస్థాధర్మంయొక్క బలంచేత ఆమెను తన అదుపాజ్ఞలలో ఉంచుకొని సంసారం సాగించాలని కోరడం సహజం ఆట్లాగే రాధాకృష్ణ పద్మావతిని ప్రేమించటంచేత, ప్రియురాలవటంచేత శారీరకంగా తనొక్కనితోనే సంబంధం కలిగి ఉండాలని కోరడం సహజమే. వివాహం కల్పించే భద్రత వలన, న్యాయమూర్తి వలన వచ్చే హోదా, కీర్తి, డబ్బును వదలలేక పద్మావతి న్యాయమూర్తిని కాదనలేదు తన ప్రియునితో తనకున్న సంబంధాన్ని సుఖాన్ని కాదనలేక రాధాకృష్ణతోను కలిసి వ్యవహరించింది. ఈ ఇద్దరి మధ్యన ఆటో ఇటో తేల్చుకోలేక, ఆటు ఇటు పొత్తు కుదరక ఉభయులతో సంబంధం లేకుండా తనకుతానై కృశించి, నశించి పోయిన స్త్రీ పద్మావతి

చలం సామాజిక స్పృహతో ఈ సమస్యను ఇలా ప్రదర్శించటంచేత ఏమి ప్రబోధించదలచినట్లు ? ఈ కథను ఈ విధంగా మలుపు త్రిప్పటంచేత ఇందులోని ప్రధానమైన మూడు పాత్రలచేత మూడు రకాలైన హెచ్చరికలు చేస్తున్నట్లు స్ఫురిస్తున్నది మూడు పాత్రలు గూడా సమాజంలోని మూడు రకాలైన మనుష్యులకు ప్రతిబింబాలు. వయసులోని తారతమ్యాన్ని లెక్కచేయకుండ స్త్రీల విషయంలో అహంకారంతో దురుసుగా ప్రవర్తించే వయస్సు మళ్ళిన పురుష సమాజానికి ప్రతినిధి, న్యాయమూర్తి. అనేక కారణాలచేత ప్రేమించిన స్త్రీపట్ల వ్యవస్థాధర్మం తనకు అనుకూలంగా లేనపుడు గూడ మోహాన్ని త్రెంచుకోలేని అక్రమ సంబంధమే సంబంధంగా వ్యవహరించడానికి సంసిద్ధమై, సామాజిక స్పృహ అంతగాలేని వైయక్తిక లైంగిక వాంఛలవెంట ప్రవర్తించే యువపురుష సమాజానికి రాధాకృష్ణ ప్రతినిధి తన ప్రమేయం లేకుండా, వివాహ వ్యవస్థలోనికి నెట్టబడి తన శరీరగతమైన లైంగిక వాంఛలకు సంబంధించిన పురుష జీవితాలతో తెగదెంపులు చేసుకోవడానికి ఇష్టపడక సామాజిక వ్యవస్థను లోలోపల కుళ్ళబెట్టడానికి పాల్పడే స్త్రీ సమాజానికి పద్మావతి ప్రతినిధి.

ఈ విధంగా ఈ ముగ్గురిని మూడు కోణాల నుండి ప్రదర్శించటంచేత సమాజానికి ప్రేమలేని పెండ్లిండ్ల వలన కలుగే అనర్థాలను చూపి చలం సమాజాన్ని హెచ్చరిస్తున్నట్లు తెలుస్తున్నది.

పద్మావతి రాధాకృష్ణను ప్రేమించి, భర్త దగ్గరే ఎందుకు ఉన్నట్లు అనేది విమర్శించాలి పద్మావతిని రాధాకృష్ణ సామాజికంగా, ఆర్థికంగా, గొప్ప స్థాయిలో పోషించే స్థితిలో లేడు. అతనితో లేచిపోతే శరీరావసరాలు తీరవచ్చును గాని, స్త్రీకి కావలసిన సామాజిక భద్రత, గౌరవప్రదమైన హోదా లభించవు. అవిలేనపుడు తల యెత్తే సమస్యలతో ప్రేమ చచ్చిపోయి తనను రాధాకృష్ణ నీచంగా చూసే అవకాశ ముంటుంది. అందుకే అతనితో లేచిపోదు కాబట్టి న్యాయమూర్తితో ఉంటూనే రాధాకృష్ణతో కాలం గడిపింది భర్తయైన న్యాయమూర్తి దగ్గర ఆర్థికంగా, సామాజికంగా ఉన్నత జీవితాన్ని అనుభవిస్తున్నది. రాధాకృష్ణతో శారీరిక సుఖాన్ని అనుభవిస్తున్నది. కేవలం న్యాయమూర్తి సామాజిక హోదాను మాత్రమే అనుభవించి ఉండలేదు. కేవలం కామాన్ని రాధాకృష్ణతో తీర్చుకొని అతని దగ్గరే ఉండలేదు. ఈ స్థితిలో పద్మావతి ఇద్దరిని అంగీకరించక తప్పలేదు. రాధాకృష్ణకు ఆర్థికబలం ఉంటే పద్మావతి న్యాయమూర్తిని వదలిపెట్టేదేమో! కనీసం నేడు స్త్రీలకు ఉన్న ఉద్యోగావకాశాలు ఆమెకు ఉన్నా ఆమె స్వేచ్ఛను పవిత్రంగా కాపాడుకునేదేమో! ఈ రెండూ లేనపుడు ఆమె పరిస్థితి దీనంగానే ఉంటుంది కాబట్టి స్త్రీ–పురుషుల ప్రేమకు సామాజిక దృక్పథం ఉండాలి. అది లేనపుడు స్త్రీ వ్యభిచరించడం జరుగుతుందని చలం సమాజాన్ని హెచ్చరిస్తున్నాడు. స్త్రీ తనకు నచ్చిన వాడితో వివాహ వ్యవస్థలో ప్రేమగా ఉంటే అది సమాజానికి బలం. అప్పుడు వ్యభిచారం ఉండదు. ఒక స్త్రీ ఇద్దరిని ప్రేమించడం, ఇద్దరితో కలిసి ఉండడంవల్ల ప్రమాదాలు హెచ్చు. ఒక స్త్రీని ఇద్దరు పురుషులు ప్రేమించడంవల్ల జెలసీలతో తగాదాపడడం జరుగుతుంది. అంతేగాని స్వార్థపరుడైన పురుషుని వల్ల స్త్రీ నష్టపడుతున్నదని, సమాజం స్త్రీని వివాహ వ్యవస్థద్వారా నిర్బంధిస్తున్నదని సంప్రదాయం లొంగదీస్తున్నదనడం, స్వేచ్ఛలో గొప్ప ప్రేమను అనుభవించారనడం సమంజసమైన విమర్శ అనిపించదు.6 అంతేగాక పద్మావతిలో సమాజ సంస్కృతి జీర్ణించుకొని ఉన్నదని, చలం సంప్రదాయ సిద్ధమైన విలువలను విడిచిపెట్టని దశలో ఉన్నాడని చెప్పటం గూడ సమంజసమనిపించదు.7 అయితే 'శశిరేఖ'లో వివాహ వ్యతిరేక వాతావరణాన్ని స్ఫురింపచేసిన చలంలో సమాజ సంస్కృతి జీర్ణించి ఉందని భావించవచ్చునా? చలం ఈ నవలలో వివాహ వ్యవస్థ స్త్రీ–పురుషుల మధ్య ఉండే సంబంధాన్ని మరొక కోణం నుంచి దర్శించాడు.

సామాజిక చైతన్యం

పద్మావతి రహస్యంగా రాధాకృష్ణతో సాగిస్తున్న ప్రేమ వ్యవహారం న్యాయమూర్తి దృష్టికి రాగా, రాధాకృష్ణ 'ఈశ్వరుడి కళ్ళ ముందు నేనే ఆమె భర్తని' (పుట-83) అని న్యాయమూర్తితో పలికినపుడు పద్మావతి పరిస్థితి సంకటంలో పడింది. రాధాకృష్ణ భార్యగా ఉండటానికి ఆమెకు ఇష్టం లేదు న్యాయమూర్తి లోలోపల ఈ చర్యకు బాధ పడ్డాడు. తన ప్రేమ వ్యవహారాన్ని భర్తకు తెలియనియ్యడం పద్మావతికి ఇష్టంలేదు. ఈ సమయంలో వ్యవస్థాబలంచేత న్యాయమూర్తి; ప్రేమబలంచేత రాధాకృష్ణ ఆమెను స్వంతం చేసుకోవాలనుకున్నారు కాని ఆమె విచిత్ర పరిస్థితిని అర్థం చేసుకొనే వాడు ఎవరూ లేరు వారి తగవును పెంచటం తన ప్రతిష్ఠకు భంగకరమని భావించింది. అందుకు వెంటనే తానెవరిదాన్నీగానని ఈ విధంగా అంది. 'యెందుకు వుండగూడదూ ఇక్కడ? ఇద్దరిలో యెవరినో యేఒకోడం యేమిటి? యెందుకు యేఒకోవాలి. యెవరోవొకరు వుండితీరాలా యేమిటి నాకు మొగనాధుడు? మీ ఇద్దరూ అక్కర్లేదు. న్యాయమూర్తిగారూ! నేను మీ పదార్థాన్ని కాదు మీరు చెప్పినట్లు మీ ఆజ్ఞకిలోబడి వుండేందుకు. రాధా! నీ దాన్నికాదు, నీతో వొచ్చెయ్యడానికి. నా కోసం మీ ఇద్దరూ యెందుకిలా బొమిక ముక్క కోసం కుక్కల్లాగ పోట్లాడుతారు' (పుట-85) అని హెచ్చరించింది. తాను వారు చెప్పినట్లు నడుచుకోవడానికి 'పదార్థాన్ని' యంత్రాన్నికానని, తనకు మనస్సు, ఆలోచనాశక్తి ఉందని అటు వ్యవస్థ ఇటు ప్రేమ తనను స్వంతంచేసికొనే విషయానికి వచ్చినపుడు తీవ్రంగా ధిక్కరించింది రాధాకృష్ణది రొమాంటిక్ దృక్పథం. ప్రేమ ఉంటేచాలు సంతోషంగా, చింతలేకుండా ఉండవచ్చునని భావిస్తాడు అందుకే 'మన ప్రేమ ననుభవించడానికి సమయమే వుండదు. నేను నీతో వున్నప్పుడల్లా సంతోషంగా, చింతలేకండా, అందమైనచోట్ల అనుభవి చాలని వుంటుంది— తోటల్లో—మేడల్లో—' (పుట-51) 'ఒకరి ప్రేమ వొకరికి చాలదూ? యెన్ని కష్టాలు వస్తేనేం? మన ప్రేమ మాధుర్యంలో కష్టాలు కనబడుతాయా! బాధపడ్డకొద్దీ అనురాగం వృద్ధిపొందుతుంది' (పుట-51). ఇలా కాల్పనిక దృష్టితో 'మైదానం'లో రాజేశ్వరిలాగా, 'అరుణ'లో అరుణలాగా మాట్లాడుతాడు. అతని కాల్పనిక దృష్టిని పద్మావతి వాస్తవ దృష్టితో ఇలా ఖండిస్తుంది. 'అనురాగం వుంటేసరి. ఒకరినొకరు పూసుకు తిరిగినకొద్దీ యెక్కువవుతుందనుకొంటారు. భ్రమ. యవ్వన, కామ జనితమైన భ్రమ. నా చాత నువ్వు ముసలిదానిమల్లే మాటలాడిస్తున్నావు. తప్పదు రాధా! నేను నీతో వొచ్చేసి నీ భార్యమల్లే వుంటే యీ ప్రేమ, ఆనందం నన్ను చూడగానే కలిగే సుందరోద్రేకం,

నీ కళ్ళల్లో మెరుపూ అన్నీ ఒక్క నెలలో మాయమౌతాయి. నేను వుండడంవల్ల నీతో నీకు కష్టాలూ, బాధలూ, చికాకులు కలుగుతాయి అవన్నీ నేను పడాలి. నాకు పనిచేత కాదు. నీకు కోపం వస్తుంది. నేను మాటలుపడే రకందాన్ని కాదు. నిన్ను చీదర పెడతాను. యేది సరిగ్గా జరక్కపోయినా నా మీదికి వస్తుంది. వుండు. విను. నాకు తెలుసు మొగాళ్ళ సంగతి ఈ బాధలన్నీ నేను పడనవి కాదు, బాధలు పడితే లాభ ముండాలి. బాధలవల్ల ప్రేమ యెక్కువవుతుందంటావు, ఇలాంటి బాధలవల్ల కాదు. నాటకాల్లో, కావ్యాల్లో రాసే బాధలు వేరు— నీకు నా మీద ప్రేమ నశిస్తుంది". (పుట–52) అని కనువిప్పు కలిగించే వాస్తవాలను పద్మావతి, రాధాకృష్ణకు తెలుపుతుంది. అయితే రాధాకృష్ణ ఆమెను వదలుకోదలచుకోలేదు తాను రాధాకృష్ణతో ఉండటానికి వెళ్ళితే తనతోబాటు శకుంతల జీవితం గూడా నాశనమౌతుందని పద్మావతి భావించి వెళ్ళలేదు ఇలా పద్మావతిలో సామాజిక దృక్పథం రొమాంటిక్ దృక్పథాన్ని అధిగమించిందని చెప్పవచ్చును.

రాధాకృష్ణకు న్యాయమూర్తి మీద జెలసీ. పద్మావతికి శకుంతల మీద జెలసీ. న్యాయమూర్తికి రాధాకృష్ణ, పద్మావతులపై కోపం. పురుషుడికి స్త్రీ తన ఒక్కనితోనే ఉండిపోవాలన్న స్వార్థం ఉంది. ఈ రకమైన స్వార్థబుద్ధి పురుషుని విషయమున స్త్రీకి ఉంది. ఇలా ఇద్దరి యందున్న స్వార్థం దుష్టం గాదు ఇది వ్యవస్థా ధర్మానికి పునాది. దీని మీదనే వివాహ వ్యవస్థ ఏర్పడిఉంది. స్త్రీ—పురుషులలో సహజంగా ఉండే ఈ స్వార్థం వ్యవస్థాబద్ధం కానపుడు ఈ జెలసీలు ఏర్పడి, ఇదే మోహం అన్నట్లుగా విజృంభించి జీవితాలని నాశనం చేస్తాయి. పద్మావతి తెలివైనది. తనలోని వాంఛ ఒకవైపు, వ్యవస్థ మరొకవైపు ఆమెను బాధించాయి. ఈ రెంటి మధ్య నలిగింది. తాను సంఘపు కట్టుబాట్లకు వ్యతిరేకంగా నడిచినందుకు బాధల్ని పొందానని గ్రహించింది. కాని రాధాకృష్ణతో ప్రేమ బంధాన్ని ఛేదించుకోలేక పోయింది. చిన్నప్పటి స్నేహం రాధాకృష్ణతో ప్రేమగా మారి ఈ విధంగా పరిణమిస్తుందనుకోలేదు. చిన్ననాటి నుండి బాలబాలికలను స్వేచ్ఛగా, లక్ష్యశుద్ధి లేకుండా, పెద్దల కట్టుబాట్లు లేకుండా తిరగనిస్తే స్నేహం ప్రేమగామారి, ప్రేమ శరీరవాంఛలకు దారితీసి, వారితో పెళ్ళికాని పరిస్థితులు ఎదురైనపుడు, పూర్వ అనుబంధాలను అధిగమించలేక కష్టాలకు గురి అవుతారని చలం ఈ సంఘటన ద్వారా హెచ్చరిస్తున్నాడు.

సామాజిక చైతన్యం

రాధాకృష్ణకు వ్యవస్థ అవసరంలేదు. వాంఛకు అధీనుడు. సామాజిక దృక్పథం లేనివాడు. కాబట్టి ఆమె తప్ప అతనికి ఇంకేమీ అవసరం లేకపోయింది. తన మీది నుండి దృష్టిని మరల్చడానికి పద్మావతి రాధాకృష్ణను దేశ సేవవైపు మరల్చింది. "పెళ్ళాం కోసం, పిల్లలకోసం మాత్రం బతకడం మొగాడికి చాల నీచం కుంగిపోతాడు. బానిస అవుతాడు'. (పుట–55). కాబట్టి గొప్ప ఆదర్శ వ్యక్తివి గమ్మని ప్రబోధించింది. స్త్రీ ఉన్నది వాంఛలను తీర్చడానికేగాదు. 'గొప్ప పనులకి. గొప్ప ఆదర్శాలకి, గొప్ప ఊహలకి వుత్సాహ మివ్వాలి'. (పుట–35) అని చెప్పి ప్రోత్సాహపరచింది తత్ఫలితంగా గొప్ప నాయకుడైనాడు. అయినప్పటికి స్త్రీ–పురుష సంబంధమైన సామాజిక స్పృహలేదు. కాబట్టే తరువాత కూడా ఆమెను స్వంతం చేసుకోడానికి పాటుపడి, భంగపడి, ఆమె విషాదాంతానికి కారకుడయ్యాడు.

తల్లిదండ్రులు సమాజంలో తమ ఆడబిడ్డలను ఎంతటి నిస్సహాయ స్థితిలో వివాహ వ్యవస్థలో ఇముడ్చడానికి ప్రయత్నిస్తున్నారో ప్రేమలేని భర్త అందులో ఇంకొక స్త్రీపై మోహం ఉన్న భర్త దగ్గర వ్యవస్థను నమ్మిన భార్య ఎంతటి దుర్భర వేదనలను అనుభవిస్తుందో చలం, శకుంతల పాత్ర ద్వారా ప్రదర్శించాడు శకుంతల తన భర్త అయిన రాధాకృష్ణ అనుగ్రహం కొరకు ఎనిమిది సంవత్సరాలు ఎదురు చూసింది. తన భర్తను ఆకట్టుకున్న పద్మావతిని కూడా చూచి వచ్చింది. తన భర్తను తన వైపు ఆకర్షించుకోడానికి పద్మావతి పిల్లలున్న సంగతిని, ఆమె భర్తతో సుఖంగా కాపురం చేస్తున్న సంగతిని సావిత్రి ద్వారా చెప్పించింది క్రమంగా భర్తను వశం చేసుకొని పిల్లలను కూడా కన్నది. శకుంతల వ్యవస్థనే నమ్ముకుంది. తన శరీరాన్ని, మనస్సును వివాహ ధర్మానికే ఒప్పగించింది. ఆమె ప్రవర్తనను సావిత్రి రాధాకృష్ణతో ఇలా చెబుతుంది. 'శకుంతల వెయ్యి చావులు చస్తుంది. యింకొకణ్ణి తనని తాకనిస్తుందా? పద్మావతి గోలేగాని రత్నమంటి శకుంతల కళ్ళకి కనబడదు: ఈ మొగాళ్ళెప్పుడూ యింతే. మల్లెపువ్వులాగు ఏ కళంకము లేకుండా, నీకోసం ఆకాశం వైపు తపస్సుచేస్తూ కూచున్న శకుంతల కాళ్ళు కడుక్కోడానికి నీళ్ళియ్యడానికి పనికిరాదు నీకు' (పుట–99) అని చెప్పటచేత రాధాకృష్ణ శకుంతలతో కాపురంచేసి పిల్లలని కంటాడు. ఈ విధంగా శకుంతల వ్యవస్థ ద్వారా ప్రేమను పొందింది. శకుంతల సామాజికంగా ఫలితాన్ని సాధించిందనే చెప్పాలి. శకుంతల ప్రేమను ధర్మంగా భావించింది. వాంఛను

వ్యవస్థలోనే తీర్పుతుంది. అందుకోరకే శకుంతల జీవితంలో శాంతిని సాధించింది. పద్మావతి ఈ దృక్పథానికి వ్యతిరేకంగా వ్యవహరించింది. చలం ఈ స్త్రీల దృక్పథాలను గొప్పగా చిత్రించాడు. ఇద్దరి ఎడల పాఠకులకు సానుభూతి కలుగుతుంది. వీరి వలన సమాజానికి హెచ్చరిక మిగులుతుంది. శకుంతలకు వ్యవస్థలో ప్రేమ ఉంటే బాగుండేది అని అనిపిస్తుంది. పద్మావతికి ప్రేమ వ్యవస్థలో లభించి ఉంటే బాగుండేది అని అనిపిస్తుంది. చలం కోరేది గూడా అదే. ప్రేమలేని వ్యవస్థను సంస్కరించాలి. వ్యవస్థ లేకుండా ఉన్న ప్రేమను అరికట్టాలి; అని ఈ రెండు పాత్రలను దృష్టిలో ఉంచుకొని చలం హెచ్చరిస్తున్నట్లుగా భావించవచ్చును.

భార్య శకుంతలతో కాపురం పెట్టడానికి రాధాకృష్ణను ప్రోత్సహించటంలో గూడా పద్మావతి యొక్క అంతర్యం కొంత కుత్సితమైన లౌకిక లక్షణం కలిగి ఉన్నప్పటికీ క్రమంగా రాధాకృష్ణ శకుంతలతో సంసారం చేయడంవైపు సమాకర్షితుడై తనను వదలి అతడు బ్రతకాలి అన్న అభిప్రాయం ఆమెకు ఉన్నది. అందుకే ఆమె అతనితో స్నేహితురాలిలాగా వ్యవహరించింది. మలబారులో వీరి స్నేహితాన్ని ప్రేమగా భావించి న్యాయమూర్తి, రాధాకృష్ణను కోర్టు కీడ్చి నాశనం చేద్దామనుకుంటాడు. స్త్రీ–పురుషులు అందులో ప్రియసీప్రియులు స్నేహితులలాగా వ్యవహరించారని, వారు తప్పు చేయలేదన్నా, ఆ స్త్రీ భర్త నమ్మలేడు. స్త్రీ–పురుషుల స్నేహం చాలా మన్నితమైంది. దానిని ఎటువంటి అపార్థాలకు తావు ఇవ్వకుండా కాపాడుకోవాలని చలం ఆశయం. ఆమెకు ప్రతిష్ఠా స్పృహ ఉండటంచేతనే ఆమె తనను న్యాయమూర్తి వదలివేయడంగాని, రాధాకృష్ణ మీద కేసు నడిపించడంగాని రెండూ కూడా ఆమెకు ఇష్టంలేక పోయినవి. వ్యవస్థాధర్మంలో భద్రత ఉండటంచేతనే న్యాయమూర్తిని వదలివేయలేదు. తనవల్ల శకుంతల రాధాకృష్ణల కాపురం భంగపడకూడదు. రాధాకృష్ణ మీద కేసు నడిపిస్తే అది అందరికీ అప్రతిష్ఠే. న్యాయమూర్తి కేసు నుండి రాధాకృష్ణను తప్పించడానికి ఆమె తన ఆత్మహత్యే మార్గమని భావించి మృత్యువు పాలైంది. ఈమె ఉద్దేశ్యంలో వ్యవస్థలో స్త్రీ–పురుషులు ఆ విధంగా జీవించడం గౌరవప్రదం, నాగరికం కాదు. ఈ విధంగా ఈ పాత్రను విషాదాంతం చేయటం వల్ల ప్రేమలేని వివాహాలు, బాల్య వివాహాలు సమాజంలో ఎటువంటి విపరీత పరిణామాలకు దారితీసి స్త్రీ–పురుషుల్ని కల్లోలానికి గురిచేస్తాయో తెలియచేయడానికి చలం ఈ నవలను వ్రాసాడు.

సామాజిక చైతన్యం

చనిపోయిన పద్మావతిని చూసి రాధాకృష్ణతో న్యాయమూర్తి చివరికి అన్న మాటలు అతని ఆవేదననుస్ఫురింపచేసి అతని వ్యక్తిత్వాన్నిచాటుతున్నాయి. 'మనిద్దరం-కలిసి-చంపాము-ఇద్దరం-ముక్కల క్రింద చీల్చుకున్నాము'. (పుట-124) ఈ మాటలకు రాధాకృష్ణ ఏదో సమాధానం చెప్పినట్లు మాట్లాడగా 'ఇప్పుడెందుకు? యింకెందుకు? ఏమైతేనేం? యింకేమైతేనేం?' (పుట-124) అని అన్నాడు. ఈ అనడం 'పాపం చాల విచారంతో' అన్నాడని రాధాకృష్ణ అనడం గమనింపదగింది. ఇక్కడ న్యాయమూర్తి 'వ్యవస్థ', రాధాకృష్ణ 'ప్రేమ'. పద్మావతి 'వాంఛ' లకు ప్రతీకలు. వ్యవస్థ, ప్రేమలు ఒకే స్త్రీ-పురుషులమధ్య ఉండటంచేతనే శాంతి సుఖాలుండి సమాజ రచన జరుగుతుందని, వాంఛ, ప్రేమతోకూడి వ్యవస్థాబద్ధమైనవుడే సమాజం వికాసం చెందుతుందనీ చలం ఈ నవల ద్వారా చెప్పదలచాడు. న్యాయమూర్తి చేత పై మాటలను పలికించిన చలం కేసును విచారించి తీర్పు చెప్పినట్లు ఉండడంచేత అతని పేరు 'న్యాయమూర్తి' అన్నది సార్థకమవుతున్నది.

ఈ నవలకు పెట్టిన పేరు 'దైవమిచ్చిన భార్య'. ఎవరికి దైవమిచ్చిన భార్య అన్నది విచారించాలి. వివాహ వ్యవస్థాధర్మంచేత పద్మావతి న్యాయమూర్తి భార్య. ప్రేమ ధర్మంచేత రాధాకృష్ణ భార్య. వివాహానికి దైవభావన అయిన ప్రేమ ప్రాతిపదికయై ఉండాలి. దైవమంటే ప్రేమ. ఇక్కడ చలం సమాజాన్ని ఈ విధంగా ప్రశ్నిస్తున్నాడు మీకు దైవమున్నాడు. దైవమంటే మీకేమిటో తెలియదు. ఆ దైవాన్ని మరచి సమాజం యొక్క ఉత్తరోత్తరాభివృద్ధికి దోహదంచేసే వివాహ వ్యవస్థను నడిపిస్తున్నారు. సమాజం దైవంయొక్క ప్రేరణచేత అభ్యుదయ మార్గాన ఉన్నతిని పొందాలంటే సమాజం యొక్క ఉత్పత్తి హేతువులైన స్త్రీ-పురుషులకు వివాహంలో దైవబలం ఎక్కువగా ఉండాలి. దైవబలం అంటే ప్రేమ బలం. అది స్త్రీ-పురుషుల్లో అన్యోన్యాశ్రియంగా, దానంతటది పుట్టి అభివృద్ధి కావాలి. స్త్రీ-పురుషుల వివాహాలు స్వర్గంలోనే చేయబడుతున్నవనటం వారి ప్రేమైక్య భావంవారి భావలోకంలో స్థిరపడి సమాజంలో రూపింపబడటంచే సమాజం పురోగమిస్తున్నదని చెప్పటం. కాబట్టి ప్రేమ వివాహం అన్యోన్యాశ్రియంగా ఉండాలి. పద్మావతిని రాధాకృష్ణ తనకు దైవమిచ్చిన భార్య అని అనుకొన్నాడు. 'భార్య' వ్యవస్థకు సంబంధించిన పదం. కాబట్టి రాధాకృష్ణకు పద్మావతి దైవమిచ్చిన ప్రియురాలైనది. న్యాయమూర్తి విషయంలో పద్మావతికి ప్రేమ

లేదు. కాబట్టి అతనికి దైవమిచ్చిన భార్య కాలేకపోయింది. పద్మావతి రాధాకృష్ణనుగాని, న్యాయమూర్తినిగాని దైవమిచ్చిన భర్తగా భావించలేదు. వివాహం లేకుండానే రాధాకృష్ణ పద్మావతిని దైవమిచ్చిన భార్య అని భావించి ప్రవర్తించటంచేతనే అనేక ఇబ్బందులను ఎదుర్కొనాల్సి వచ్చింది. అందుకొరకే అతడు పద్మావతిని కోల్పోయాడు. వివాహం లేకుండా 'దైవమిచ్చిన భార్య' అని అనుకొనటంలో రాధాకృష్ణకు సామాజిక స్పృహ లేదని చలం స్ఫురింపచేస్తున్నాడు. స్త్రీ యెడల సామాజిక స్పృహాలక్షణం ఒక్క వివాహ వ్యవస్థకు మాత్రమే ఉంది అన్న జ్ఞానం కలిగింది కాబట్టే పద్మావతి చలం స్త్రీ పాత్రలలో అన్నిటికంటె తెలివిగలది. ప్రేమలేని వ్యవస్థలో వాంఛకధీనురాలై ఒకసారి పరపురుషునితో శారీరిక సంబంధం ఏర్పడితే అదెన్ని ఈర్ష్యలకు గురిచేసి వ్యవస్థను భంగం చేయటానికి ప్రయత్నిస్తుందో పద్మావతి అర్థం చేసికొంది.

ఈ విధంగా పద్మావతి వివాహ వ్యవస్థకు నోచుకోని ప్రేమకు, ప్రేమలేని వివాహ వ్యవస్థకు మధ్యలో చిక్కుకొని నశించిన స్త్రీ. స్త్రీకి సమాజంలో వివాహం అన్న రక్షకవచం కావాలి. వివాహం లేకుండా కేవలం ప్రేమచేతనే స్త్రీ—పురుషులలో సామాజిక బాధ్యత రూపింపబడదు. అయితే నేటి సమాజంలో స్త్రీ—పురుషులు తమ ప్రవృత్తుల లక్షణం గుర్తించే జ్ఞానం, ఆర్థిక స్వావలంబనం, ప్రేమ లక్షణం కలిగి ఉన్నప్పుడు మాత్రమే వ్యవస్థలో ఇమిడిపోయి సామాజిక బాధ్యతలను నెరవేర్చగలరు. అప్పుడే వివాహం సార్థకమవుతుంది. పైవన్నీ ఉండీ వివాహం లేకపోతే సమాజం నడవదా అనేదిగూడా ప్రశ్నయే. అదో ఆదర్శమేగాని సమాజంలో ఆచరణలో కష్టం. ప్రేమలేని వివాహాలకన్న, వివాహంలేని ప్రేమ తెచ్చిపెట్టే సమస్యలు హెచ్చు. అయితే చలం ప్రేమలేని వివాహాల సమస్యలనే స్పృశిస్తూ, వివాహంలేని ప్రేమవలన కలుగే అనర్థాలను స్ఫురింపచేసాడు. వివాహ వ్యవస్థను ప్రేమభావంతో సంస్కరించకపోతే అరాచకం తప్పదని చలం హెచ్చరిక.

---

అ ధో జ్ఞా పి క లు :

1. 'ఆ కాలంలో నేను, నేను బతకడం ఇష్టంలేని ప్రజలమీద దండెత్తి self assert చేసుకోవడమే ప్రధానంగా వుండేది. ప్రజలకు ఎంత కోపం తెప్పిస్తే నాకు

అంత సంతోషం. నన్నెదిరించే వాళ్ళని అదరగొట్టడానికి ఎంత తీవ్రమైన మాటలూ శక్తిహీనంగా తోచేవి. అందువల్లనే ఆనాటి పుస్తకాల నిండా, అతిశయోక్తులూ one sided statements ద్వేషంతో కూడిన తిట్లూ అనవసర శృంగారమూ వుండేవి.'

—స్త్రీ—('మళ్లీ ఈనాడు'—తేది 21–12–40)—పుట—8.

2. 'వివాహ వ్యవస్థ రద్దును వాంఛించడం లేదా చలం? వాంఛిస్తున్నాడు.'

—డా. నిమ్మగడ్డ వెంకటేశ్వరరావు—'స్త్రీ సమాజంపట్ల చలం దృష్టి—నిశిత పరిశీలన'—ప్రసారిత—త్రైమాసిక పత్రిక—జనవరి—మార్చి 1976—పుట—37.

3. 'ఈ సామాజిక సమస్యల్లో అంతర్భాగమే స్త్రీ—పురుష జీవిత సంబంధాలు. ఇవి వ్యక్తిగతం కావు. సామాజికమే. స్త్రీ—పురుష జీవిత సంబంధాల్లో అంతర్భాగమే వారి కామ సంబంధాలు. అంటే అనేక సామాజిక సమస్యల్లో స్త్రీ పురుష కామ సంబంధాలు ఒక స్వల్పభాగం మాత్రమే ఆక్రమిస్తున్నాయి. అయినప్పుడు ఏ పరిస్థితుల్లోనూ, స్త్రీ—పురుష కామ సంబంధాలే సర్వ సంబంధాలుగా చిత్రించబూనుకోవడం అవాస్తవికం.'

—డా. నిమ్మగడ్డ వెంకటేశ్వరరావు—పై పత్రిక—పుట—1.

4. 'చలం సాహిత్యమంతా పరిశీలిస్తే కొట్టవచ్చినట్లు కనిపించే విషయం ఆయన స్వీకరించిన కథా వస్తువు, దానిని చిత్రించిన విధానం, తరతరాలుగా మగవాడు చూపుతున్న ఆధిక్యత, వాడి అహంకారం క్రింద నలిగిపోతున్న స్త్రీ జాతి ఉద్ధరణ. ఇదీ చలం సాహిత్య సంక్షిప్త స్వరూపం.'

—మొదలి నాగభూషణశర్మ—తెలుగు నవలా వికాసం—పుట—304.

5. 'తన రచనల ద్వార స్త్రీ—పురుషులలో విప్లవ భావములను, తిరుగుబాటు తత్వమును ప్రచారంచేసి సాహిత్యంలో గొప్ప భావవిప్లవములను రేకెత్తించెను.'

—పుల్లాభొట్ల వెంకటేశ్వర్లు—తెలుగు నవలా సాహిత్య వికాసం—పుటలు—135–136.

6. 'దైవమిచ్చిన భార్యలో చలంగారు సమాజం నుండి, సాంప్రదాయం నుండి, పురుషుని ఆధిక్యత నుండి స్వతంత్రింగా బ్రతకాలనుకున్న స్త్రీని సమాజం, సాంప్రదాయం, పురుషులు ఎలా లొంగదీస్తారో చూపిస్తాడు. ఈ నవలలో ఇద్దరు స్త్రీ–పురుషులు సాంప్రదాయ సిద్ధమైన వివాహానికి ఎదురు తిరిగి స్వతంత్రింగా జీవిస్తారు. అలా కొంతకాలం సాంప్రదాయం అనే ప్రవాహానికి ఎదురీదుతారు. ఆ స్వేచ్ఛలో గొప్ప ప్రేమను అనుభవిస్తారు. కాని చివరకు సాంప్రదాయమే గెలుస్తుంది.'

–నవీన్–చలం నవలలు (వ్యాసం)–సృజన–మే–1968–పుట–59.

7. 'మొత్తానికి–ఈ నవలలో సంఘంలోని సాంప్రదాయికమైన విలువలను ఇంకా విడిచిపెట్టలేని చలమే కనిపిస్తాడు.'

–మొదలి నాగభూషణశర్మ–తెలుగు నవలా వికాసం–పుట–313.

—X—

# 3. అమీనా: కథ

రచయిత ఉపాధ్యాయ వృత్తిలో జీవితాన్ని కొనసాగిస్తూ మొండి గోడల మధ్య ఒక ఇంట్లో నివసిస్తూంటాడు. స్త్రీ–పురుషుల మధ్య లైంగిక విషయాలలో స్వేచ్ఛా ప్రవృత్తి విధానాన్ని అనుసరించాలని ప్రచారంచేస్తూ ఒక సంఘాన్ని కూడా స్థాపించాలనుకుంటాడు. అందుకు అనుకూలురైన అతని మిత్రులు రామ్మూర్తి, తాత, శర్మ–లు కూడా ఆ ఇంట్లోనే నివసిస్తూంటారు. ఎంకి పాటల రచయిత నండూరి సుబ్బారావు కూడా అక్కడికి వస్తూంటాడు.

సత్య అనే ఆమె శర్మను ప్రేమించి అతని కోసం తన భర్తకు చెప్పకుండా రచయిత ఇంటికే వచ్చి ఉంటుంది. 'జీవం' రచయితతోపాటు ఇంట్లో ఉంటున్నది. 'రవణ' కూడా రచయితతో ప్రేమగా ఉంటూ వీరిచుట్టు తిరుగుతూంటూంది. రామ్మూర్తి అరవ కన్యతో సరసాలాడుతుంటాడు. సుబ్బారావును ఏటిఒడ్డున కలువడానికి వెళ్ళినపుడు రచయితకు 'అమీనా'తో పరిచయమౌతుంది. ఆమె నాజూకతనం, మొండితనం, స్నేహ లక్షణం రచయితలో మోహాన్ని కలిగించింది.

ఇలా పెండ్లి అయిన స్త్రీలను, పెండ్లికాని కన్యలను ఆకర్షించి మోహ విద్య నేర్పడమే తమ ధర్మమని వారంతా భావించారు. అమీనా కూడా రచయిత ప్రేమ కొరకు వస్తూంటుంది. అమీనా పాటలు పాడుతూ టీ–ని అందిస్తూంటే అందరు ఆప్యా యంగా ఆమెను పలుకరిస్తూంటారు. కాని అమీనా రాక జీవంలో మాత్రం జెలసీని కలుగజేసింది.

శ్రీమన్నారాయణ విమలను వీళ్ళ పేరుమీద ఇంటికి ఆహ్వానించి, వీళ్ళందరు సాయంకాలం పట్టాభి అనే మిత్రుని గ్రామానికి వెళ్ళినపుడు రచయిత గదిలో ఆమెను అనుభవించాడు. జీవం అల్లరిచేస్తే రచయిత రేన్‌కోటు వేసికొని, తప్పించుకొని అపవాదు రచయిత మీదికి వచ్చేలా ప్రవర్తించాడు. పైకి నీతిమంతుడుగా కనిపిస్తూ

అమీనా– దేశి ప్రచురణ–1955.

పిరికితనంతో, దొంగతనంగా ఆమెను అనుభవించిన శ్రీమన్నారాయణే ఆమెను పెళ్ళి చేసికొనక చివరకు మృత్యువుపాలు చేసాడు. రచయితకు విమల మీద సానుభూతి, శ్రీమన్నారాయణుని కుహనా ప్రవృత్తి మీద కోపం. రచయిత సానుభూతిచే విమలకు స్నేహ హస్తం చాచినా అందుకోలేదు.

అమీనా నౌకరికి ఉంటానంది. రచయిత సరేనన్నాడు. అమీనా తల్లివచ్చి జీతం ఎంత ఇస్తారని అడిగింది. డబ్బుతో ప్రేమను కొనదలచుకోలేని రచయిత తిరస్కరించాడు. అంతటితో అమీనాతో సంబంధం సమాప్తమనుకుంటాడు. కాని అమీనా వచ్చి రచయితకు సేవలు చేస్తూంటుంది. రచయిత స్నేహితురాలు డాక్టరు రావడంతో అమీనా వెళ్ళిపోయింది. శ్యామల నుండి ఆహ్వానం అందగానే అమీనాను వదలి రచయిత మిత్రులతో ఆమె దగ్గరికి వెళతాడు.

శ్యామలను రచయిత మోహించాడు. ఆమె కూడా రచయితను అభిమానిస్తుంది. శ్యామలను అతడు కోరతాడు. ఆమె తిరస్కరించదుగాని అనుగ్రహించదు. అప్పుడు అమీనా జ్ఞాపకానికి వచ్చి, ఆమెను వదలివచ్చినందులకు తగిన శాస్తి జరిగిందనుకొని బాధ పడ్డాడు. శర్మ, శ్యామల మోహంలో పడ్డాడు. శర్మ చేస్తున్న ఈ పనికి భర్తనువదలి మోహంతో అతని కొరకు వచ్చిన సత్య బాధపడింది. దుఃఖించింది. రచయిత ఆమెను శర్మ తప్పకుండా వస్తాడని ఓదార్చాడు. శర్మ, శ్యామలను మోహించటం రచయితలో జెలసీని కలుగచేసింది. శ్యామల తన నుండి బలిసే కోరిందని బాధపడ్డాడు. సత్య మోహాన్ని తీర్చడానికి రచయిత సిద్ధమేగాని, ఆమెకు శర్మ మీదనే మోహం. సత్య తన స్నేహ హస్తాన్ని జారవిడుచుకున్నందులకు గూడా బాధ పడ్డాడు. స్త్రీ తనను స్వేచ్ఛగా ప్రేమిస్తే, స్వేచ్ఛను అభినందిస్తాడు. లేకుంటే ఆ స్వేచ్ఛనే నిందిస్తాడు. ఈ చంచలమైన మోహంలో నాశనమయ్యేవారే చాలమంది అని భావించి శ్యామల దగ్గర భంగపడి అమీనాను చేరాడు, రచయిత. శ్యామల కూడా అతని ఇంటికి చేరింది.

రచయిత ఇంట్లో అందరూ అమీనాచుట్టు తిరగడంవల్ల శ్యామలలో జెలసీ ప్రారంభమైంది. అమీనా రావడానికి వీలులేదని, అమీనా ఉంటే తనను ఎందుకు తీసికొని వచ్చారని అంది. బలంగా మోహంతో శ్యామల ఒకవైపు, ప్రేమతో పిల్ల అమీనా మరొకవైపు రచయితను ఆకర్షించారు.

సామాజిక చైతన్యం

అమీనా శ్యామలతో కలిసిఉంది. రామ్మూర్తి, తాత, శ్యామల కలిసి అమీనా జుట్టును సంస్కరించారు. అమీనా రచయితనుతప్ప మరెవ్వరిని ప్రేమించలేదు.

అమీనాను వదలి అందరూ పోతరాజు ఇంటికి విందుకు వెళ్ళారు. అక్కడ శ్యామల రచయితను బాగా ఆకర్షిస్తుంది. కాని చిక్కదు. అప్పుడు రచయితకు అమీనా జ్ఞాపకానికి వస్తుంది. అమీనా రచయిత చుట్టు తిరుగుతూంటే; రచయిత శ్యామల చుట్టు తిరుగుతూంటాడు. అమీనా దుఃఖించింది. రచయితలో పశ్చాత్తాపం కలిగింది హృదయం లేని శ్యామల దగ్గరికి వచ్చినందులకు బాధ పడ్డాడు. అమీనా రచయితతో శ్యామలను వెళ్ళగొట్టుమని చెప్పింది.

రచయిత భార్య సుబ్బులు. ఆమె ఒకనాడు ఇంటికివచ్చి అమీనాను వెళ్ళగొట్టింది. అమీనా కొరకు రచయిత వెదికాడు. ఆమెను రమ్మంటే రానంది. తరువాత అమీనాకు ముసలివానితో పెళ్ళైంది. అమీనా రచయితను చీరె కొనిపెట్టమని అడిగింది. కాని కొనిపెట్టలేదు జీతం ఇవ్వమని అడిగింది. అతడు ఇచ్చిన జీతపు డబ్బులతో రెండు గజాల గుడ్డ మాత్రమే వచ్చిందని చెప్పింది. ఆ గుడ్డ సరిపోదనిచెప్పి వెళ్ళిపోయింది. రచయిత ఆమె కొరకు వెదికాడు. కాని లభించలేదు. ఇక అమీనా తనకీ జన్మకు అఖరనుకున్నాడు. తన లాభనష్టాల గుణితమే అమీనాను దూరం చేసిందని బాధపడి రచయిత భార్య సుబ్బులుతో కాపురం చేయసాగాడు.

అమీనా చలం మూడవ నవల. రచనాకాలం 1924; 1942.



# అమీనా: విషయ విచారణ

చలంగారి మూడవ నవల 'అమీనా'. ఇందులో కథ నాలుగు భాగాలు. మొదటి రెండు భాగాలు 1924లోను, మిగిలిన రెండు భాగాలు 1942లోను వ్రాయ బడినవి. కథా విషయంలో ఐక్యతఉన్నా: రచనా శిల్పంలో పూర్వార్ధంకంటె ఉత్తరార్ధంలో క్రొత్త సంవిధానం కనబడుతుంది. మొదటి రెండు భాగాలలో స్వల్పంగానూ, చివరి రెండు భాగాలలో అధికంగానూ చైతన్య స్రవంతీ రచనా శిల్పాన్ని చలం ఇందులో అనుసరించినట్లు కన్పిస్తుంది.

పాశ్చాత్య సాహిత్య రంగంలో రొమాంటిసిజం (Romanticism), నేచు రలిజం (Naturalism), రియలిజం (Realism)- మొదలైన ఇజాల ప్రభావంతో సృష్టింపబడిన సాహిత్యంలో మనస్తత్వ విశ్లేషణ కనిపించదు. అవి మనిషి అంత రంగాన్ని స్పృశించలేదు. ఆ పనిని ఆ తరువాత వర్జీనియా వుల్ఫ్, జేమ్స్ జాయిస్ మొదలైన మనో విశ్లేషణ నవలాకారులు చేసారు. ఇంగ్లీషులో మొదటి, రెండవ ప్రపంచ యుద్ధాల మధ్య కాలంలో మనో విశ్లేషణ సిద్ధాంతాలతో నవలలు వచ్చాయి. ఫ్రాయిడ్ మనోవిశ్లేషణ (Psycho-analysis) సిద్ధాంతం ఇందుకు బాగా ఉపకరిం చింది. సెక్స్ విషయాలలో, తల్లిదండ్రుల విషయంలో హేతుబద్ధంకాని భావాలు మనిషిలో ఉంటాయి. అవి తర్కానికి లొంగవు. మనిషిలోని ఇడ్ (Id) ప్రవృత్తి నిర్హేతుక ప్రవర్తనకు సంబంధించింది. 'Ego' అను ప్రవృత్తి తార్కిక, హేతుబద్ధ మైన ప్రవర్తనకు సంబంధించింది. 'Super Ego' అనేది తండ్రిలాగా మనిషి ప్రవర్తనను దిద్దుతూంటుంది. ఇవి మానవునిచేతన (conscious); అవచేతన (Un Conscious); ఉపచేతన (Sub Conscious)లలో ఆలోచనలను రేకెత్తి స్తుంటాయి. మానవునిలో ఉన్న ఇటువంటి ఆలోచనలు బయటికి వెలువడేట్లుగా చేయ డానికి చైతన్య స్రవంతి కళారూపం (Stream of consciousness technic) ప్రయత్నించింది. ఈ కళారూపం ద్వారా మానవుని మనోగోళంలో ఉన్న రకరకాల భావాలను వ్యక్తం చేయవచ్చు. ఇందులో కథ అప్రధానం. అంతరంగిక భావావిష్కరణ మొక్కటే ఇందులో ముఖ్యం.1

సామాజిక చైతన్యం

చలం ఈ నవలలో మానవ సహజాతాలను ముఖ్యంగా సెక్స్ విషయాలను చైతన్యస్రవంతి కళారూపంలో చూపాడు. ఇందులో రొమాంటిక్ దృక్పథం ఉంది సెక్స్ విషయాల్లో వ్యక్తివాద, అస్తిత్వవాదాల (Individualism, Existentionalism) ప్రభావం చలం ఈ నవలలో చూపాడు. ఈ నవలా రచననాటికి తెలుగు సాహిత్యంలో ఈ కళారూపం నూతనమే. ఈ రూపానికి చలమే ఆద్యుడని చెప్పవచ్చుననిపిస్తున్నది.[2] ఈ నవలలో కథ అస్పష్టంగా ఉంటుంది మార్మిక వచన కవితా ధోరణి. చైతన్య స్రవంతి కళారూపం నవల చివరి రెండు భాగాలలో కనబడుతుంది.

రచయిత తన మనస్సులోని భావాలను, సహజాతపరమైన విషయలోల త్వాన్ని, చంచలత్వాన్ని మోహ విషయాలలో సహజంగా, ఉద్వేగంతో చెప్పటానికి ప్రయత్నించి కృతకృత్యుడైనాడు. ఇందులో రచయిత గూడా ఒక ప్రధాన పాత్ర. అందుకే కథనం ఉత్తమ పురుషలో సాగుతుంది. అయితే రచయిత నిత్య జీవితంలోని వ్యక్తిత్వానికి, రచనలోని వ్యక్తిత్వానికి అభేదం పాటించడం సమంజసంగాదు. అందు వల్ల ఇది అంతా రచయిత ఆత్మకథ అనడం సమర్థనీయంగాదు.[3] రచయిత తన లక్ష్యాలలో ఒకానొక లక్ష్యాన్ని తన పాత్రను ఒక ప్రతీకగా ప్రవేశపెట్టి రచన సాగించటం ఒక రచనా కళావిశేషం. విషయాన్ని వ్యాఖ్యానించడానికి ఈ కళారూపం బాగా ఉప యోగపడుతుంది. ప్రధానపాత్ర అయిన రచయితా. మిగతా కొన్ని పాత్రలూ సమాజంలో నుండి యధాతథంగా గ్రహించబడ్డాయి. అయినా అవి రచయిత మనోగోళం నుండి పరావర్తనం చెందినవే[4] అవి రచయిత సృష్టించినవే. కాబట్టి రచయిత గూడా ఒక పాత్రయే. ఇట్టి ప్రధాన పాత్రను 'రచయిత' అని ఈ విచారణలో పేర్కొంటున్నాను.

## ర చ యి త - అ మీ నా

చలం ఈ నవలలో పురుషునికి కామ, మోహ, ప్రేమ విషయాలలో ఉండే సహజాతాలను వివిధ పాత్రల ద్వారా చూపాడు. సెక్స్ విషయంలో పురుషుని స్వేచ్ఛా ప్రవృత్తి 'రచయిత' పాత్ర ద్వారా చూపాడు. సంఘంలో జరుగుతున్న ప్రేమలేని వివాహాలు, వివాహాల పేరు మీద స్త్రీకి జరుగుతున్న అన్యాయాల్ని, నీతులను వల్లించి వక్రంగా నడిచే పురుష వృత్తిని చలం ఈ నవలలో ప్రదర్శించాడు.[5]

వివాహ వ్యవస్థలో స్త్రీ–పురుషుల మధ్య సహజమైన దాంపత్య ధర్మం కొనసాగటంలేదని రచయిత విశ్వాసం. వ్యవస్థలో భార్యలు ప్రేమవల్లగాక వివాహబంధం వల్లనే పతివ్రతలుగా చెలామణి అవుతున్నారనీ; ప్రేమ లేకుండా ఇష్టంలేని భర్తతో కాపురం చేయడం పతివ్రతా ధర్మంకాదనీ; ఇష్టమున్న పురుషునితో సంచరించినవారే అలాంటి పతివ్రతలకన్న నయమని రచయిత విశ్వాసం. అందుకే రవణతో 'రవణా! నువ్వు సంసారివి కావని మేము తృణీకరిస్తామేమోనని భయపడి, యెన్నాళ్ళు మా పవిత్ర ధూళినించి తప్పుకున్నావుగావు! ఈ భార్యలందరూ నీ అంత పతివ్రతలైతే ఈ సంఘమిట్లా యెందుకు పుచ్చుతుంది'. (పుట–8) అని సంఘంలోని లోపాన్ని రచయిత విరసిస్తున్నాడు.

రచయితలో సెక్స్ విషయంలో స్వేచ్ఛాప్రవృత్తి ఉంది. అందులో మోహం సహజాతాల తీవ్రత కూడా ఉన్నాయి. తత్ఫలితంగా వ్యవస్థలో భంగపడ్డాడు. సత్యా రచయితల భంగపాటు నవలలో తెల్పబడింది. అటువంటి విచిత్ర మానసిక పరిస్థితి వైఫల్యాన్ని మిగతా పాత్రల విషయంలో గూడా ఊహించుకోవచ్చు.

ఈ నవలలో స్త్రీ–పురుష ప్రవృత్తుల సహజాతాలు స్వేచ్ఛా ప్రణయం వైపు ప్రయాణం చేసినపుడు ఏర్పడే మానసిక పరిస్థితులను జెలసీలను చలం స్ఫుటంగా విశదీకరించారు.

రచయితకు సుబ్బులు అనే భార్య ఉంది. ఈమె ఎడల అతనికి ప్రేమా లేదు, మోహమూ లేదు సహజంగా ఈ రచయిత చంచలత్వం కలిగినవాడు. చంచలత్వాన్ని అరికట్టే పరిస్థితి అతనికి వివాహ వ్యవస్థలో కలిసి రాలేదు. అందుచే అనేక స్త్రీలవైపు ఆకర్షితుడైనాడు జీవం, రవణ, శ్యామల, సత్య, అమీనా మొదలైన స్త్రీలను ఆకర్షించడానికి ప్రయత్నించాడు.

మొండిగోడల మధ్యనున్న రచయిత ఇంట్లో రామ్మూర్తి, తాత, శర్మకొరకు వచ్చిన సత్య ఉన్నారు. రచయిత రవణ అనే అమ్మాయిని ఆకర్షించాడు. రవణ సత్యను చూసి రచయిత భార్యఅని జెలసీకి గురైంది. రచయిత ఆమెను నమ్మించలేకపోయాడు. జీవం అనే అమ్మాయి కూడా రచయితను ప్రేమించింది. అందుకే అతని స్వేచ్ఛా ప్రణయపు అల్లరిని సహించింది. ఆమెకు ఆ అల్లరి పనులంటే ఇష్టంలేదు. అతనిని

ప్రేమించింది. అతనిలోని చంచల ప్రవృత్తిని ప్రేమించలేదు. తత్ఫలితంగా రచయితతో వియోగమే కలిగింది. రచయిత స్వేచ్ఛా ప్రణయం జీవం—రవణలను భంగపెట్టింది.

తరువాత రచయిత అమీనాను ప్రేమించాడు. సత్యతో రచయితకు శారీరిక సంబంధంలేకున్నా రవణ ఎలా అనుమానపడిందో, అదేవిధంగా అమీనా కూడా సత్యను చూసి అనుమానపడింది రచయిత స్త్రీలతోచేసే స్నేహాలు, మోహంలో అతని నాజూకుతనం, వ్యవస్థను వ్యతిరేకించేతత్వం అతని స్వేచ్ఛాభావం నుండి పుట్టినవి అతని పనులు ఊహాతీతంగా, అసంబద్ధంగా ఉన్నవి. రచయిత వ్యక్తివాది. స్వేచ్ఛావాది; అందులో ముఖ్యంగా అస్తిత్వవాది. ఈ పాత్రల ద్వారా చలం అస్తిత్వవాదాన్ని సెక్స్ విషయంలో అన్వయించి ప్రదర్శిస్తున్నట్లనిపిస్తుంది

ప్రపంచంలోని యాంత్రిక సూత్రాలకు లోబడి మానవ ప్రవృత్తిని తెలిపే 'నేచురలిజా'న్నీ హేతుబద్ధంగా మానవునికి ప్రాముఖ్యాన్నిచ్చే 'ఐడియలిజా'న్నీ కాదని ఈ అస్తిత్వవాదం ప్రచారంలోకి వచ్చింది ప్రకృతిలో హేతువుకు అందని ధర్మాన్నీ, వ్యక్తిలో హేతువుకు అందని ప్రవృత్తిని ఈ అస్తిత్వవాదం గ్రహిస్తుంది ఇందులో సంఘ వ్యతిరేకత, కార్యకారణ భావశూన్యత చోటు చేసుకుంటుంది.6 రచయిత పాత్రలో అస్తిత్వవాద లక్షణాలు గోచరిస్తాయి. ఇతడు కార్యకారణభావ శూన్యతను స్త్రీ ప్రవృత్తిలో చూస్తాడు అమినా, ఇంటికి వస్తాను అని అన్నప్పుడు; ఆమె ఎందుకు వస్తానన్నదో ఆమెకే తెలియదని 'తన సౌందర్యంవేపు దృష్టి నాకర్షించడానికి సృష్టి కల్పించుకొన్న ఋతు, దిన, కాంతి, వర్ణచాంచల్యముతో సమాన మీ చిత్తభ్రమ' (పుట—18) అని అమీనా అంతర్యాన్ని తానే వ్యాఖ్యానిస్తాడు. అమినా రచయితలోని చంచలత్వం, అస్థిరత్వం, అస్తిత్వం బయటపడటానికి కారణభూతురాలైంది. అంత మాత్రంచేత ఆమె రచయిత అంతఃకరణకు ప్రతీక అని అనడం సమంజసంగా తోచదు.7 ఎందుకంటె రచయితలో ఉన్న లక్షణాలు ఆమెలోలేవు. అమీనాలో స్వేచ్ఛా ప్రణయ సంబంధమైన లక్షణాలు లేవు రచయిత తన తాలూకు లక్షణాలైన మొండితనం, నాజూకైన స్నేహం ఆమెలో చూస్తాడు. తనలో అస్తిత్వవాద లక్షణాన్నిగూడా ఆమెలో చూస్తాడు. కాని తనలోని చంచల సహజాతాల ప్రకోపాలు ఆమెలో కనబడవు.

ఆపై లక్షణాలు శ్యామలలో గూడ అతనికి కనబడినవి. కాని రచయితలో మూల స్వభావాలైన చంచలత్వం, అస్థిరత్వం, వ్యక్తిస్వేచ్ఛ, అస్తిత్వవాద లక్షణాలు అమీనాలోగాని, ఇతర స్త్రీపాత్రలోగాని కానరావు

అమీనాను చూచినపుడల్లా రచయితకు 'ఆహ్లాదకరమైన ఉదయోత్సాహం', 'పన్నీరు పువ్వులో మార్దవమైన పరిమళం' జ్ఞాపకం వస్తుంది. రచయితకు స్త్రీ సౌందర్యం ఎడల రొమాంటిక్ దృక్పథం ఉంది. కాని ఆమెలో సాధారణమైన కోరికలు, జెలసీలుచూసి ఆమెను గూడా 'ముళ్ళకంపే' అని అనుకున్నాడు. రచయిత, జీవం, అమీనాలు విమలా శ్రీమన్నారాయణుల కుహనా రహస్య ప్రేమను ఏవగించుకున్నారు. రచయిత దృష్టిలో అది వ్యభిచారం 8 రచయిత తన ప్రేమను డబ్బుతో కొలువలేదు. అమీనాకు జీతం ఇయ్యటానికి అంగీకరించక మండిపడ్డాడు

రచయిత స్నేహితురాలు డాక్టరుగారు ఉన్నంతసేపు అమీనా రాలేదు. డాక్టర్‌గారికి అమీనాను రచయిత చూపెడతానంటే ఇష్టపడక వెళ్ళిపోయింది. అమీనా రహస్య ప్రేమనే వాంఛిస్తున్నట్లు తోస్తున్నది రచయిత ప్రవృత్తి ఎంత చంచలమంటే 'మోహనాటక లీలకి సూత్రధారి ఎప్పుడూ స్త్రీ' (పుట–35) అనే భావించాడు. అందుకే తాను స్త్రీల మోహ వలయంలో తిరుగుతున్నానని భావించాడు. తుదకు తనకు ఇటువంటి జీవితం తనకెలాంటి సంస్కారాన్ని ఇయ్యలేదని చెప్పాడు.'— ఒకర్నొకరు మరిచిపోవడమూ, కొత్త అనుభవాలకోసం మళ్ళీ ప్రయాణం కావడమూ, అవన్నీ కులాసాగా, ఏ సంస్కారాన్ని, బాధని, జ్ఞానాన్ని యివ్వకుండా దినాలకు తేలిక రంగులు వేస్తూ గడిచిపోయాయి' (పుట–36). అని తన స్వేచ్ఛా ప్రణయంవల్ల కలిగిన పరిణామాన్ని తెలిపాడు.

అమీనాను వదలి శ్యామల మోహంలో పడ్డాడు. కాని శ్యామల లభించలేదు. శ్యామల రచయితవలె చంచల ప్రవృత్తి కలిగినదికాదు. రచయిత శ్యామల మధ్యనున్న మోహాన్ని రచయిత బహిరంగపరచడానికి సుముఖుడు. కాని శ్యామలకు ఇష్టంలేదు. శ్యామల లభించకపోవడంతో అమీనావైపు తిరిగాడు. అమీనా కూడా లభించక పోవడం చేత అమీనా కూడా బలినే కోరిందని బాధ పడ్డాడు.

సామాజిక చైతన్యం

తాను మోహించే శ్యామలను, శర్మ మోహిస్తుంటే రచయితలో జెలసీ ఏర్ప డింది. శర్మను మోహించే సత్యను ఆహ్వానించి రచయిత భంగపడ్డాడు. సత్య రచయి తను తిరస్కరించింది రచయిత తన సుఖం కొరకు స్వేచ్ఛను ఆహ్వానిస్తాడు; లేకుంటే తిరస్కరిస్తాడు. 'నీతి బంధనాలు తెంచుకుని పావురం, నా మీద వాలితే స్వేచ్ఛకు జయ్. వాగ్దానబంధం తెంచుకొని, నానించి గంటలో, ఎగిరిపోతానంటే, పావురానికి రెక్కలుపెట్టిన వాడికి బుద్ధిలేదని పద్యాలు' (పుట–40). ఇలా సాగుతుంది అతని స్వేచ్ఛా పరిణయం శ్యామల, సత్య తనకు లభించనందువల్ల ప్రేమలోకంలో సుఖపడే వారు తక్కువ అనీ, నాశనమయ్యేవారే ఎక్కువ, అనే నిర్ణయానికి వచ్చాడు. తన చంచలత్వంచేత తనకు లభించని శ్యామల మీద కసి, ఆగ్రహం, ఇంకా ఆమె తనకు అన్యాయం చేసిందనీ, తనను మోసంచేసిందని కూడా బాధపడ్డాడు. అమీనా కనబడ కుండా పోయిందని స్త్రీ జాతిమీద జెలసి. ఈ విధంగా వివిధ మోహాకర్షణలలో జెలసీ లను, అశాంతిని రచయిత పొందాడు. స్వేచ్ఛాపరిణయం మహా భారమని వ్యవస్థలేనిదీ స్వేచ్ఛలేదనే సామాజికాంశం వైపుకు వచ్చాడు 'స్వేచ్ఛని ప్రేమించే మనిషికి ఎన్ని బంధనాలు! గట్లులేంది స్వేచ్ఛలేదు. సృతిలేంది సంగీతం లేదు దేనికి స్వేచ్ఛ–దేనికీ కాని స్వేచ్ఛ మహాభారం. ఇచ్ఛకీ స్వేచ్ఛకీ చాలా దూరం.' (పుట–63) అనే నిర్ణయా నికి వచ్చాడు.

రచయిత భార్య సుబ్బులు అమీనాను వెళ్ళగొట్టింది రచయిత ఆమెను కలిసి కొని రమ్మంటే రాదు. అమీనాకు ముసలివానితో పెళ్ళైంది. తాను వ్యవస్థకులోనై అమీనాను వదలుకొన్నాడు. తాను ప్రేమించిన అమీనా స్వేచ్ఛాపరిణయంలోనికి రాలేక పెళ్ళి చేసికొని వ్యవస్థలోనికి వెళ్ళిపోయింది

రచయిత పాత్రలో పురుషుని సహజాతపరమైన కోరికలనూ, వాటి భయంకర స్వరూపాలను చలం చూపాడు.9 ఇలా హద్దులేని స్వేచ్ఛాపరిణయంలో అశాంతిని పొందాడు. వ్యవస్థలో ప్రేమ, హద్దులు, బాధ్యతలు ఉంటేనే స్త్రీ–పురుషులు సుఖిస్తా రని చలం పరోక్షంగా ఈ నవలద్వారా ఇస్తున్న సందేశమని చెప్పవచ్చును.

## శ్రీమన్నారాయణ - విమల

రచయిత, అమీనా పాత్రల తరువాత చెప్పుకోతగినవి విమలా శ్రీమన్నారాయణుల పాత్రలు. ఈ జంటల ప్రవర్తన, మనస్తత్వం చాలా విలక్షణమైనటువంటివి. రచయిత స్వేచ్ఛా ప్రవృత్తికి శ్రీమన్నారాయణ వ్యతిరేకం పెళ్ళి కొరకు ప్రేమ అనే మనస్తత్వం కలిగిన విమల ప్రవృత్తికి నౌకరీ పేరు మీదనైనా ఉండనిస్తే చాలుననుకునే 'అమీనా' ప్రకృతి విరుద్ధం.

రచయిత, రామ్మూర్తి, శర్మల స్వేచ్ఛా ప్రణయ దృక్పధాన్ని శ్రీమన్నారాయణ సహించడు. రచయిత అమీనా వ్యవహారాన్ని, రామ్మూర్తి ఏలూరు వైష్ణవపిల్ల కధనెత్తుకొని 'సుఖంగా, నిర్మలంగా, కాపరం చేస్తున్న పిల్లల్ని యిట్లా ఆకర్షించి పది రోజులు పాడుచేసి మీదోవన మీరుపోతే వాళ్ళగతి యేమిటి'. (పుట—16) అని వారిని విమర్శించాడు. శ్రీమన్నారాయణ చెప్పిన మాటలు యధార్థాలైనప్పటికి అతని నిత్య జీవితంలోని కుహనా ప్రవర్తనవల్ల అతనికి విలువ తగ్గుతున్నది ప్రేమించి పెళ్లాడాలనుకున్న విమలను అనుభవించి, పెళ్లాడకుండా ఆమె గతికి ఆమెను వదిలేసాడు. అటువంటివాడు నీతిని, వ్యవస్థను గూర్చి మాట్లాడుతుంటే, తమ ప్రవర్తనను ఖండిస్తూంటే రచయిత అతనిని సహించలేక పోయాడు. అందుకే రచయిత ఇతని ప్రవర్తనవల్ల ఒక పాక్షిక దృక్పథాన్ని ఏర్పరచుకొన్నాడు. 'తిరిగి తిరిగి నాకు అనుభవంలో రూఢి అయింది. నీతిని గురించి ఉపన్యాసాలిచ్చేవాడు, ఇతరులలో దుర్నీతిని ఖండించేవాడూ, తప్పదు—రహస్యంగా—అతి నీచపు పనులు జరుపుతోవుండి తీరతాడని'. (పుట—17). విమల రచయితను ఎరగదని, అతనితో మాట్లాడడం తనకు ఇబ్బందిగా ఉంటుందని విమల చెప్పినట్లు శ్రీమన్నారాయణ రచయితతో చెప్పిన మాటలు గూడ అబద్ధమే. ఆ విధంగా విమల అన్నదంటే రచయిత నమ్మలేడు. అందుకే 'విమలా, సూన్రతం నీ కళ్ళల్లో తాండవిస్తో వుంటుంది. నీకంత చౌర్యం బోధించిందెవరూ? నీ ప్రేమా, నీ మత సంప్రదాయమా?' (పుట—23) అని రచయిత తనలో తాను విమలను పరామర్శించాడు. విమల భంగపడినపుడు రచయిత ఆమెను ఆహ్వానించాడు. కాని అతని ఆహ్వానాన్ని తిరస్కరించి మృత్యువుకు బలియైంది. ఈమె ఎడల రచయితకు సానుభూతి ఉంది. అందుకే 'పాపం, ఏం చేస్తావు: స్త్రీవి. క్రూరమైన యీ లోకంలో, అనాధవైన

స్త్రీవి. మిమ్మల్ని, మీ సూన్యతాన్ని, అదిమి, నాశనం చేశాం పురుషులం' (పుట–24) అని వాపోయాడు.

శ్రీమన్నారాయణ వ్యవస్థచాటున స్వేచ్ఛా ప్రణయాన్ని రహస్యంగా పొందా లనుకునేవాడు. విమల మనస్ఫూర్తిగా శ్రీమన్నారాయణతోపాటు వ్యవస్థను కూడా నమ్ముకుంది. కాని అతడు మోసగించినపుడు మరో వ్యక్తిని ప్రేమించి జీవించలేక పోయింది. వ్యవస్థను నమ్ముకున్న విమలవంటి స్త్రీలు పెళ్ళికి పూర్వం ప్రేమ కార్య కలాపాలు సాగించగూడదు. సాగిస్తే శ్రీమన్నారాయణునివంటి ప్రేమికులు తటస్థించి నపుడు భంగపడవలసి వస్తుందని చలం చెప్పదలచిన విషయం. ఇటువంటి ప్రేమ పురుషునికన్న స్త్రీనే ఎక్కువ బాధిస్తుందని కూడా చలం చెప్పదలచాడు.

## శర్మ – సత్య

రచయిత మిత్రుడు శర్మ. శర్మ గూడా రచయిత స్వేచ్ఛాప్రణయ సిద్ధాం తాన్ని ఆచరిస్తున్నవాడు. శర్మ కాలేజి లెక్చరర్. ఈ శర్మను మోహించి సత్య వచ్చింది. సత్య, రచయిత, రామ్మూర్తి వీళ్ళంతా 'అట్లా గోడల మధ్య తొంగిచూసే నక్షత్రాల కింద కుర్చీలూ, మంచమూ, మాట్చుకుంటో కబుర్లతో, నవ్వులతో, అప్పుడప్పుడు హృదయాలు తెరిచి–' (పుట–10) కాలం గడిపేవాళ్ళు: కాల్పనిక లోకంలో. రచయి తకు సత్యతో ఎలాంటి శారీరిక సంబంధంలేదు. అయినా ఆ విషయాన్నెవరూ నమ్మరు. సత్య భర్త అసలేనమ్మడని రచయిత విశ్వాసం. సత్య తననెంత మోహించినా, ఆమెను కాదని శర్మ శ్యామల ఆకర్షణకు లొంగి తిరుగసాగాడు. తన భర్త రమ్మని ఉత్తరాలు వ్రాసినా పోక సత్య శర్మకొరకు విరహ పడింది. తన మోహం తీరే మార్గంలేదు పైపెచ్చు శర్మ శ్యామల మోహంలో పడిపోయినందుకు కూడా సత్య బాధ పడింది. శ్యామలపై సత్యకు జెలసీ ఏర్పడింది సత్యను శర్మ వదలివేస్తాడని రచయితకు తెలుసు. శ్యామలవల్ల భంగపడిన రచయిత, శర్మవల్ల భంగపడిన సత్యకు స్నేహ హస్తాన్ని చాస్తాడు. మోహ విద్యలో 'ఆర్టిస్ట్'నని విర్రవీగే రచయితను సత్య తిరస్కరించింది. రచయిత స్వేచ్ఛాప్రణయ ప్రవృత్తికి అవకాశం లేకుండా పోయింది. శర్మ లభించక సత్య భంగపడింది. శ్యామల లభించక శర్మ భంగపడ్డాడు. ఈ నవలలో రచయితతప్ప మిగతా వ్యక్తులు ఒక్కొక్కరి విషయంలోనే మోహానికి గురిఐనారు. మోహ ప్రవృత్తి

స్వేచ్ఛాప్రణయంలో ఎంత అలజడిని కలిగించిందో చలం: సత్య, శర్మ పాత్రల ద్వారా చెప్పదలిచాడు. శ్యామల పాత్రద్వారా స్త్రీ మోహ జీవితం పురుషులను స్వేచ్ఛా ప్రణయంలో ఎలా అశాంతికి, జెలసీలకు గురిచేస్తుందో చలం చూపించాడు.

## రామ్మూర్తి - తాత

రామ్మూర్తి, తాత; ఈ ఇద్దరూ రచయిత స్వేచ్ఛాప్రణయ సిద్ధాంతానికి అనుకూలురు. రామ్మూర్తి రిజిస్ట్రారుగారి కన్యతో సరసాలు సాగించాడు. తాత కూడా తన యవ్వనంలో రాజమండ్రి ప్లీడర్ కన్యతో సరసాలు సాగించినవాడే. వీరు గూడా శ్రీమన్నారాయణకు వ్యతిరేకులే. వీళ్ళు ప్రధాన పాత్రలకు ఆసరాగా ఉన్నవాళ్ళేగానీ ప్రత్యేక వ్యక్తిత్వం కలిగిన వాళ్ళు కాదు

ఇలా చలం ఈ నవలలో మానవ సహజాతాలనూ, మోహ జీవితాలనూ తీవ్ర స్థాయిలో ప్రదర్శించి వ్యవస్థలో వ్యక్తులను ఎంత అలజడికి, జెలసీలకు గురిచేస్తాయో నిరూపించాడు.

---

### అధోజ్ఞాపికలు:

1. 'చైతన్య స్రవంతి విధానంలో పాత్రల బహిఃస్వరూపమేకాక, అంతఃస్వరూపం కూడా అవగతమవుతుంది. ఇందులో 'కథ'కు ఎక్కువ ప్రాధాన్యత వుండదు. పాత్రల ఆలోచనా సరళి—ఆలోచనా తరంగాలు—వీటిని విశ్లేషించడం జరుగుతుంది'.
—శ్రీ కోడూరి శ్రీరామమూర్తి—స్వాతంత్ర్యానంతర యుగంలో తెలుగునవల—చైతన్య స్రవంతి—భారతి—జూలై—1977—పుట—17.

2. 'చైతన్య స్రవంతి విధానం తెలుగులో మొదటి కథాసాహిత్యాన్ని పలకరించింది. చైతన్య స్రవంతి ధోరణిలో శ్రీ శ్రీ 1946లో 'కోనేటి రావు కథను' ప్రారంభించాడు.
—శ్రీ కోడూరి శ్రీరామమూర్తి—పై పత్రిక.

[వివరణ:— చలం అమీనా చివరి భాగాలు 1942 నాటికే పూర్తి చేసాడు. కాబట్టి శ్రీ శ్రీ కన్న పూర్వమే చైతన్య స్రవంతి కళారూపాన్ని చలం ఈ కథలో ఆవిష్కరించాడు. కాబట్టి చలమే ఆద్యుడు.]

3. 'అది రచయిత ఆత్మ కథ'

—ఆర్. యస్. సుదర్శనం—సాహిత్యంలో దృక్పథాలు—పుట—148.

4. వివరణ:— చలం మిత్రులు రామ్మూర్తి, నండూరి సుబ్బారావు ఈ నవలలో పాత్రలు. అమీనా కూడా చలం జీవితంలో తారసపడిన వ్యక్తియే. కథలో రచయిత మిత్రురాలైన డాక్టర్ ప్రస్తావన వస్తుంది. ఈమె చలంగారి వదినె డాక్టర్ రంగనాయకమ్మగా స్ఫురిస్తున్నది. ఈమెనే చలం తన ఆత్మకథలో 'వొయ్యి' అని ప్రస్తావించాడు. ఈమెతో చలం కొన్నాళ్ళు ప్రేమగా తిరిగాడు. రచయిత భార్య సుబ్బులు. చలం భార్య రంగనాయకమ్మకు ప్రతీకగా గ్రహించి ఉండవచ్చునని తోస్తుంది. చలం స్వేచ్ఛాప్రణయతత్వంలో చిక్కుకొన్నప్పుడు భార్య రంగనాయకమ్మ కూడా బాధపడింది. చలం రత్నమ్మ ప్రేమ వ్యవహారం భార్య రంగనాయకమ్మను క్రుంగదీసింది. అయితే విస్తార జీవనాంశాలతో కూడిన ఈ వ్యక్తుల జీవితాల నుండి చలం మోహ విషయాలలోని జెలసీలకు సంబంధించిన విషయాలను తన దృష్టిలో వివేచించాడు. కాబట్టి ఆ వ్యక్తులు యథాతథంగా నవలలో ఉండటానికి వీలులేదని గ్రహించాలి.

5. 'మనసుతో సంబంధంలేని వివాహములు—వివాహముల పేరిట జరుగుచున్న వ్యభిచారము, విజాయితీ లోపించిన సాంఘిక నీతి సూత్రములు—పైపై భేషజములు—ఆత్మవంచన, లోలోపలి చిన్నతనములపై పై వేషములతో కప్పుకొనెడి పెద్దమనిషి తనము—దీని యన్నింటిపట్ల చలంగారికి తిరస్కారము 'అమీనా'లో కన్పించును'.

—డా. సి. ఆనందారామం—సిద్ధాంత గ్రంథ వ్రాతప్రతి—ప్రాతిప్రత్యము—పుట—57.

6. 'అస్తిత్వవాదంలో 'వ్యతిరేకతకు' అవకాశం ఎక్కువగావుంది. ఈ వ్యతిరేకత స్వేచ్ఛాయుతమైన 'ఇచ్ఛ' నుండి వెలువడింది. కాబట్టి మనిషిచేసే పనులు

ఊహాతీతంగా వుంటాయి. హేతువాదంతో చూస్తే అంతుపట్టవు అస్తిత్వవాద ప్రధాన సూత్రం Irrationality కార్యకారణభావ శూన్యత జీవితంలోని అసంబద్ధత (absurdity) వీరిని బాగా ఆకర్షిస్తుంది.'

—శ్రీ కోడూరి శ్రీరామమూర్తి—మూడు దశాబ్దాల తెలుగు నవలా సాహిత్యంలో అస్తిత్వవాద ధోరణులు (1947—'77)—భారతి—ఏప్రెల్—1978—పుట—43

7. 'అమీనా చలం వ్రాసిన నవల పేరేకాదు. ఆ నవలలో అమీనా పాత్ర చలం అంతఃకరణకు ప్రతీక కూడా.'

—శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం—చలం—భారతి—ఫిబ్రవరి—1965.

8. 'రహస్య ప్రణయముపట్ల చలంగారికింతటి నీచభావము. చలం వ్యభిచారమును సమర్థించుటలేదు. వెలకు వెలయాలితోడి కామ జీవితము నాయన భరించలేడు.'

—డా. సి. ఆనందరామం—సిద్ధాంత గ్రంథ వ్రాతప్రతి—పుట—71.

9. 'మన హృదయాలూ, అందులో ఉన్న భయంకర దృశ్యాలూ మనకు చూపించడమే ఆయన పని. ఆదర్శాలను ప్రకటించడం కాదు.'

—శ్రీ కొడవటిగంటి కుటుంబరావు—గుడిపాటి వెంకటచలంగారి రచనలు—భారతి ఆగస్టు—1937.



# 4. మైదానం: కథ

రాజేశ్వరి భర్తతో కాపురం చేస్తున్నది. ఆయన లాయరు వ్యవహారపు పని మీద లాయరు దగ్గరికి వచ్చిపోతూఉన్న అమీర్ మీద రాజేశ్వరికి ప్రేమాభిమానాలు పెరగటం మొదలైంది. అమీర్ ధైర్యంగా యధేచ్ఛగా ఆమెతో ప్రవర్తించటం మొదలు పెట్టాడు. ఈ విధంగా కొన్నాళ్ళు జరిగిన తరువాత అమీర్ రాజేశ్వరి ఇద్దరు లేచిపోయి జనపదానికి దూరంగా ఒక మైదానంలో కాపురం పెట్టారు.

వీళ్ళిద్దరిలో కాముక ప్రవృత్తి ఎక్కువగా ఉండడంచేత దాన్ని అనుభవించ డానికి జనపదాలకంటె మైదానమే అనుకూలంగా వారికి తోచింది. ఈ కాముక ప్రవృత్తి వల్లనే రాజేశ్వరి తన భర్తను, బంధువులను అందరిని విడిచి లేచివచ్చింది

కొన్నాళ్ళకు ఆ ప్రక్క ఊళ్ళో ఉండే తోళ్ళ సాహెబు కూతురుమీద అమీర్ మనసు పడ్డాడు. ఆమెతో అమీర్‌కు అనుసంధానం చేయడంలో మీరా అనే కుర్రవాడు సహాయ పడ్డాడు ఆ విధంగా మీరా, అమీర్‌కు సన్నిహితుడై మైదానంలో అమీర్, రాజేశ్వరితో కాపురం ఉన్నచోటికి వచ్చిపోవటం ప్రారంభించాడు. మీరా ద్వారా అమీర్ ప్రేమకలాపాలను విని రాజేశ్వరి మొదలు చాల బాధ పడింది తాను సాహసంచేసి లేచి వచ్చినందుకు అమీర్ తనకు ద్రోహం చేస్తున్నాడని బాధ పడింది అయినా అమీర్ మీద ఉన్న మోహంతో అతనిని తోళ్ళ సాహెబు కూతురుతో కలపటం తన త్యాగ బుద్ధికి నిదర్శనంగా ఉంటుందని భావించింది. ఆ పని చేసింది కూడా. కాని అమీర్ తోళ్ళసాహెబు కూతరుతో ఎక్కువకాలం ఉండలేక ఆమె ప్రదర్శించే మోహ తీవ్రతకు అసహ్యపడి తిరిగి రాజేశ్వరి వద్దకే వచ్చి ఉంటాడు. మీరా కూడా వచ్చిపోతూ ఉంటాడు.

కొన్నాళ్ళకు రాజేశ్వరికి గర్భం వచ్చింది. అది తన మోహవాంఛా సాఫల్యా నికి ఆటంకమని భావించి కాబోలు కడుపును పోగొట్టుకోమని అమీర్ రాజేశ్వరిని

మైదానం—ఎమెస్కో ప్రచురణ—1976.

బలవంతపెట్టాడు. రాజేశ్వరి అందుకు ఒప్పుకోకపోతే ఆరునెల్ల వరకు తిరిగి రావని చెప్పి వెళ్ళిపోయాడు. మాతృత్వాన్ని వదులుకోలేక రాజేశ్వరి అమీర్ కోరికను తిరస్కరించింది. కాని క్రమంగా అతణ్ణి వదలి ఒంటరిగా జీవించలేక బాధపడి అమీర్ రావడమే ముఖ్యమనుకొని కడుపును పోగొట్టుకుంటుంది. ఈ విషయంలో రాజేశ్వరికి మీరా సహాయపడ్డాడు. మీరా తనకు సపర్యలు చేసిన పరిస్థితులవల్ల రాజేశ్వరికి ఆతని మీద ప్రేమ కలిగింది.

మీరా రాజేశ్వరితో ప్రేమగా ఉంటాడు. ఇంతలో అమీర్ తిరిగి వస్తాడు. కాని రాజేశ్వరితో మీరా ప్రేమగా ఉండడం సహించలేడు. మీరా, అమీర్‌ల మధ్య ఈర్ష్యాద్వేషాలు ఎక్కువైనాయి. మీరా రాజేశ్వరిని లేవదీసుకొని పోవాలని కూడా చూస్తాడు ఇదంతా చూచి సహించలేక మీరాను చంపడానికి వీలులేక, రాజేశ్వరిని చంపలేక, తన్నుతానే పొడుచుకొని అమీర్ చనిపోయాడు.

ఇది చలంగారి 4–వ నవల. రచనాకాలం, 1927.



# వైవాహిక ఇతివృత్తాలు

# నైదానం: విషయ విచారణ

ధర్మార్థ కామమోక్షాలను పురుషార్థాలుగా ప్రాచీన ధర్మశాస్త్రవేత్తలు గుర్తించి ప్రబోధించారు. ఇందులో ధర్మార్థకామాలను గూర్చి తెలుసుకోవాలిసిన అవసరం స్త్రీ–పురుషులకు ఉంది. అప్పుడే వారు జీవితాన్ని గూర్చి సంపూర్ణంగా తెలిసికొని సౌఖ్యాన్ని పొందే అవకాశం ఉంటుంది. ఇందులో ఏ ఒక్కదానికి సంబంధించిన జ్ఞానం లేకున్నా వ్యక్తిలో పరిపూర్ణత లోపిస్తుంది. సమాజం ధర్మార్థాలకు ఇచ్చినంత ప్రాధాన్యాన్ని కామానికి యివ్వడంలేదు. ప్రాచీనులు కామాన్ని స్త్రీ–పురుషుల మధ్య యోగంగా భావించారు.1 కాని ఆధునికులు నేడు దాన్ని భోగంగా భావించి దానిలోని ఉదాత్తతను నిర్లక్ష్యం చేస్తున్నారు.

సెక్సు ప్రాముఖ్యాన్ని ఆధునిక రచయితలల్లో చలం అధికంగా గుర్తించాడు. 'సెక్సు అంటె జీవితపు సూత్రం. పిల్లల దగ్గర్నుంచి ముసలివాళ్ళయిందాకా అందర్నీ, వాళ్ళకి తెలిసినా తెలియకపోయినా ప్రోత్సహించి పాలిస్తోంది.' (పుట–10) అని స్త్రీలో చలం గట్టిగా చెప్పాడు. చలం తన కాలంలో కామాన్ని, స్త్రీని నీచంగా చూసే వ్యక్తులనూ, వయసునంతగా పాటించకుండా కామాన్ని అరికట్టుకోవాలని చెప్పే వృద్ధులనూ, తాము మాత్రం కన్యలను పెళ్ళాడాలని వాంఛించే వారిని చూసాడు. తత్ఫలితంగా వివాహాలలో కామ, మోహ, ప్రేమలకు తగినంత ప్రాముఖ్యాన్ని ఇయ్యక పోవడంచేత వ్యభిచరించే లక్షణం వారిలో కలుగుతున్నదని గ్రహించాడు. కాబట్టి చలం తన కాలం నాటి వివాహాలలోని దోషాలను దృష్టిలో పెట్టుకొని వివాహానికి కామ, మోహ, ప్రేమలు ప్రాతిపదికలనే దృష్టితో రచనా వ్యాసంగాన్ని సాగించాడు. వీని ఆధారంగా వివాహాలు జరగాలనీ, అలా జరుగనపుడు పురుషుడు స్వేచ్ఛగా వ్యవహరిస్తున్నట్లు స్త్రీ వ్యవహరించలేక పోతున్నదనీ, అట్టి పరిస్థితిలో స్త్రీ గూడా స్వేచ్ఛగా వివాహబంధం నుంచి లేచిపోవాలని, తిరుగబడాలని చలం చెప్పాడు. ఇలా లేచిపోతే సమాజంలో స్త్రీ–పురుషులు జాగరూకులై వైవాహిక ధర్మాలలోని కామ మోహాలకు ప్రాధాన్యతనిచ్చి అలాంటి ప్రవృత్తిని పునరుద్ధరిస్తారని చలం ఆశించాడు. అందుచేత దాంపత్య జీవితంలో

ఊహాతీతంగా వుంటాయి. హేతువాదంతో చూస్తే అంతుపట్టవు అస్తిత్వవాద ప్రధాన సూత్రం Irrationality కార్యకారణభావ శూన్యత జీవితంలోని అసంబద్ధత (absurdity) వీరిని బాగా ఆకర్షిస్తుంది.'

—శ్రీ కోడూరి శ్రీరామమూర్తి—మూడు దశాబ్దాల తెలుగు నవలా సాహిత్యంలో అస్తిత్వవాద ధోరణులు (1947—'77)—భారతి—ఏప్రెల్—1978—పుట—43

7. 'అమీనా చలం వ్రాసిన నవల పేరేకాదు, ఆ నవలలో అమీనా పాత్ర చలం అంతఃకరణకు ప్రతీక కూడా.'

—శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం—చలం—భారతి—ఫిబ్రవరి—1965.

8. 'రహస్య ప్రణయముపట్ల చలంగారికింతటి నీచభావము. చలం వ్యభిచారమును సమర్థించుటలేదు. వెలకు వెలయాలితోడి కామ జీవితము నాయన భరించలేడు.'

—డా. సి. ఆనందరామం—సిద్ధాంత గ్రంథ వ్రాతప్రతి—పుట—71.

9. 'మన హృదయాలూ, అందులో ఉన్న భయంకర దృశ్యాలూ మనకు చూపించడమే ఆయన పని. ఆదర్శాలను ప్రకటించడం కాదు.'

—శ్రీ కొడవటిగంటి కుటుంబరావు—గుడిపాటి వెంకటచలంగారి రచనలు—భారతి ఆగస్టు—1937.



# 4. మైదానం: కథ

రాజేశ్వరి భర్తతో కాపురం చేస్తున్నది. ఆయన లాయరు వ్యవహారపు పని మీద లాయరు దగ్గరికి వచ్చిపోతూఉన్న అమీర్ మీద రాజేశ్వరికి ప్రేమాభిమానాలు పెరగటం మొదలైంది. అమీర్ ధైర్యంగా యధేచ్ఛగా ఆమెతో ప్రవర్తించటం మొదలు పెట్టాడు. ఈ విధంగా కొన్నాళ్ళు జరిగిన తరువాత అమీర్ రాజేశ్వరి ఇద్దరు లేచిపోయి జనపదానికి దూరంగా ఒక మైదానంలో కాపురం పెట్టారు.

వీళ్ళిద్దరిలో కాముక ప్రవృత్తి ఎక్కువగా ఉండడంచేత దాన్ని అనుభవించ డానికి జనపదాలకంటె మైదానమే అనుకూలంగా వారికి తోచింది. ఈ కాముక ప్రవృత్తి వల్లనే రాజేశ్వరి తన భర్తను, బంధువులను అందరిని విడిచి లేచివచ్చింది

కొన్నాళ్ళకు ఆ ప్రక్క ఊళ్ళో ఉండే తోళ్ళ సాహెబు కూతురుమీద అమీర్ మనసు పడ్డాడు. ఆమెతో అమీర్‌కు అనుసంధానం చేయడంలో మీరా అనే కుర్రవాడు సహాయ పడ్డాడు ఆ విధంగా మీరా, అమీర్‌కు సన్నిహితుడై మైదానంలో అమీర్, రాజేశ్వరితో కాపురం ఉన్నచోటికి వచ్చిపోవటం ప్రారంభించాడు. మీరా ద్వారా అమీర్ ప్రేమకలాపాలను విని రాజేశ్వరి మొదలు చాల బాధ పడింది. తాను సాహసంచేసి లేచి వచ్చినందుకు అమీర్ తనకు ద్రోహం చేస్తున్నాడని బాధ పడింది. అయినా అమీర్ మీద ఉన్న మోహంతో అతనిని తోళ్ళ సాహెబు కూతురుతో కలపటం తన త్యాగ బుద్ధికి నిదర్శనంగా ఉంటుందని భావించింది. ఆ పని చేసింది కూడా. కాని అమీర్ తోళ్ళసాహెబు కూతురుతో ఎక్కువకాలం ఉండలేక ఆమె ప్రదర్శించే మోహ తీవ్రతకు అసహ్యపడి తిరిగి రాజేశ్వరి వద్దకే వచ్చి ఉంటాడు. మీరా కూడా వచ్చిపోతూ ఉంటాడు.

కొన్నాళ్ళకు రాజేశ్వరికి గర్భం వచ్చింది. అది తన మోహవాంఛా సాఫల్యా నికి ఆటంకమని భావించి కాబోలు కడుపును పోగొట్టుకోమని అమీర్ రాజేశ్వరిని

మైదానం—ఎమెస్కో ప్రచురణ—1976.

బలవంతపెట్టాడు. రాజేశ్వరి అందుకు ఒప్పుకోకపోతే ఆరునెల్లు వరకు తిరిగి రానని చెప్పి వెళ్ళిపోయాడు. మాతృత్వాన్ని వదులుకోలేక రాజేశ్వరి అమీర్ కోరికను తిరస్కరించింది. కాని క్రమంగా అతణ్ణి వదలి ఒంటరిగా జీవించలేక బాధపడి అమీర్ రావడమే ముఖ్యమనుకొని కడుపును పోగొట్టుకుంటుంది. ఈ విషయంలో రాజేశ్వరికి మీరా సహాయపడ్డాడు. మీరా తనకు సపర్యలు చేసిన పరిస్థితులవల్ల రాజేశ్వరికి అతని మీద ప్రేమ కలిగింది.

మీరా రాజేశ్వరితో ప్రేమగా ఉంటాడు. ఇంతలో అమీర్ తిరిగి వస్తాడు. కాని రాజేశ్వరితో మీరా ప్రేమగా ఉండడం సహించలేడు. మీరా, అమీర్‌ల మధ్య ఈర్ష్యాద్వేషాలు ఎక్కువైనాయి. మీరా రాజేశ్వరిని లేవదీసుకొని పోవాలని కూడా చూస్తాడు ఇదంతా చూచి సహించలేక మీరాను చంపడానికి వీలులేక, రాజేశ్వరిని చంపలేక, తన్నుతానే పొడుచుకొని అమీర్ చనిపోయాడు.

ఇది చలంగారి 4–వ నవల. రచనాకాలం, 1927.



# వైవాహిక జీవితం: విషయ విచారణ

ధర్మార్థ కామ మోక్షాలను పురుషార్థాలుగా ప్రాచీన ధర్మశాస్త్రవేత్తలు గుర్తించి ప్రతిబోధించారు. ఇందులో ధర్మార్థకామాలను గూర్చి తెలుసుకోవాలిసిన అవసరం స్త్రీ–పురుషులకు ఉంది. అప్పుడే వారు జీవితాన్ని గూర్చి సంపూర్ణంగా తెలిసికొని సౌఖ్యాన్ని పొందే అవకాశం ఉంటుంది. ఇందులో ఏ ఒక్కదానికి సంబంధించిన జ్ఞానం లేకున్నా వ్యక్తిలో పరిపూర్ణత లోపిస్తుంది. సమాజం ధర్మార్థాలకు ఇచ్చినంత ప్రాధాన్యాన్ని కామానికి యివ్వడంలేదు. ప్రాచీనులు కామాన్ని స్త్రీ–పురుషుల మధ్య యోగంగా భావించారు.1 కాని ఆధునికులు నేడు దాన్ని భోగంగా భావించి దానిలోని ఉదాత్తతను నిర్లక్ష్యం చేస్తున్నారు.

సెక్స్ ప్రాముఖ్యాన్ని ఆధునిక రచయితలలో చలం అధికంగా గుర్తించాడు. 'సెక్స్ అంటె జీవితపు సూత్రం. పిల్లల దగ్గర్నుంచి ముసలివాళ్ళయిందాకా అందర్నీ, వాళ్ళకి తెలిసినా తెలియకపోయినా ప్రోత్సహించి పాలిస్తోంది.' (పుట–10) అని స్త్రీలో చలం గట్టిగా చెప్పాడు. చలం తన కాలంలో కామాన్ని, స్త్రీని నీచంగా చూసే వ్యక్తులనూ, వయసునంతగా పాటించకుండా కామాన్ని అరికట్టుకోవాలని చెప్పే వృద్ధులనూ, తాము మాత్రం కన్యలను పెళ్ళాడాలని వాంఛించే వారిని చూసాడు. తత్ఫలితంగా వివాహాలలో కామ, మోహ, ప్రేమలకు తగినంత ప్రాముఖ్యాన్ని ఇయ్యక పోవడంచేత వ్యభిచరించే లక్షణం వారిలో కలుగుతున్నదని గ్రహించాడు. కాబట్టి చలం తన కాలం నాటి వివాహాలలోని దోషాలను దృష్టిలో పెట్టుకొని వివాహానికి కామ, మోహ, ప్రేమ–లు ప్రాతిపదికలనే దృష్టితో రచనా వ్యాసంగాన్ని సాగించాడు. వీని ఆధారంగా వివాహాలు జరగాలనీ, అలా జరుగనపుడు పురుషుడు స్వేచ్ఛగా వ్యవహరిస్తున్నట్లు స్త్రీ వ్యవహరించలేక పోతున్నదనీ, అట్టి పరిస్థితిలో స్త్రీ గూడా స్వేచ్ఛగా వివాహబంధం నుంచి లేచిపోవాలని, తిరుగబడాలని చలం చెప్పాడు. ఇలా లేచిపోతే సమాజంలో స్త్రీ–పురుషులు జాగరూకులై వైవాహిక ధర్మాలలోని కామ మోహాలకు ప్రాధాన్యతనిచ్చి అలాంటి ప్రవృత్తిని పునరుద్ధరిస్తారని చలం ఆశించాడు. అందుచేత దాంపత్య జీవితంలో

అని అంటుంది (పుట–27) మోహంచేత ప్రకోపింపబడిన కామానుభవంలోని 'వివిధ సుందరానుభావాలను' చలం నవలలో చూపాడు. కామంయొక్క విశృంఖల త్వాన్ని రొమాంటిక్ ధోరణిలోచెప్పి రాజేశ్వరి తనది కామంకాదని ప్రేమ అని త్యాగ మని అంటుంది. ప్రేమ ఉన్నప్పుడు త్యాగం చేయడం సుఖమని, కష్టాలు కష్టాలుగా తోచకపోవడం. నదిలో నగ్నంగా ఇద్దరు స్నానం చేయడం, కళ్ళతో ఒకళ్ళనొకళ్ళని త్రాగెయ్యడమే భోజనంగా భావించడం, ఒక మూకట్లో ఇద్దరు తినడమూ, అమీర్ ఉద్రేకంలో, తన శరీరావయవాలతో అతను ఆదుకోవడంలోని రాసిక్యాన్ని చూడడంలో రాజేశ్వరికి కాల్పనిక దృక్పథం ఉంది. దినము తరువాత దినము తనకు 'వివిధ రాగ సుందరానుభవాలను' తీసుకవచ్చాడని భావించి మైదానంలో ఆనందాన్ని అనుభవించానని భావించింది మైదానంలో ఈ విధంగా గడిపిన జీవితం వాస్తవ విరుద్ధమైంది. సామా జిక దృక్పథానికి భిన్నమైంది కాల్పనిక లోకానికి సంబంధించింది సామాజిక ప్రయో జనానికి, ఆచరణాత్మక ప్రగతిశీలక వ్యవస్థా ధర్మానికీ సంబంధించింది గాదు. చలం ఏ భావకవి వర్ణించని శృంగార గాఢతను వీరి ప్రణయంలో చూపాడు. ఆమె చెప్పిన భావాలు హేతువుకు నిలబడక పూర్వపక్షం చేయనీయని ఉధృత రొమాంటిక్ వాక్ప్ర వాహంతో ఉంటాయి అందుచే రాజేశ్వరి మామవేసిన ప్రశ్నలు సామాజికమైనప్పటికి ఆమె కాల్పనిక సమాధానాల ముందు అతని కుహనా సంస్కార వ్యక్తిత్వం వలన నవలలో అతని మాటలకు రాణింపు కలగలేదు

వీరిద్దరిని చలం మైదానంలోనికి తీసికొని వెళ్ళడంలో సెక్స్‌ను ప్రకృతి ప్రాంగ ణంలో స్వేచ్ఛగా అనుభవించడంలో ఉన్న సహజత్వాన్నిచూపే ఉద్దేశ్యము ఉండవచ్చును. సమాజంలో మోహానుభావాలను విశాలమైన గార్డెన్స్‌లలోగాని, తోటలందుగాని అనుభ వించడానికి వీలు ఉన్నది. వనాలలో గూడా అలాంటి వీలుఉంది వీరు ప్రవేశించిన మైదానం ఉత్పత్తికి అనువైన డెల్టా ప్రాంతంకాదు. నివాసయోగ్యంగాని ఎడారి. ఇటు వంటి ఎడారి మైదానంలో రాజేశ్వరి–అమీర్–లు ప్రవేశించినారంటే సమాజ వ్యవస్థ నుండి వైదొలగినారనే అభిప్రాయాన్ని చలం ధ్వనింపచేస్తున్నాడు. వీరి కామ, మోహాలు వీరి వైయక్తికాలే వీరి ఉభయులవే ఇట్టి వైయక్తిక ప్రవృత్తులు సామా జిక స్పృహలేనపుడు కామాన్ని ఆశ్రయించి ఉంటాయి. వీరి కలయిక సామాజిక రచనకు అనువైనదిగాదు స్త్రీ–పురుషులు వ్యవస్థలో ఆచరించడానికి వీలైనదిగాదు.

సామాజిక చైతన్యం

సమాజాభివృద్ధికి శ్రేయోదాయకంగాదు. అందుకొరకే చలం మైదానాన్ని వీరి కలయిక కథ ఎన్నుకొన్నాడని భావించవచ్చును.

II. రాజేశ్వరి—అమీర్‌ల ప్రేమ ఉన్నతంగా పరిణామంపొందింది ఆదర్శవంతంగా వ్యవస్థీకరించబడలేదు అమీర్‌ది నిజమైన మోహమే అయితే రాజేశ్వరినివదిలే ప్రకృతి అతనిలో ఉండగూడదు. స్త్రీ—పురుషుల్లో పరస్పరం విడిపడని స్వభావం మోహంగల వారిల్లో ఉంటుంది. రాజేశ్వరికి అమీర్ ఎడల మోహం ఉంది. కాని అమీర్‌కు రాజేశ్వరి ఎడల మోహం పోయింది. పైపెచ్చు అతనికి తోళ్ళసాహెబు కూతురుపై మోహం కల్గింది. రాజేశ్వరి తాననుకునే ప్రేమ భంగపడింది తనను కోరిన అమీర్ మోహం మరొకరిని కోరటంలో వింతలేదని, భర్తను, సంసారాన్ని వదలి వచ్చినందులకు మంచిశాస్తి జరిగిందని ఈ విధంగా బాధపడింది 'మామయ్య అన్న మాటలు నిజమేనేమో! ఇట్లా శరీరాకర్షణలోబడి జీవితాన్ని వప్పగించుకొన్న దౌర్భాగ్యులగతి యింతేగావును. ఉధృతమూ, నిరాటంకమైన మోహానికి అంతమింతేనేమో! ఏ నిగ్రహమూ, నియమమూ లేకుండా యింకొకరి భార్య అని యోచించకుండా నన్ను కోరిన అమీర్ నన్ను వొదలి యింకొకర్ని మోహించడంలో ఆశ్చర్యమేముంది? ఎంత అసహ్యంగా వున్నా సంఘ నిర్మితమైన సంసారంలో కొంత శాశ్వతత్వం కాలం వల్లయేర్పడి, భేదించడానికి సాధ్యంకాని బంధనాలున్నాయి. ఇక్కడా! వెర్రిదాననైనానా? మామయ్యే చివరికి వివేకవంతుడా?' (పుట—46, 47) అని వెనుక ముందులకు ఊగిసలాడుతూ ఆలోచించింది. అందువల్ల రాజేశ్వరి అంతరంగం వివాహ వ్యవస్థ ఎడల అనుకూలంగా ఒకసారైనా తిరిగింది కామానికి అంకితమైన జీవితాన్ని పురుషులకు ఒప్పగించుకున్న స్త్రీలగతి దౌర్భాగ్యమైనదని రాజేశ్వరి గ్రహించింది. ఇలా గ్రహించడానికన్న ముందే జీవితం నాశనమైంది కాబట్టి తిరిగి వ్యవస్థలో తనకు స్థానం లేదని భావించడంచేత, అహాన్ని చంపుకోలేక కాల్పనిక జగత్తులోకి జారిపోయి ఆశావాదంతో రాజేశ్వరి మాట్లాడుతుంది. సామాజిక అవగాహనకు కాల్పనిక ప్రవృత్తికి ఘర్షణ ఆమెలో జరిగింది మోహం తీరగలిగే అవకాశం ఉన్న వివాహ వ్యవస్థ ఉంటే ఎంత బాగుండుననే భావన ఆమె అంతరంగంలో ఉన్నదనే భావించాలి అది ఆమెకు వ్యవస్థలో లభించి ఉంటే, బయట వచ్చేది కాదేమో! కాబట్టి ఆమెకున్న కాల్పనిక దృక్పథంచేత వ్యవస్థలో మోహం లభించనందువల్ల వ్యభిచరించిందని, అది నీతి, ధర్మం

కాదని భావించాలి.7 అమీర్ మోహాన్ని తీర్చడానికి సాహెబు కూతురుతో అతన్ని కలిపి లోన జెలసీ, బాధ ఉన్నప్పటికి పైకి సంతోషంగా ఉందని, అది గొప్ప త్యాగమని పొంగి పోయింది.8 'కాని, యిప్పుడు నా బాధని అతని ఆనందంగా మార్చి అతని ఆనందంలో నేను ఆనందపడబోతున్నాను గొప్ప సంతోషంతో నా వొళ్ళు పులకరించింది.' (పుట–47–48) అని కాల్పనిక జగత్తులోనికి జారిపోయి తృప్తి పడింది. ఇంకా కాల్పనిక అనుభూతి లోకాలకు ఎగిరి 'ఏ త్యాగం నావల్ల నౌతుంది ? ఏ స్త్రీలను అతనికోసం తీసుకురాగలను. నా ప్రాణాన్ని, మానాన్ని దేన్ని అర్పించను'. (పుట–51)– 'పూరికే కావలింతలవల్ల వ్యక్తమౌతుందా ప్రేమ ? అంత సర్వమూ త్యాగం చేసి యేమి అతని నుంచి నేను అనేది లేకుండా నా అహాన్ని చంపుకుంటేనేగాని ?' (పుట–51) అని కలలు కన్నది. ఈ దృక్పథం మైదానంలోనే తీవ్ర అరాచకానికి గురైంది ఇంక వ్యవస్థలో దాని పర్యవసానం చెప్పవీలుగాదు. ఇంత కాల్పనిక దృక్పథం ఉన్న రాజేశ్వరిలో మానవ సహజమైన జెలసీ ఉంది. అమీర్, సాహెబు కూతురు కలయిక ఆమెలో ఎంతో బాధను కలిగించింది. 'ఎంత ప్రయత్నించినా చెవులు మూసుకోలేక పోయినాను మొదట బాధ పడ్డాను. నా వశం కాకుండా ఈర్ష్య పడ్డాను.' (పుట–50) ఇలాంటి రాజేశ్వరి త్యాగం, ఆర్ద్రతలలో ఆమె నిస్సహాయత్వమే గోచరించింది ఆమెకు మైదానంలో అమీర్ తప్ప మిగతా సమాజంలేదు తాను మోహావాంఛను తీర్చుకోవడానికే వచ్చింది. అంతేగాని సమాజ రచనలో తన సహజాతాలను ధర్మబద్ధం చేయలేకపోయింది. అందుకే అమీర్‌ను పరస్త్రీ వాంఛనుండి అరికట్టే ధైర్యం లేక, ఉన్నా ఫలించదు కాబట్టి అతని కోరికనుతీర్చి త్యాగమని సంతోషించింది.

కేవలం మోహమే ప్రధానమనుకుంటే వ్యవస్థ నడవడం కష్టమే. మోహం చంచలమని, అశాశ్వతమని, మార్పును కోరుతుందని అమీర్ సాహెబు కూతురుని విడిచిపెట్టి తిరిగి రాజేశ్వరి అండనచేరిన సంఘటననుబట్టి చలం తెలియచేస్తున్నాడు. ఇలా జేయడంవల్ల మొదలు రాజేశ్వరి, తరువాత సాహెబు కూతురు భంగపడ్డారు. జెలసీకి కారణమైన ఈ సంధాన వ్యవహారం సమాజంలో సత్ఫలితాలనియ్యదు. కేవలం కాముక వ్యాపారమే ప్రధానమైన మోహ వ్యవహారాల్లో ఇటువంటి చిక్కులు సహజమని చలం ఈ సంఘటన ద్వారా స్ఫురింపచేయదలచాడు. 'అమీర్ హృదయం నాదైనప్పుడు తనెందరి స్త్రీలతోవుంటే నాకేం ? అతనికానందం కల్గిస్తున్నాననే ఆనందం

కన్న వున్నతమైనదేమున్నది నాకు ? అమీర్ నాకంత సౌఖ్యమిచ్చాడే నేనీచిన్న సౌఖ్యాలతనికి సమకూర్చలేనా ?' (పుట–51–52) అన్న రాజేశ్వరి మాటలు రొమాంటిక్ తత్వంలో కాముకత్వంతో అన్నవితప్ప సామాజిక దృక్పథంతో అన్నవికావు. కేవలం మోహ తీవ్రతలో కాముక విషయాలను ప్రధానం చేయటంచేత వచ్చిన జెలసీ, ఈర్ష్య మున్నగు పరిణామాలను చలం రాజేశ్వరి పాత్రద్వారా చూపాడు మోహ తీవ్రతలు మారిన కొలది స్త్రీ–పురుషులు పరస్పరం మార్చుకొంటూపోయిన వారి జీవితాలలో అలజడి, అశాంతి ఏర్పడి పిచ్చివారివలె లోకంలో తిరగడం సంభవిస్తుందని చలం చెప్పదలిచాడు.

III సృష్టించడంలో ఆనందం ఉంది మాతృత్వంలో మాధుర్యం ఉంది[9] ఆ సృష్టి రచన సమాజంలో ఇముడటంలో ఔన్నత్యం ఉంది. మైదానంలో కామ ప్రధానమైన వైయక్తిక ప్రేమ, రొమాంటిక్ దృక్పథం సృష్టిలీలకు కావలిసిన తంతువును జరపడంలో ఫలిస్తుందేకాని దాని పరిణామాన్ని వ్యవస్థీకరించి భరించే స్థితిలో ఉండవు. అందుకే అమీర్, రాజేశ్వరి గర్భాన్ని తీసివేసికోమని బలవంతం చేసాడు.10 అది తమ ప్రేమకు ఆటంకమని రాజేశ్వరి డొక్కలో తన్ని అదే తమను వేరుచేస్తుందని ఆగ్రహించాడు. అలాంటి దుర్భరమైన, అమానుషమైన అమీర్ చర్యను కూడా తన రొమాంటిక్ దృక్పథంతో సమర్ధించుకుంటుంది. 'అంతేకావి దిమ్మ తిరిగేట్టు అమీర్ మళ్లె కొట్టుమను యీ మొగాళ్ళని అసలు వాళ్ళ చేతుల్లో సత్తువ ఉడిస్తేగదా'! (పుట–61) అని అంటుంది. కాని ఆమె మాతృత్వం క్షోభించింది. ఆమె మోహాన్ని మింగివేయగల 'యింకో శక్తి' పెరిగింది. అదియే బిడ్డను కాపాడుకోవాలనే మాతృత్వ శక్తి. అదియే సామాజికాంశంతో కూడిన శక్తి. అది మైదానంలో ఫలించదు సమాజంలోనే ఫలిస్తుంది. మైదాన ప్రవృత్తినికోరి, సమాజ ప్రవృత్తి ఫలితాన్ని అనుభవించాలనుకుంటే కుదురదు. అందుకొరకే అమీర్ కామం కొరకు తన మాతృత్వాన్ని వదలుకొంది. గర్భాన్ని కాపాడుకొనడంలో ఆమె స్త్రీత్వాన్నిగాని, ధైర్యాన్నిగాని ప్రదర్శించలేక అమీర్ కాముకత్వానికి, తన మోహానికి లొంగిపోయింది, సంతాన నిరపేక్షా భావం అమీర్‌లో పరోక్షంగా కనబడింది. అమీర్ రాజేశ్వరిని గర్భం తీసివేసికొనమనటంలో ఉన్న భావమేమిటంటే అది తమ కామమోహాలకు ఆటంకమని, దానివల్ల సమాజంతో సంబంధమేర్పడుతుందని, అలాంటి సంతానం సమాజంలో ఇముడదనే

కోరిక ఉండబట్టే. రాజేశ్వరి మోహ ప్రవృత్తి, వైయక్తిక ప్రవృత్తి సంతానాన్ని ఆపేక్షించదు. ఆమెకు మాతృత్వం ఫలిస్తే కాముకత్వానికి దూరంగా ఉండే అవకాశ ముంటుంది. అందుకే ఆమెను గర్భాన్ని తీసివేసికొనమని కోరాడు. ఆమె అంగీక రించకపోవడంచేత ఆమెను మైదానంలో వదలి ఎటో వెళ్ళిపోయాడు. తాను ఇప్పుడు సమాజంలోనికి వెళ్ళలేదు. పుట్టే బిడ్డతో తనకు సమాజంతో సంబంధం ఏర్పడుతుంది. అప్పుడు తన పతనావస్థ సమాజంలో గోచరిస్తుంది. ఈ విషయాలన్ని భావించుకొని, తన ప్రియుని మనస్సు నెరిగి తన సహజాత లక్షణమైన మాతృత్వాన్ని వదలుకొంది. అమీర్ రాజేశ్వరిని దిక్కులేని దానిగా వదిలిపెట్టిపోయే సంఘటన, దానికి ఆమె బాధ పడినతీరు హృదయ విదారకంగా ఉంది. ఆమె మాతృత్వాన్నీ, ఆమెను ఆపదలో ఉన్న ప్పుడు ఆదుకొనిన అమీర్ హృదయం కఠినాతికఠినం. అతని దృష్టిలో రాజేశ్వరి భోగ్య వస్తువే. అంతకుమించి స్త్రీ సహజ గుణాలను చూడలేని అమీర్‌ది కాముక గుణమే. అవ్యవస్థలో వయస్సు, అందం పోయిన తరువాత కాముకుడు తన ప్రియురాలిని భద్రంగా చూడడని, వ్యవస్థలో భద్రత ఏర్పడి కామ, మోహాలు, వయస్సు, అందం పోయిన తరువాత గూడా దంపతులు ప్రేమగా కలిసివుండే అవకాశం ఉందని ఈ సంఘ టనద్వార తెలుస్తున్నది. కాని ఈ మరుభూమి మైదాన ప్రేమతో కామమోహాలు తప్ప ఇతర ప్రేమలు కనబడవు ఇవి మానవుల అనుభవాలే తప్ప నాగరిక సమాజంలోని సంస్కృతికి సంబంధించిన అనుభూతులు మాత్రం కావు.

IV. అమీర్ రాజేశ్వరిని విడిచి వెళ్ళినపుడు రాజేశ్వరి గర్భం తీయించు కోవడానికి సహకరించిన మీరాను కూడా కామంతో ఆమె అంగీకరించింది. తరువాత అమీర్ వచ్చినప్పుడు ఇద్దరిని కోరుతుంది. ఇది నాగరిక సమాజంలో చాల విడ్డూరంగా తోస్తుంది. సామాజిక దృక్పథంలేని, సామాజిక పర్యవసానం అక్కరలేని స్త్రీ ఒకరి కంటె ఎక్కువ మందిని కోరి చరించే అవకాశముంది. నాగరిక సమాజం ఈ పద్ధతిని అంగీకరించదు. ఇది సమాజ శ్రేయస్సుకు తగదు. తనలో ఆర్ద్రత ఉందని ప్రపంచం లోని సౌందర్యాన్నంతా అనుభవించాలనుకోవడం సౌందర్య దృష్టిగాదు. లైంగిక సంబంధ మొక్కటే సౌందర్యంగాదు. ఇది ఆచరణీయం గూడాకాదు. కాని రాజేశ్వరి అమీర్, మీరాలను ఏకదృష్టితో మోహించి, ఇద్దరి ఎడల సమానంగా పంచరించబోయి విఫల మైంది. మోహమూ, కాల్పనిక దృష్టి విజృంభించి ఆమెను లోబరచుకొని శక్తిహీను

రాలిగా చేసినవి. రాజేశ్వరి తన లోపాన్ని అంతర్దృష్టితో ఈ విధంగా వివేచించు కుంటుంది. 'ఎటు యేమి చేసినా, దోవలేని మహా అగాధం. ఈ జీవనదికి ఈ మహా సముద్రమే అంతం. ఎటు ప్రవహించినా అంతే నా పుట్టుక. నేను ఏ పరిస్థితులలో పడ్డానో అది నా కర్మ. యీ ప్రపంచాన్ని పాలించే మహాశక్తి, మన హృదయాన్ని నడిపించే రహస్యసూత్రం. అదే నన్నూ, అతన్నీ, ప్రేమనీ అన్నిటినీ, చిరునవ్వుతో యిట్లా మా అల్పశక్తుల్ని దాన్నించి తప్పించుకోవాలని చూసే మా అల్పవ్యర్థ ప్రయత్నాలనిచూసి, చిరునవ్వుతో క్రూరంగా, నిరాఘాటంగా, సునాయాసంగా దొర్లించు కుంటో పోయింది. దానికి కళ్ళులేవు, చెవులులేవు, ఆత్మలేదు. ఆ శక్తే నీతిలోంచి, జడత్వంలోంచి, శాంతిలోంచి, మర్యాదలోంచి మిమ్మల్ని: పాపంలోంచి, నరకంలోంచి, మహా బాధలోంచి నన్నూ అందర్నీ, ఎక్కడికో ఒకచోటికేనేమో. తీసుకుపోతుంది.' (పుట–84) అని బాధ పడింది. నీతి, స్థిరత్వం, శాంతి, మర్యాద వ్యవస్థలో ఉండి కామ, మోహాలను అదుపులో పెడుతుంది. పాపం, నరకం, బాధ అవ్యవస్థలో ఉంటుంది రాజేశ్వరిపై మాటల ద్వారా; వ్యవస్థ, అవ్యవస్థల స్వరూపం గోచరింపచేసి, వ్యవస్థనే అనుసరించాలనే హెచ్చరిక చలం చేసినట్లు భావించవచ్చును. సృష్టి అయిన కామం చాల బలీయమని, దానికిలోబడి స్వేచ్ఛగా తిరిగితే వచ్చే పరిణామం అశాంతి, అలజడి, ఈర్ష్యాద్వేషాలు మాత్రమేనని, ఇవి వివాహ వ్యవస్థకు, నాగరక సమాజానికి తగవని ఈ నవలద్వారా చలం ధ్వనింపచేస్తున్నాడు. అదుపులేని కామంద్వారా జీవితాలు విషాదాంతాలవుతవనే చలం చెప్పదలిచాడుగాని చలం తన పాత్రలను సుఖాలను అనుభవించి మృత్యుశయ్యను ఎక్కమని చెప్పలేదు.11

అమీర్‌ను చూస్తే భయమని, ఇద్దరు పురుషులను ప్రేమించడం అసాధ్యమని తెలిసినప్పటికి, మీరా తనను కోరగా, రాజేశ్వరి తిరస్కరించదు. పైపెచ్చు ఇద్దరు రావచ్చునని ఆహ్వానిస్తుంది తన అంతరాత్మ అవర్ధమంటూ, అసహజమంటూ ఘోషించినా, ఆమెలోని రొమాంటిక్ అహం మీరాను ఆహ్వానించింది.' అది కొత్త. అంతే నువ్వు నాలుగుసార్లువస్తే అదే అలవాటవుతుంది.' (పుట–86) అని మీరాతో అంటుంది 'అతను మాట్లాడలేదు. నా మాటలు అబద్ధాలని నా అంతరాత్మ అంటూనే వుంది ఇద్దరిలో యెవరిని వొదలడానికీ చేతగాక ఒకర్ని వొదలకూడదనే పేరాసతో, ఆ యిద్దర్నీ ప్రయత్నించి ఒకచోట చేర్చటం అవర్ధకమంటూనే వుంది అంతరాత్మ.

గాని నా శక్తిలో వుండే నా అహంభావం నన్ను ప్రోత్సాహ పరిచింది.' (పుట–86) ఇలా ఇద్దరినీ ఆహ్వానించడంవల్ల మీరాకు రాజేశ్వరి తనకే చెందాలనీ, అమీర్‌కు చెందకూడదనే జెలసీ కలిగింది. మీరా ఆమెను లేవదీసుకొని పోవడానికి ప్రయత్నించాడు. ఇక అమీర్, రాజేశ్వరికి తనకు మధ్య తారసిల్లిన మీరాను చంపి ఆమెను దక్కించుకోవాలని చూసాడు. ఇలా వీళ్ళిద్దరు పరస్పరం జెలసీలతో మండి పోయారు. వీళ్ళిద్దరికి సామాజిక దృక్పధంగాని, రొమాంటిక్ దృక్పధంగానిలేదు. వీళ్ళిద్దరు ఆమె రొమాంటిక్ దృక్పధాన్ని అర్థం చేసుకోలేకపోయారు. ఇద్దరు ఒకే విధంగా ప్రేమించలేకపోయారు. స్త్రీ, రొమాంటిక్ దృష్టితో ఇద్దరు పురుషులను ప్రేమించటానికి ప్రయత్నించినా, వారు ఆమెను ఆ దృష్టితో చూసి ప్రేమించలేక; ఆమెను స్వంతం చేసుకోడానికే ప్రయత్నించారు. స్త్రీ–పురుషులలో ఒకరినొకరు స్వంతం చేసుకోవాలనే సహజాతం బలంగా వుంటుందని అది స్వేచ్ఛాప్రణయంలో పొసగదని విఫలమౌతుందని చలం ఈ సంఘటన ద్వారా చెప్పదలచాడు.12 ఈ నవల ద్వారా కూడా కాల్పనిక దృక్పధం సంసారిక విషయాలలో విఫలమౌతుందని చెప్పదలచాడు. రాజేశ్వరి ఇద్దరి ప్రేమను పోషించడానికి ప్రయత్నించి విఫలమైంది. అది అమీర్ ఆత్మహత్యకు దారి తీసింది. కాబట్టి వ్యవస్థాబద్ధంకాని కామ, మోహాలు, కాల్పనిక దృక్పధం, సమాజంలో సత్ఫలితాలనివ్వదని కాల్పనిక స్వేచ్ఛాప్రణయవాదులను చలం హెచ్చరికచేసినట్లు స్ఫురిస్తున్నది.13

వివాహ వ్యవస్థలో మోహ ప్రాధాన్యతను సమాజం గుర్తించకపోతే ప్రేమికులైన స్త్రీ–పురుషులు కాల్పనిక దృక్పధంతో సమాజానికి దూరమై అనాగరక స్థాయికిపోయి మైదాన జీవితాలను గడపాలిసి వస్తుందని చలం ఈ నవలద్వారా హెచ్చరిక చేసినట్లు భావించవచ్చును. ఈ రెండు హెచ్చరికలకోసమే చలం ఈ నవలను వ్రాసాడు

ఈ నవలలో 'అస్తిత్వవాద ధోరణి14' రాజేశ్వరి పాత్ర మనస్తత్వంలో చలం నిక్షిప్తపరచాడు తన స్వభావాన్ని అనుసరించి తాను జీవించడం, తన రక్తం స్పందించినట్లు వ్యవహరించడం, తన మనస్సు ఎలాకోరితే అలానడుచుకోవడం, ఇదే వ్యక్తిత్వమనుకోవడం రాజేశ్వరి ప్రకృతి. ఈ ప్రకృతిని సమర్థించుకోవడానికి కాల్పనిక దృష్టి తోడైంది. తత్ఫలితంగా ఆమెలో సామాజిక చైతన్యం సెక్సు విషయంలో కొరవడింది. సామాజిక చైతన్యం కలిగిన వ్యక్తి వ్యవస్థనుంచి తన ప్రవృత్తిని వేరుగా చూడదు.15

సామాజిక చైతన్యం

ఇదే అస్తిత్వవాదంలోని అసంబద్ధత. ఈ నవలలో చలం సెక్స్‌విషయంలో అస్తిత్వ వాదాన్ని ప్రతిపాదించి దాని అసంబద్ధతను నిరూపించాడు చలం సాహిత్య శిల్పం అట్టి లక్ష్యాన్ని కలిగి ఉందని భావించవచ్చును. అస్తిత్వవాద అసంబద్ధ సాహిత్యానికి 'మైదానం' చక్కని నవల అని భావించవచ్చును 16

---

అధోజ్ఞాపికలు :

1. 'It was a science of sex but actually it was a spiritual and yogic effort towards sex sublimation. It was 'a science of self control and spiritual elevation through the cultivation of sex. Sex is not something vulgur as our vulgarised civilisation think it to be. Sex is the sublimest thing on earth. It is the root of the universe'

   —Dr. J. L. Parnoo—Kama sutra of Vastsyana—Page No. 15.

2. 'ఏం స్త్రీ–పురుషులు పెళ్ళి చేసుకోకుండా బ్రతుకలేరా ? అని అడుగుతాడేగాని, ఏ విధంగా బ్రతుక వీలుపడుతుందో నిర్మాణాయుత సూచన ఒకటి చేయలేదు.'

   —డా. నిమ్మగడ్డ వెంకటేశ్వరరావు—స్త్రీ సమాజంపట్ల చలం దృష్టి—నిశిత పరిశీలన—ప్రసారిత—త్రైమాసిక పత్రిక—జనవరి—మార్చి '76—పుట—36.

3. 'కమక మోహమే ఆధారంగా వివాహమేర్పడాలి. మోహం లేకపోయిందా భర్త భర్తగాడు, భార్య భార్యగాదు. వారితో సంబంధం యితర మనిషితో చేసినట్లే. తనకి ఎవరిమీద మోహం కలుగుతుందో వారే తనకి భర్తగా స్త్రీ నిర్ణయించుకునే నీతికి సంఘం అభివృద్ధి చెందాలి'

   —స్త్రీ—పుట—30.

4. 'మనము భావకవిత్వమని అనుకొనే దానిలో మహాప్రాతిక భాగము చిత్తవృత్తుల సహజ లక్షణము నుండి పుట్టిన భావసముదాయము కలది కాదు. మరియానది విస్పష్ట ప్రకటనమునకు సామాజిక మర్యాద దృష్ట్యా తగినది కాదు.'

—డా. కేతవరపు రామకోటిశాస్త్రి—భావకవిత్వ విచారము—విమర్శని—1976.

5. 'కామ సంబంధంగా మనుష్యులు మూడు రకాలు. 1) మోహమంటే యెరగని వారు 2) మోహం కలిగి దానిని జయించలేక పెనుగులాడే వారు 3) మోహాన్ని జయించినవారు సంఘం కళ్ళకి మొదటి రకంవారు వుత్తములు. వారికున్నదల్లా కామం. ఆ నిమిషానికి పెళ్ళామంటో ఒకర్తె వుంటే చాలు. ఏ స్త్రీ ఐనాసరే స్త్రీ ఐతేచాలు. కనక భార్యవుంటే యితర స్త్రీల జోలికిపోరు'

— స్త్రీ—పుట—75.

6. 'ఆతనితో కావలసిన కామం యిక్కడ అభ్యంతరం లేకుండా సాగుతోనేవుంది. నాకే కాదు. చాల మంది పతివ్రతలకే సాగుతుంది.' (పుట—15) 'కాని వాని యెంగిలి మూతితో నన్ను ముద్దు పెట్టుకుంటోవుంటే ఏం లాభం. మడిగా వేరే మూకట్లో తిని? నాకు చేతకాలేదు. వేశ్యల ఎంగిలి రుచులు చవిచూసి కూడా కులం నిలుపుకునే నేర్పరితనం మీ శ్రోత్రియులకి మాత్రమే చాతనవును' (పుట—24)— 'చీరెలు చూస్తాడా ఆమీర్ నా వొంటిని చూస్తాడు గాని అక్కడ పేరంటాలా భోజనాలా? చీరెల విలవనిబట్టి మనుషుల విలువ నిర్ణయిస్తారా, మీ పూళ్లోల్లో మల్లే' (పుట—28).

7. 'ఇంద్రియముల ప్రవృత్తిని ప్రపంచము యొక్క సాగుదలకు దోహదకారులుగా చేసెడి ఆధ్యాత్మిక చైతన్య శక్తికి నీతియని పేరు. అది లోకమును నడిపించుచున్నది గనుక నీతి. అది లోకమును ధరించుచున్నది గనక ధర్మము. ధర్మము యొక్క భౌతికత నీతి. నీతి యొక్క ఆధ్యాత్మికత పేరు ధర్మము'.

—డా. కేతవరపు రామకోటిశాస్త్రి—ఏకవీర—విమర్శని—1978—పుట—32.

8 వివరణ: ఇలాంటి త్యాగానికి సంబంధించిన కథ మార్కండేయ పురాణంలో కలదు. కౌశికుని భార్య సుమతి. కౌశికునికి పరకాంతా వ్యామోహం కలిగి ఆమె

దగ్గరికి తీసికొని పొమ్మని తన భార్యను కోరతాడు అందులకు ఆమె విచారించి, కాదనలేక భర్తను ఆమె దగ్గరికి తీసికొని పోతుంది.

9. 'సృష్టించడంకన్న ఆనందకరమయిన విషయం ప్రపంచంలో లేదు అందువల్లనేగా యీశ్వరుడే సృష్టిని ప్రారంభించాడంటాయి వేదాలు. కథలు వ్రాయడం, శిల్పం యివన్నీ సృష్టి కార్యాలే. ఈ సజీవమైన కళలే అద్వితీయానందాన్నిస్తాయికదా ? ఇంకో జీవినే సృజించడానికి ప్రాణమిచ్చే ప్రయత్నం యీశ్వర శక్తిని అందుకోగలగడమన్న మాట."
—మ్యూజింగ్స్—పుట—77

10. వివరణ: కళాపూర్ణోదయంలో శాలీనుడు సంతానాన్ని కోరడు. అతని భార్య సుగాత్రి సంతానాన్ని కోరుతుంది. అల్లే ఈ నవలలో అమీర్ సంతానాన్ని కోరడు. రాజేశ్వరి కోరుతుంది. సంతానంవల్ల సమాజంతో అనుబంధం ఏర్పడుతుంది.

11. 'అదిగో మృత్యువు. త్వరపడు సుఖాలన్నీ అనుభవించెయ్ ఏ ప్రియుణ్ణి కోరుకుంటావు ? ఏ ప్రకృతి దృశ్యం కావాలి ? నీ ఆఖరి మోహం ఏ ప్రియుడితో ? అని అడుగుతూనే ఆత్మహత్యకు అవసరమైన ఏర్పాట్లన్నీ పూర్తి చేశాడు. ప్రశాంతంగ వేదాంతపు ముసుగువేసి మృత్యువు కప్పగిస్తాడు. ఆయన ఆలస్యంచేస్తే అవే నడచిపోతాయి. బలిపీఠాలవైపు చావుకొరకు తపనచెంది'.
—డా. నిమ్మగడ్డ వెంకటేశ్వరరావు—స్త్రీ సమాజంపట్ల చలం దృష్టి—నిశిత పరిశీలన—ప్రసాత—జనవరి—మార్చి—1976; పుట—32.

12. "సిద్ధాంత రూపమున స్వేచ్ఛాప్రణయమెంతటి ఉదాత్తమైనను ఆచరణలో ఎదుర్కొనవలసివచ్చు సంఘర్షణలను ఎప్పటికప్పుడు చిత్రించక మానరు.'
—డా. సి. ఆనందరామం—సిద్ధాంత గ్రంథ వ్రాతప్రతి—పుట—60

13. 'స్త్రీ యింకెవరినీ మోహించకుండా తనని మోహించడం మానినా సహిస్తాడు. కాని యింకొకరిని మోహించగానే అతని మీద 'జెలసీ' వొస్తుంది. తనని మోహిస్తో యింకొకరి మీద కొంచెంగా మోహం చూపినా యీ 'జెలసీ' తప్పదు.
చలం నవలలు

ఆప్పుడు బాధ యింకా ఎక్కువ. తను మోహించిందా యితని మోహమంతా ద్వేషంగా మారుతుంది. ఆమె కష్టాలు పడ్డకొద్దీ యితనికి సంతోషం. ఇది పశుత్వం. మొగకుక్కలు ఆడకుక్కలకోసం పోట్లాడిన తత్వం యింకా మనుషుల్లో నివసిస్తోంది వీనివల్లనే తగాదాలు, కొట్టుకోడాలు, నరుక్కోడాలూ జరుగుతో వుంటాయి '

— స్త్రీ —పుట—82

14. 'అస్తిత్వవాదం మనిషికి సంపూర్ణమైన స్వేచ్ఛను యిస్తుంది. ఈ సిద్ధాంత ప్రకారం మానవునికి తన యిష్టప్రకారం ఆలోచించుకోడానికి, అనిశ్చితమైన విషయాల్లో ఏదో ఒకదానిని ఎంచుకోడానికి అసలుదేన్నీ ఎంచుకోకుండా వుండడానికీ కూడ స్వేచ్ఛవుంది. తనను తాను తెలుసుకోవడంవల్ల తనలో జరుగుతున్న మార్పుల్ని గమనించడంవల్ల మాత్రమే మానవుడు నిజవిలువల్ని గ్రహించ గలుగుతాడు వ్యక్తి.'

—శ్రీ కోడూరి శ్రీరామమూర్తి—మూడు దశాబ్దాల తెలుగు నవలా సాహిత్యంలో అస్తిత్వవాద ధోరణులు—(1947–77)—భారతి—ఏప్రెల్—1978.

15. 'మృత్యువును పెద్దగాచేసి భయాందోళనములను కల్పించి, హాస్యాస్పదములుగా నిరూపించి పశుమనః ప్రవృత్తులచేత మానవతను పరమరాక్షసముగా ప్రదర్శించుటయు, మనిషిని సంఘము నుండి చరిత్ర ప్రభావము నుండి తొలగదీసి వాని ప్రకృతి ననుసరించి వానిని విచారింపవలయునను టయు ఇవన్నియు ఈ అసంబద్ధ సాహిత్యా నిర్మాణ శిల్ప మర్మములుగా గ్రహింపవలయును '

—శ్రీ కేతవరపు రామకోటిశాస్త్రి—అస్తిత్వవాద అసంబద్ధ సాహిత్యము—భారతి—జులై—1977—పుట—37.

16. 'జీన్‌పాన్‌సార్త్రే అస్తిత్వవాద సిద్ధాంతాన్ని వివరిస్తూ మనిషిలో వుండే రెండు విభిన్న పరిస్థితులను చెప్పారు. మనిషి తనలో తాను వుండేదానికీ (Being in it self–Etre Ensoi). తనకోసం తాను వుండేదానికీ (Being for it self–Etre poursoi) గల తేడాను వివరించాడు. తనలోతాను వుండడం

అంటే అచైతన్యస్థితి, తనకోసం తాను వుండడమనేది చైతన్యస్థితి చైతన్య వంతుడైన మానవుడు 'తనలో తాను' వుండలేడు. తన నుంచి తనను విడిపించుకొని చైతన్యంతో ముందుకు పోదామనుకుంటాడు అంటే— అచేతనమైన 'Ensoi' నుండి బయటపడి చైతన్య స్ఫూర్తిగల 'Poursoi' కి చేరుకుందామనీ— ఈ రెండింటినీ సమైక్యం చేద్దామనీ అనుకొంటాడు అయితే ఈ కలయిక అస్వాభావికమైంది కావడంచేత 'Ensoi' నించి పూర్తిగా బయటపడలేకా— Poursoi తో పూర్తిగా సంలీనంకాలేకా, అనంతాన్వేషణకు, తీవ్రమైన ఆందోళనకు గురిఅవుతున్నాడు— అంటారు ఈ సిద్ధాంత కర్తలు.'

—శ్రీ కోడూరి శ్రీరామమూర్తి—మూడు దశాబ్దాల తెలుగు నవలా సాహిత్యంలో అస్తిత్వవాద ధోరణులు 1947–77—భారతి—ఏప్రిల్—1978.



# 5. వివాహం : కథ

వెంకన్న పంతులు, రామ్మూర్తి అన్నదమ్ములు వెంకన్న పంతులు డిప్టీకలెక్టర్. సంప్రదాయవాది రామ్మూర్తి ఉపాధ్యాయుడు, సంస్కరణవాది. సంస్కరణవాదులతో అతివాది అందుకే తన కూతురురవణ రజస్వల కాకపోయినా, అయిందని నమ్మకం పుట్టించి, ఆగాంటి తన కూతురుకు ఇంకా పెళ్ళి చేయలేదని, ఇతరులకు చెప్పి తన సంస్కార దృక్పధాన్ని ప్రకటించుకొనేవాడు.

రామ్మూర్తి చనిపోయాడు. భార్య, కూతురు రవణ అనాధలయ్యారు. వీరికి ఆస్తి లేదు. వెంకన్న ఈ సంస్కర్త కుటుంబాన్ని పోషించి సమాజంలో తన కీర్తిని పోగొట్టుకోదలచుకోలేదు అయినా తమ్ముని కర్మచేసి, అతని కుటుంబాన్ని తన వెంట ఇంటికి వెంటబెట్టుకొనిపోక తప్పిందికాదు.

రవణ లోకజ్ఞానం తెలిసిన అమ్మాయి. అసలే "రిఫారం పిల్లను" ఎవ్వరు పెళ్ళి చేసుకోరనే భయంచేత తన భార్య మేనమామ జడ్జి వెంకట్రావుగారి దగ్గర ఉండి చదువుకొంటూన్న గోపాల్‌రావు అనే బీదపిల్లవానికి ఇచ్చి పెళ్ళి చేసి వెంకన్న పంతులు అతని పోషణ బాధ్యతను తాను వహించాడు. గోపాల్‌రావును మద్రాసులో ఓవర్సీర్ కోర్సు చదివిస్తున్నాడు. సెలవుల్లో ఇంటికి వచ్చిన గోపాల్‌రావును వెంకన్న ఇంట్లో అందరూ చవకగా చూడడం ప్రారంభించారు. రవణ తన భర్త దయనీయమైన పరిస్థితిని గమనించి బాధపడింది. గోపాల్‌రావు సెలవులై పోగానే మద్రాసు వెళ్ళాడు.

డిసెంబర్ సెలవుల్లో వెంకన్న బావమరది సుబ్బారావు వచ్చాడు. ఇతడు భావకవి తన కవిత్వాన్ని వినిపించి రవణను ఆకర్షించే ప్రయత్నాలు చేసాడు. ఇతని ప్రవర్తన ఆమెకు అర్థం కాలేదు. ఒకనాడు అర్ధరాత్రి ఆమెను పట్టబోయి విఫలుడైనాడు.

ఎండాకాలపు సెలవులలో గోపాల్రావు వచ్చాడు. ఈసారి పిల్లలు పెట్టే అల్లరి సహించక గోపాల్రావు వారిని కొట్టాడు. దానికి ప్రతీకారంగా పిల్లలు అతని పుస్తకాన్ని

వివాహం—ఎమెస్కో ప్రచురణ—1971.

చించారు వెంకన్న పంతులు పుస్తకం ఖరీదు ఇవ్వక పై పెప్పు నాలుగు చీవాట్లు పెట్టాడు గోపాలార్రావుకు ఇంట్లో ఉండడం భరించరానిదైంది. రవణ అతనికి సహాయం చేయాలనే తలంపుతో ఇకపై రూపాయలను చినిగిన పుస్తకంలో ఉంచింది కాని ఆ దొంగతనం గోపాలార్రావుకు చుట్టుకొని, అతనిని మరింత క్రుంగదీసింది.

ఫిబ్రవరి నెలలో రావమ్మ మళ్ళీ పురుడు పోసుకున్నది. ఆ పరిస్థితుల్లో రవణను వెంకన్నపంతులు పట్టబోయి విఫలుడైనాడు.

వెంకటార్రావు, రవణ, గోపాలార్రావును బందరు తీసికొని వెళ్ళాడు. వారువెళ్తున్న రైళ్ళో రవణ గోపాలార్రావులు ఎన్నో సౌందర్య స్పర్శానుభూతులను పొంది, మధుర స్వప్నాలలో తేలియాడారు. బందరులో రవణను, వాళ్ళ నాన్న స్నేహితులు, విద్యార్థులు వచ్చి చూచి వెళుతుంటె గోపాలార్రావు సహించలేదు. రవణకు తన గురించి, తన ప్రేమ గురించి బాధపడుతున్నాడని తెలియదు, కార్యంచేయమని గోపాల్రావు, వెంకట్రావుకు చీటీ వ్రాసాడు. దానికి తనవడగడమేమిటి, అదివారి ఇష్టమే అని వెంకట్రావు చెప్పాడు. గోపాల్రావు రవణతో ఏకాంతంగా మాట్లాడాలని ప్రయత్నించి విఫలుడై కొట్టి తామబాధపడ్డాడు.

వెంకట్రావు కూతురు అరవింద బందరువచ్చి స్వేచ్ఛగా వరిస్తుంటే గోపాల్రావుకు నచ్చలేదు. ఈ మధ్య అరవింద స్నేహితుడు వాగ్లే అతిధిగా వచ్చి ఉన్నాడు. క్రమంగా అరవిందతోపాటు రవణ కూడా అతనిసేవలోనికి వెళ్ళిపోయింది. రవణ ఈ ప్రవర్తనను గోపాలార్రావు సహించలేక పోయాడు. తండ్రి కూడా అరవింద స్వేచ్ఛాప్రవృత్తికి అడ్డుపడలేదు అరవింద రవణని గోపాలార్రావు దగ్గరినుండి లాక్కెళ్ళి వాగ్లేతో పడవ షికారు చేస్తుంటే సహించక బాధపడ్డాడు.

రవణ ఇంటికి వచ్చిన తరువాత తిట్టి ఆమె జుట్టు లాగి మీదపడి గోపాలార్రావు కొట్టాడు. ఇంతలో వాగ్లే వచ్చి రవణను ఆదుకొని గోపాలార్రావును తన్నాడు అప్పుడు వాగ్లే నుండి రవణ విడిపించుకొని గోపాలార్రావుకు అడ్డుపడింది. వాగ్లే మాటలను తిరస్కరించి గోపాలార్రావుతో ఉండిపోయింది.

మరునాడు వెంకట్రావుగారు రవణ గోపాల్రావుల కాపురాన్ని పట్నంలో పెట్టించాడు.

ఇది, చలం గారి ఐదవ నవల. రచనాకాలం 1928.



# వివాహం : విషయ విచారణ

మిగతా నవలలలో వివాహ వ్యవస్థను ధిక్కరించిన చలం స్త్రీ పాత్రలవలెగాక, ఈ నవలలో 'రవణ' పాత్ర వ్యవస్థకు తలఒగ్గిభర్తను ఆకట్టుకొనటానికి సహజంగా ప్రయత్నించింది. స్త్రీలో నున్న వ్యవస్థాపరమైన ప్రవృత్తిని రవణ పాత్రద్వారా చూపాడు. ఆ ప్రవృత్తిని అర్థం చేసుకోలేక గోపాలావు వ్యవస్థవల్ల వచ్చిన అధికారం చేత ఆమె ఎడల నీచంగా ప్రవర్తించాడు. అయినప్పటికి భార్యా భర్తలు పరస్పరావగాహనతో వ్యవస్థలో ఇమిడి పోవాలన్న విషయాన్నే చలం ఈ నవలద్వారా చెప్పదలచిన విషయం.

ఇంతేగాక చలం ఆనాటి సమాజంలో ఉన్న ఛహానా సంప్రదాయవాదుల, తీవ్ర సంస్కార వాదుల అసంబద్ధ దృక్పథాలు వివాహవ్యవస్థలో ఎంత అశాంతిని, అలజడిని కలుగచేస్తాయో ఈ నవలలో చూపాడు.

స్త్రీ స్వేఛ్ఛ జీవితంలో ఎలాంటి అక్రమమార్గాలకు దారి తీస్తుందో అరవింద–వాగ్లీల సంబంధం ద్వారా తెలిపాడు.

ప్రధానంగా పై మూడు అంశాలు వివాహ వ్యవస్థను భంగపరుస్తవనే విషయాన్ని తెలుపడానికే చలం ఈ నవలను వ్రాసాడు.

ఈ నవలలో ప్రధాన పాత్ర, నాయిక రవణ. ఈమె తండ్రి రామ్మూర్తి తీవ్ర సంస్కరణాభినివేశంతో, తాను సంస్కరణోద్యమంలో భాగమై పేరు సంపాదించుకోవాలనుకునే కీర్తి కండూతికలవాడు. ఈయన ప్రవర్తనలో ఆనాటి సంస్కరణవాదుల ఉన్మాదాన్ని ధ్వనింప చేస్తున్నాడు చలం. 'రామ్మూర్తికి ఏం సంస్కరణం చేద్దామాఅనే విచారం కలిగింది. వితంతు వివాహం చెయ్యాలంటే ముసలి తల్లినెవరూ పెళ్ళి చేసుకునేట్టులేరు, ఆ బావలెవరు చచ్చి చెల్లెండ్లు వితంతువులు కాలేదు. కూతురికింకా పెళ్ళేకాలేదు. కనక వితంతు వివాహం సంస్కరణం లాభం లేదని, రజస్వలానంతర వివాహం పట్టు

పట్టాడు. అతని కూతురు రవణకి పదమూడేళ్ళు వొచ్చాయి. రజస్వల అయిందనే అందరి నమ్మకమూ, కాకపోయినా, అయిందనే నమ్మకం పుట్టించేవాడు అతను"(పుట-9) ఇత నికి ఇటువంటి సంఘ సంస్కరణ పిచ్చి పట్టిన తరువాత 'ఇంపాసిబిల్' వ్యక్తి అయ్యాడు. ముఖ్యంగా తన అన్న వెంకన్నపంతులికి కూడా. సంఘసంస్కరణోద్య మంలో దిగి కుటుంబాన్ని నిర్లక్ష్యం చేసి ఏమీమిగల్చకుండా భార్యా బిడ్డలను అనాదల ను గా చేసి చచ్చి పోయాడు. ఇట్లా రవణ అనాధ పిల్ల కావడానికి రామ్మూర్తి పిచ్చి సంస్కరణా దృష్టి హేతువైంది. వెంకన్నకు తమ్ముడంటే అతని కుటుంబం అంటే అసహ్యం ఏర్పడటానికి కారణమైంది.

రామ్మూర్తి మరణానంతరం రవణ తన తల్లితోను పెదనాన్న అయిన వెంకన్న పంతులు ఇంట్లో బ్రతుకవలసి వచ్చింది తన తండ్రి ఎంత నిరర్థక సంస్కరణవాదియో, పెద తండ్రి అంత కుహనా సంప్రదాయవాది. కాని సంప్రదాయం వెనక కావలసిన హేతువాద బలం లేనివాడు. కేవలం తాను సంప్రదాయవాదినని నలుగురిలో చెప్పుకొని మురియటానికే గాని దాన్ని అనుసరించే సహజ విజ్ఞానం లేనివాడు, నలుగురేమనుకుం టారనే భీతిచేత తమ్ముని కుటుంబ భారాన్ని మీదవేసి కొన్నాడు పెద్దలు సంస్కరణ వాదియైన తమ్మునికి శాస్త్రప్రకారం కర్మచేసి తీరాలంటే ఇష్టంలేకున్నా కర్మచేసాడు. సమాజం ఏమనుకుంటుందోనని, తన కీర్తికి ఎక్కడ కళంకంవస్తుందోనని రవణను, ఆమె తల్లిని చేరదీసాడు. రవణ చక్కగా ఇంటిపనులన్నీ చేస్తుంది కాబట్టి ఆమెను భర్త గోపాలాప్రవుతోపంపే ఉద్దేశ్యాన్ని వెంకన్న మానుకొన్నాడు. ఇట్లా రవణ సంస్క రణ పిచ్చి ఉన్న తండ్రిని కోల్పోయి కుహనా సంప్రదాయవాదియైన వెంకన్న ఇంట్లో చేరింది.

రవణ మంచి సంస్కారం కలిగిన అమ్మాయి. తండ్రికి అనేక పుస్తకాలు చదివి పెట్టింది. తండ్రి దగ్గరికివచ్చే పెద్దవారందరూ ఈమెను పల్కరించిపోయేవాళ్ళే. చలం పుస్తకాలు గూడా చదివింది. స్వతంత్రాలోచనలుగల వ్యక్తిత్వంగలది. చలం పుస్తకాలు చదివిన రవణని ఇంట్లో భరించడం ఎట్లా అనే భయం మొదట వెంకన్న దంపతులకు పట్టుకుంది. కాని రానురాను వెంకన్నకు, భార్య రావమ్మకు తలలోని నాలుకలాగా ప్రవర్తించింది. ఇప్పుడు రవణని విడిచి ఉండడమంటే వారికిచాలా కష్టంగా ఉంది. అలా వారందర్నీ ఆకట్టుకొంది రవణ.

ఇట్లాంటి 'రిఫారం' అమ్మాయిని ఎవరైనా పెళ్ళి చేసుకుంటారో, లేదో, ఒకవేళ చేసుకున్నా బోలెడంత కట్నం పోయవలసి ఉంటుందని భావించి తన భార్య మేనమామ జిల్లా జడ్జి వెంకటార్రావుగారి వద్ద చదువుకుంటున్న బీద విద్యార్థి గోపాలార్రావుకు చదువు చెప్పిస్తే చాలుననే నియమం మీద రవణని అతనికి ఇచ్చి గుళ్ళో పెళ్ళిచేసి చేతులు కడుక్కున్నాడు, వెంకన్న పంతులు, ఏదో విధంగా ఆడపిల్ల పెళ్ళిచేసి చేతులు కడుక్కోవాలనే మధ్య తరగతి సమాజ మనస్తత్వాన్ని వెంకన్న పాత్ర ద్వారా చలం తెలియజేస్తున్నాడు.

వెంకన్న, భార్య రావమ్మ గోపాలార్రావును అల్లునిగా మర్యాదగా చూడలేదు. బీదవాడు కాబట్టి వెంకన్న దయాదాక్షిణ్యాల మీద బ్రతుకుతున్నాడు కాబట్టి గోపాలార్రావుకు అల్లుని దర్జా రాలేదు. వెంకన్న కొడుకులు నారాయణ, నరుసులకు కూడా అతడు లోకువై పోయాడు. ఆ ఇంట్లో అతని జీవితం దుర్భరమై పోయింది. వెంకన్న నిర్లక్ష్యవైఖరిని ఎదుర్కోవాలనుకున్నాడుగాని, బీదతనంవల్ల, పిరికితనంవల్ల మాటలు బయటికి రాలేదు. గోపాలార్రావు మీద సానుభూతి రవణకు, అతని తల్లికి మాత్రమే ఉంది. గోపాలార్రావును నీచంగా ఇంట్లో ఉన్నవారు చూస్తుంటే రవణకు బాధ వేసింది. అతని మీద సానుభూతి చూపింది దీనికి వివాహబంధమే కారణమని చలం చెప్పదలిచిన విషయం. 'పెళ్ళికాగానే ఆ గోపాలార్రావు, తనూ వొకటనీ, అతను తనవాడనీ ఆమె మనసులో యేర్పడ్డది— అతనికి న్యూనత కలిగితే తనకి కలిగినట్టుంది.' (పుట—23). ఇది రవణకు వివాహంవల్ల ఏర్పడిన సంస్కారం. గోపాలార్రావుకు చదువు కొరకు చెన్నపట్నం వెళ్తుంటే రవణకి కళ్ళంబడి నీళ్ళు తిరిగాయి. ఏదో స్నేహబంధాన్ని వీడిపోతున్నట్లు అతనికి తోచింది. ఇలా వీరిలో వివాహ వ్యవస్థ ప్రేమ, మమత, సానుభూతుల్ని చిగిరింపచేసిందని చలం చెప్పదలచిన అంశం.

చిన్నతనంలో కార్యం చేస్తేనే నైతికంగా మంచిదని క్లబ్బుల్లో చెప్పే వెంకన్న పంతులు రవణ—గోపాలార్రావుల కార్యానికి విముఖుడై, కార్యంచేస్తే చెన్నపట్నంలో ఇద్దర్నీ పోషించాల్సి వస్తుందన్న లోభగుణంచేత; అలాచేస్తే చదువుకు ఆటంకం కలుగుతుందని తిరస్కరించాడు. ఇలా, వెంకన్న పంతులు లోభగుణంచేత, స్వార్థబుద్ధిచేత; వారి వివాహ బంధాన్ని సాఫల్యంచేసే కార్యాన్ని తిరస్కరించాడు. వివాహ వ్యవస్థలో భార్యాభర్తల వయస్సును, వాంఛలను గ్రహించి, అవి నెరవేర

డానికి మార్గం సుగమంచేసే బాధ్యత పెద్దలదనీ. ఆపని సరియైన సమయంలో చేయక పోతే వారి మనస్సులు చెడి అపమార్గాలను బట్టి వివాహబంధం విచ్ఛేదం కావచ్చునని చలం హెచ్చరిస్తున్నాడు. దీనిని స్ఫురింపజేయడానికి చలం రెండు సంఘటనలను నవలలో కల్పించాడు. అందులో ఒకటి; వెంకన్న బావమరిది, భావకవియైన సుబ్బారావు తన సరస కవిత్వంతో రవణని ఆకర్షించి అనుభవించాలని చూడడం. సుబ్బారావుకు పెళ్ళి అయింది. పిల్లలు గూడాఉన్నారు. ఇటువంటి సుబ్బారావుకు రవణను అనుభవించాలనే దృష్టేగాని, ఆమె బరువు బాధ్యతలను సామాజికంగా భరించే దృష్టి లేదు. అందుకే చలం ఇతనిని గూర్చి "ఈ కవి కుమారుడికి అంతరాత్మ తక్కువ. సంఘ బంధనాలు అంటవు. కాని యితని స్వేచ్ఛా విహారం వల్ల కలిగే బాధ్యతలను మాత్రం వహించడు. పరస్త్రీ హృదయాన్ని జయించి, శరీరాన్ని అనుభవించి, సంతానాన్ని కటాక్షించే వరకే యితని బాధ్యత. ఆ స్త్రీ పడే బాధలూ, ఆ సంతాన పురోభివృద్ధి, ఆ పరమేశ్వరుడి బాధ్యత. కావలిస్తే ఆమెకి తమ కల్పించిన అశ్రుధారల మీద రెండు గీతాలు వ్రాస్తాడు" (పుటలు-33-34) ఈ విధంగా కాల్పనికుల ప్రేమలో కామంలో సామాజిక బాధ్యత కొరవడిన తత్వాన్ని చలం గర్హించడం గమనార్హం. యవ్వనంలో ఉండి ఇంతవరకు వాంఛ తీరని స్త్రీ మనస్సు నిద్రావస్థలో సామాజిక బాధ్యతను మరిచే స్థితిలో ఉంటుంది. జాగృతావస్థలో సమాజంలో మనసు మీద ఉన్న ఆధీనం ఏకాంతంలో, నిద్రావస్థలో ఉండక సహజాతాలు పురుషుని పొందుకోరే పరాధీనతలో ఉంటాయి అందుకోసమే ఆ రాత్రి అతడు ఆమెను పట్టినపుడు ఎవరని బిగ్గరగా అరవగానే వెళ్ళి పోయాడు గాని, ధైర్యంతో ఆమెను పట్టినట్లైతే చిక్కేది. అందుకే అతడు వెళ్ళిపోతూంటే చీకట్లో అరచిన తరువాత చేయి చాచింది. అతడు చూడకుండా వెళ్ళిపోతుంటే నిట్టూర్పు విడిచింది. వివాహంలో పెద్దలు కార్యం చేసి యువతుల శారీరక అవసరాలను తీర్చే విషయం ఆలోచించకపోతే వాళ్ళు వ్యభిచరించే అవకాశం ఉందని చలం ఈ సంఘటన ద్వారా తెలియజేస్తున్నాడు. ఇంత కన్న విచిత్రమైన గర్హనీయమైన మరొక సంఘటనను గూడా చలం కల్పించాడు. రవణ పెదనాన్న వెంకన్నపంతులే ఆమెను అనుభవించడానికి పూనుకోటం. కాని ఆమె విదిలింపుతో వదలి పెట్టాడు ఈ విషయం ద్వారా పురుషుల మనస్సు సామాజిక స్పృహ లేకుండా వావివరుసలు లెక్కచేయని ప్రమాదకరమైన స్థితిలో ఉంటుందని. అది ఏకాంతంలో వ్యభిచరించే లక్షణం కలిగి ఉంటుందని చలం తెలియజేయదలిచాడు.

మొదటి సంఘటన ద్వారా రవణకు వాంఛ కలిగినపుడు భర్త ఉంటే సరిపోయేది అని తెలియజేయదలిచాడు. అట్లా లేనపుడు రాగల ప్రమాదాన్ని చలం స్ఫురింపచేసాడు రెండవ సంఘటనలో వెంకన్న పంతులువంటి వయసు మీరినవాడు, సంప్రదాయవాది, బాధ్యత కలిగిన వ్యక్తియే తన్ను మనికూతురు అనే సామాజిక నీతి కూడా లేకుండా ఆమెను అనుభవించడానికి ప్రయత్నించాడు అతనికి కోరిక గలగగానే భార్య ఉంటే ఇంత అఘాయిత్యం జరిగి ఉండేదికాదు. ఇతని ప్రవృత్తిని గూర్చి చలం ఇలా చెబు తున్నాడు. "లోకం ప్రకారం దుర్నీతి అతనిలో యేమీ లేదు. ఆ ధ్యాసేలేదు. ఆ వాంఛ వచ్చినపుడు భార్య వుండేచాలు. కాని యింకా చావని కొన్ని రసభావాలున్నాయి. సౌందర్యపిపాస కొంచెంగా వుంది. అది ఈ రాత్రి విజృంభించింది. యేం చెయ్యాలని వుందో, యేం చెయ్యబోతున్నాడో అతనికే తెలీదు" (పుట–47) విధి వశాత్తున ఈ సంఘటన విఫలమైంది కాబట్టి సరిపోయింది లేకపోతే వివాహమైన రవణ భవిష్యత్తు చీకటిమయమయ్యేది పెద్దలు రవణ–గోపాలరావులకు కార్యం చేయనందువల్ల, వారి వయస్సుల్ని పరిగణించనందువల్ల అందులో ముఖ్యంగా వివాహితయైన రవణ జీవితాన్ని ధ్వంసం చేసే శక్తులు, పురుష మనస్తత్వాలు ఎలా వేచి యుండి కాటు వేస్తాయో చలం ఈ సంఘటనల ద్వారా తెలియజేస్తున్నాడు. ఆధునిక నవల మనో విశ్లేషణ ద్వారా మానవుల అవచేతనలోని సహజాతాల తత్వాన్ని ప్రదర్శిస్తున్నది. మానవుని ఆంతరంగిక మార్మిక సహజాతాలను చూపి జాగృతి వహింపచేయడానికి ఆధునిక నవల ప్రయత్నిస్తున్నది. 'ఇదంత' (Id) మానవుని లోపలి ప్రాథమిక జంతు ప్రవృత్తిని తెలుపుతుంది 'అహంత' (Ego) ఇదంత ప్రవృత్తిని నెర వేర్చడానికి ప్రయత్నిస్తుంది ఇవన్ని అనాగరక, ఆటవిక పశు లక్షణాలు ఇవి మనుష్యుల్లో కూడా ఉంటాయి అయితే జంతువుల్లో లేని వివేకం సామాజిక స్పృహ మనుషుల్లో ఉండి 'ఇదంత, అహంత' లను అదుపులో పెడుతుంది. దీనిని ఫ్రాయిడ్ మాయ 'Super ego' అన్నాడు. చలం వెంకన్నలో ఇదంత అహంత లక్షణాలను చూపి. వాటి అదుపులేని భయంకర స్వరూపం సమాజానికి నష్టం కలిగిస్తుందని చెప్ప దలిచాడు.1 అవచేతనలోని సహజాతప్రకోపాలు రహస్యంగా గంజాయి మొక్కల్లా పెరుగుతాయి మనిషికి వాటిని నాశనంచేసే సామాజిక దృక్పథం ఉండాలి. ఇది వ్యవస్థకు ప్రాణం

సామాజిక చైతన్యం

ఆర్థిక సాంఘిక దుస్థితివల్ల గోపాలా్రవులో ఏర్పడ్డ మానసిక పరాధీనతను చలం ఈ నవలలో చూపాడు. వెంకన్న ఇంట్లో పరాధీనపు బ్రతుకు బ్రతకడానికి అతని బీదరికమే కారణం. ఇంట్లో చిన్నల నుంచి పెద్దల వరకు అందరూ ఇతణ్ణి లోకువగా చూసేవాళ్లే. వాళ్ళను ఎదుర్కొనే శక్తి లేదు. పిరికితనం కూడ ఇతడిలో ఉంది. ఇతవిని అప్పమ్మ పిరికితనంతో పెంచింది. అప్పమ్మ కుటుంబ పరిస్థితులవల్ల, సామాజిక పరిస్థితులవల్ల పిరికి మనిషిగా తయారైంది. అప్పమ్మ వ్యక్తిత్వాన్ని పెండ్లికి పూర్వం తండ్రి, పెండ్లి తరువాత భర్త వికసించకుండా అణచిపెట్టేసారు. తన భర్త చెల్లెలి పునర్వివాహంవల్ల ఆమె పేరెత్తితే అప్పమ్మ నోటిని సమాజం నొక్కి వేసింది. ఈమె పిరికితనంతో గోపాలా్రవును పెంచడంవల్ల అతని ప్రవర్తనలో గూడా ఆ ఛాయలు గోచరిస్తాయి. ఈ విధంగా వీళ్ళిద్దరిలో పరాధీన మానసిక లక్షణాలను చలం చూపాడు.

ఇలాంటి గోపాలా్రవుకు, స్వేచ్ఛగా, సంస్కార వాతావరణంలో పెరిగిన రవణతో వ్యవహరించటం దుర్భరమైంది. ఇలాంటి పిరికివాడు కూడా భార్య అనగానే ఆమెమీద ఒక అధికారంతో వ్యవహరించాడు. అందరివద్ద బానిసలాగా ఉండి దాస్యాన్ని అనుభవించినప్పటికీ భార్య స్వేచ్ఛను భరించడు. గోపాలా్రవు వివాహ వ్యవస్థవల్ల వచ్చే అధికారంతో భార్యపై అధికారం చలాయించాడు 2 ఆమెను అర్థం చేసికోలేక, ఆకర్షించలేక, ద్వేషంతో లొంగదీసుకోడానికి కొట్టి, లాగి నానా హింసలు పెట్టాడు. అయినప్పటికి ఆమె సహించింది. భర్తయే తనకు సర్వస్వం అనేవిషయం ఆమెలో వ్యవస్థా సంస్కారంవల్ల గాఢంగా నాటుకొని పోయింది. "పెళ్ళికాగానే రవణయింక తనకి అతనే రక్షకుడు, నాధుడు అనుకుంది. కానిక్రమంగా అతని అసహాయత్వంచూసి, క్రమేపీ అతడే తన వాడైనట్లు, అతణ్ణి తనే రక్షించవలసినట్లు, ధైర్యమివ్వవలసినట్లు తోచింది. అతని హీనత్వమూ, నమ్రత, యాచకబుద్ధి, యితరులలో చూస్తే ఆమెకి పరమ అసహ్యం కలిగి వుండును, కాని తన భర్తలో కనబడితే ఆమెకి విచారమూ, దయా, ప్రేమా కలిగాయి" (పుట-40). ఈ విధంగా పవిత్ర వివాహబంధంవల్ల, భర్తలోని లోపాల వల్ల అసహ్యం కలగడానికిబదులు దయ, ప్రేమ కలుగుతుందని, ఇది దాంపత్య జీవితానికి ఆయువుపట్టు అని చలం తెలియచేయదలచాడు.

వెంకన్న పంతులు ఇంట్లో రవణ, గోపాలా్రవులకు పరస్పరం మాట్లాడుకునే అవకాశం లభించలేదు. పెద్దలు కల్పించలేదు. వెంకట్రావుగారి దగ్గర రవణతో స్వేచ్ఛగా

సంచరించవచ్చునని బందరు వెళ్ళాడు. రైళ్ళో వాళ్ళిద్దరు పరస్పరం స్పర్శించుకోడం లాంటి మధురానుభూతులను అనుభవించారు. భార్యాభర్తలలో సహజంగా ఉండే అవ్యాజానురాగానుభూతులను మునిమాణిక్యం తన కథలలో చెప్పిన ధోరణి ఈ పట్టున కన్పిస్తుంది. భర్త ముందు భార్యపడే సిగ్గు, అభిమానం, అభినయం, కళ్ళు తిప్పటం, మొదలైన శృంగార చేష్టలు భారతీయ స్త్రీలలో సహజంగా ఉంటాయని, రైళ్ళో వీళ్ళకు తారసపడ్డ ఇంగ్లీషు దొర భావిస్తాడు. పాశ్చాత్యులకు భారతీయ స్త్రీలలో కన్పించే సౌందర్యం తమ దేశ స్త్రీలలో కన్పించదని భావించే దృక్పథాన్ని ఆ ఇంగ్లీషు దొర ద్వారా చలం ఇలా చెప్పిస్తాడు 'ఇట్లాంటి సిగ్గు నాకు కొత్తగావుంది. నేనీదేశంలో దిగి యింకా మూడు రోజులు కాలేదు. ఈ అమ్మాయిని చూస్తే ముచ్చటేస్తుంది. ఆ బట్ట కట్టుకోడం చాల బావుంది. ఎంత నెమ్మదిగా కూచుంటారూ! చక్కగా ఏదో సాధు మృగంమల్లె నడుస్తారు. ఈ యీడువాండ్లు మా పిల్లలైతేనా యీ పాటికి బండిని సగం విరగగొట్టేవారు.' (పుట—57) ఇలా గోపాలార్రావు తన భార్యలోని సౌందర్యాన్ని చూడలేదు. ఇంగ్లీషు దొర సౌందర్య దృష్టికి గోపాలార్రావు తన భార్యను ఎత్తుకొని పోడుగదా అనే జెలసీతో భయపడ్డాడు. గోపాలార్రావులో స్త్రీని ఆకర్షించే లక్షణాలులేవు. వాటిని కలిగి ఉండటానికి, ప్రయత్నం కూడా చేయడు. భార్య, వ్యవస్థాధర్మం వల్లనే లోబడుతుందనే అభిప్రాయం కలవాడు. స్త్రీని ఆకర్షించే నేర్పు పురుషుడు ఎలా కలిగి ఉండాలో చలం 'స్త్రీ'లో చెప్పాడు.[3] చురుకైన మాటలు, ధైర్యం, లోకజ్ఞానం మొదలైన గుణాలులేని గోపాలార్రావు భార్యవ్యవస్థాబలంచేతనే లోబడాలనుకున్నాడు. ఈ గుణాల్ని అభిమానించే రవణ; ఇవిలేని భర్తను వ్యవస్థాధర్మంచేత ప్రేమిస్తూనే ఉన్నది. అతడు పడుతున్న బాధను చూస్తున్నది. కాని అది దుర్భరమని, తన కొరకే అని తెలియలేనిది. ఆ బాధ అంతా తనమీది ప్రేమవల్లనే అని ఆనందించింది. స్త్రీ ఎంతసేపటికి తన ఆనందాన్ని దాచుకొని ప్రేమ ఉందికదా అని సంతోషిస్తుంది. పురుషుడు ముఖ్యంగా గోపాలార్రావు లాంటి వాడు మీదికి ఉరకాలనుకుంటాడు. అతని వద్ద లభించే ఆనందం ఇంకా ఆమె ఎరగదు.భర్త నేర్పిందాకా తెలుకోలేదు. కార్యం చేసి అటువంటి అవకాశం పెద్దలు కల్పించలేదు. ఈమె మనస్తత్వాన్ని తెలుసుకొని ప్రవర్తించే పరిజ్ఞానం అతనికి లేదు. రవణ మాత్రం సులభంగా లోబడకూడదనే దృక్పథంతో తనకు తెలియకుండానే వ్యవహరిస్తోంది. స్త్రీ సహజత్వాన్ని పురుషుడు వివాహవ్యవస్థలో తెలుసుకోవాలని. లేకుంటే స్వంతత్రవ్యక్తిత్వం కలిగిన రవణలాంటి

స్త్రీలతో వ్యవహరించడం అసాధ్యమైపోతుంది కార్యం చేయమని వెంకటావుగారికి గోపాలావు చీటీ వ్రాసినప్పుడు ఇతరుల స్వేచ్ఛను గౌరవించాలనే దృక్పథం కలిగిన అతడు ఇలా అన్నాడు "మీ యిద్దరూ మా అతిధులు స్వతంత్రులు, ఇద్దరికి యిష్ట ముంటే యివాళే కలసి వుండండి, మా అభ్యంతరం యేమీలేదు నన్నడగడమెందుకు?" (పుట–62). అని అన్నాడు భార్యాభర్తల ప్రకృత్తులను సర్దటానికి ఒకే ఒక స్వేచ్ఛా సిద్ధాంతం అందరి ఎడల ఒకేలాగా ప్రవర్తింప చేయగూడదు. అతని స్వేచ్ఛా సిద్ధాంత దృక్పథం వీరి అశాంతిని తొలగించడానికి బదులు ఎక్కువ చేసింది. స్వేచ్ఛగాకలిసిపోయే మనస్తత్వం రవణకు లేదు స్వేచ్ఛగా ఆమెను ఆకర్షించి లోబరుచుకునే తెలివితేటలు గోపాలావుకు లేవు అందుచేతనే ఆమెను బంధించి, బాధించి లోబరుచుకోవాలనే ప్రయత్నాలు చేసాడు. ఆమె లోబడక పోయేసరికి ప్రేమ ద్వేషంగా మారింది. ఆమె బెట్టుసరి, ఇతనికోపం రెండూ సహజాతాలే అని తెలుసుకునే జ్ఞానం వీరిద్దరికి లేదు. వివాహ వ్యవస్థలో భార్యాభర్తలు తమతమ సహజ ప్రవృత్తులను తెలిసికొని, సవరించుకొని వ్యవహరించాలని, అప్పుడే శాంతి లభిస్తుందని చలం చెప్పదలిచిన అంశం. అయితే రవణకు తాను చులకగాలోబడగూడదని, తద్వారా భర్త హృదయాన్ని కట్టి వేయాలని, తన వ్యక్తిత్వం విలువుకోవాలనే జ్ఞానం ఆమెకు తెలియకుండానే వచ్చింది ఆమె సులభంగా లోబడితే వివాహవ్యవస్థలో భర్తముందు చులకన అయిపోతాననే దృక్పథం స్త్రీలో తనకు తెలియకుండానే ఉంటుందని దాన్ని పురుషుడు గ్రహించాలని చలం హెచ్చరిస్తున్నట్లు కినబడుతున్నది. భార్య, భర్త హృదయాన్ని ఎలా ఆకర్షించాలో చలం 'స్త్రీ'లో స్పష్టంగా చెప్పాడు. 4 వానిని అనుసరించిన నాడే దాంపత్యం నిత్య నూతనంగా ఉంటుందని చలం భావన.

వెంకటావు కూతురు అరవింద, రవణను తీసికొని షికార్లుపోతూ స్వేచ్ఛగా తిరుగుతుంటే గోపాలావు సహించలేక పోయాడు. అరవిందలో స్వేచ్ఛను చూస్తే గౌరవమే కాని, అదే స్వేచ్ఛను రవణలో చూస్తే భరించలేడు. రవణతో మాట్లాడాలని తహతహ. ఆమె కలవడం లేదని బాధ. కాని కలిసినపుడు ఏం మట్లాడాలో తెలియదు. అరవింద పెళ్ళిచేసుకోనని చెబితే అతనికి సరదాగానే ఉంది గాని, ఆమె స్వేచ్ఛను తన భార్య ఎక్కడ అనుసరిస్తుందో అని అతని బాధ. అరవింద మిత్రుడు వాగ్లీ రావడం, వారితో కలిసి రవణ తిరగడం చూస్తుంటే అతని భార్య ఎక్కడ చెడిపోతుందోనని

భయం వెంకట్రావు ఇంట్లోని స్వేచ్ఛాజీవితం కన్నా; వెంకన్నపంతులు ఇంట్లోని స్వేచ్ఛ లేని జీవితంలోనే తన భార్య సురక్షితంగా ఉందని భావించాడు. తనలోని స్వార్థం కోసరం తన భార్యకు బానిసత్వమే మంచిదని భావించాడు. కాని రవణ వెంకట్రావు ఇంటి వాతవరణమే బాగుంది వీళ్ళిద్దరు వెంకట్రావు ఇంట్లోగాని, వెంకన్న ఇంట్లోగాని కలిసి ఉండి పరస్పరం అర్థం చేసుకోలేకపోయారు. వెంకన్నలోభగుణం, వెంకట్రావు స్వేచ్ఛా ప్రవృత్తి వీరిద్దరిని ఐక్యం చేయలేక పోయింది. పెళ్ళికాకముందే అరవింద, వాగ్లీలు ఒకరి మీద మరొకరు చేతులు వేసికొని తిరుగుతుంటే, రవణతనభార్య అయిఉండి కూడా తనతో తిరగనందుకు గోపాల్రావు బాధపడ్డాడు. అతడు రవణ లొంగనపుడు, ఆమెను దూషించి, విసిగి ఎవరిత్రోవవారిదే అని గోపాల్రావు అన్నపుడు. ఆమె అహం దెబ్బతిని వెళ్ళిపోతుంటే జుట్టుపట్టిలాగి తన్నాడు. ఇంతలో వాగ్లీ కల్పించుకొని రవణను వెనకేసుకొని అతణ్ని తన్నాడు. అప్పుడు రవణ బాధపడి తన భర్తకు సహాయంగా పోయి వాగ్లీని తిరస్కరించింది. ఈ విధంగా ఆమెలో స్థిరపడ్డ వివాహ సంస్కార చైతన్యం చేత కుహనా యోగి అయిన వాగ్లీ మోసం నుంచి రవణ తప్పించుకున్నదని చలం తెలియ చేస్తున్నాడు. అరవింద–వాగ్లీల స్వేచ్ఛాప్రవృత్తివల్ల, వాగ్లీ ఆకర్షణలో చిక్కుకున్న రవణను గోపాల్రావు వివాహవ్యవస్థవల్ల సంక్రమించిన జెలసీ చేత రక్షించాడు

వివాహ వ్యవస్థను వాగ్లీలాంటి కుహనాయోగ సాధకులు భంగం కలిగిస్తారు. సామాజిక దృష్టిలేని స్వేచ్ఛావాదం చేత అరవిందలాగా స్త్రీలు మోసపోయే అవకాశం ఉంది. వివాహ సంస్కార బలం ఉన్నప్పటికీ; వివాహం ఫలవంతం కావడానికి తగిన చర్యలు పెద్దలు తీసికొననప్పుడు స్త్రీ ప్రవృత్తి పై పై ఆకర్షణలకు లొంగే, ప్రమాదం ఉందని రవణ ప్రవర్తన ద్వారా చలం హెచ్చరిస్తున్నాడు. వెంకట్రావు స్వేచ్ఛా దృక్పథం, వెంకన్నలోభత్వం సుబ్బారావు కవిత్వం, అరవింద స్వేచ్ఛా ప్రవృత్తి, రవణ అమాయకత్వం, వాగ్లీ యోగం, రవణ–గోపాల్రావుల దాంపత్య జీవితానికి ఎలా భంగకరంగా తటస్థించాయో చలం ఈ నవలలో చూపాడు కాని, వెంకట్రావు తాటస్థ్యాన్ని అరవింద స్వేచ్ఛను, వాగ్లీ ఆకర్షణను చలం ప్రతిపాదించ దలచుకోలేదని భావించాలి [5] రవణ–గోపాల్రావుల ప్రవర్తనలో అప్పుడప్పుడు ఒడుదుడుకులు వస్తున్నప్పటికీ, వారిద్దరి మధ్య అన్యోన్యమన్నది తెగకుండా కాపాడ కలిగిన వివాహ బంధం చాల పటిష్ఠమైందని, పవిత్రమైందని నిరూపించడానికే చలం ఈనవలను వ్రాసినట్లు చెప్పవచ్చు.

సామాజిక చైతన్యం

## అ ధో జ్ఞా పి క లు :

1. "వివాహం నవలలో శృంగార భావనకి వావివరుసలు లేవని నిరూపించబడ్డది"
   —డా ఆరిపిరాల విశ్వం—తెలుగు నవల—మనోవిశ్లేషణ—తెలుగు నవల—నూరు సంవత్సరాలు (అకాడమీ ప్రచురణ)—పుట—79

2. "పురుషుడెంతటి నైచ్యమునైనను సహింపగలడు. ఎంతటి క్రౌర్యమునైనను భరించగలడు. ఎట్టిదైన్యమునైనను అనుభవింపగలడు కాని తన భార్య స్వాతంత్ర్యము నవలంభించుటను మాత్రము భరింపలేడు అని నిరూపించుచున్నాడు చలం 'వివాహం'లో"

   —డా పి. ఆనందారామం—సిద్ధాంతవ్యాస గ్రంధ వ్రాతప్రతి.

3. "స్త్రీ ప్రేమను నిలుపుకునేందుకు పురుషుడూ యింత జాగ్రత్తపడాలి. ఆమె ప్రేమని ఆకర్షించే లక్షణాలువేరు. ఆమె వలెనగలు, దేహాలంకారము అవసరము లేదు. కాని శుభ్రత, చురుకుదనమూ అవసరము. మాటలు, గుణాలు, ధైర్యం, లోకజ్ఞానం, పాండిత్యమూ మొదలైన గుణాలు ఆమె కోసమన్నా అతను అలవరచుకోవాలి."

   — స్త్రీ పుట—152.

4. పురుషుడికి స్త్రీ శరీరం తాకితే అపవిత్రమౌతుందేమో అన్నంత సుందరంగా కనబడాలి. మోకరించి భక్తితో పూజింపగల రసజ్ఞతా, సౌందర్యారాధనా వుండాలి.

   ఎప్పుడూ మారుతూ కొత్త రకాల భర్తహృదయం దినదినమూ నూతనంగా ఆకర్షించి జయించే నేర్పు వుండాలి, స్త్రీకి స్వతసిద్ధమైన అందం కన్నా యీ జీవకళ, యీ నేర్పుఅతి ముఖ్యం. పురుషుడి మనసుని ఆకర్షించడానికి, ఎప్పటి కప్పుడు తన లోకానుభవం చేత, తను బట్టలు ధరించే విధం, పాపిడి తీసుకునే తీరు, కళ్ళచూపుల నేర్పరితనం, వొంటివిరుపులు, మాటల మాధుర్యం, కంఠపు మార్దవత్వం, అన్నీ Study చేసి నేర్చుకొని ఉపయోగించాలి. ఇదంతా వేశ్యత్వ

మంటారు. ప్రేమలేనిదే యివన్నీ చూపడం వేశ్యాత్వం గాని, హృదయమిచ్చిన వాడ్ని రంజింప చెయ్యడానికి పూనుకోవడం యేమాత్రం కాదు.''

—స్త్రీ—పుట—148.

5. ''కూతులకు సంఘ సంస్కారమనెడి మిషచే స్వేచ్ఛపీయ గోరువారు కొంచెమాల స్యముగ గన్నుదెరచి పశ్చాత్తప్తులగుదురా? అరవింద విషయమున వెంకటరావు గారి తాటస్థ్యము దాని ఫలితము వంటివే రచయిత వాంఛించు చిరకాల వాంఛితములా''

—డా. బొడ్డపాటి కుటుంబరావు—ఆంధ్ర నవలా పరిణామము—పుట—349.



# 6. బ్రాహ్మణీకం : కథ

ఈ నవలలో నాయిక సుందరమ్మ. ఈమె పూర్వాచార బ్రాహ్మణ కుటుంబంలో పుట్టింది. ఈమె పేరుకు తగినట్లు ఆ వంశం వారు ధ్యానించే దేవతల సౌందర్యమంతా ఈమెలో దీపించిందా అన్నంత అందంగా ఉంది. ఈమె పుట్టింటి వారికి శాస్త్రాలు, వేదాంతం, పురాణ విజ్ఞానంతోపాటు దయ్యాలు, భూతాలూ మొదలైన అన్ని రకాల మూఢ నమ్మకాలు గూడా ఉన్నాయి. దేశమంతా కాలానుగుణంగా మారిపోతుంటే వీరు మాత్రం పాతపద్ధతుల్లోనే నిలిచిపోయారు. అందుచేత ఈమెకు లోకజ్ఞానం అబ్బలేదు. కాని ఈమెకు దయాగుణం సహజంగ వచ్చింది.

ఈమెను మేనత్త కొడుక్కిచ్చి ఎనిమిదవ ఏటనే పెళ్ళిచేసారు. ఇతడు మైసూరుకు వెళ్ళి ఆరేళ్ళు సంస్కృతాన్ని నేర్చుకొని వచ్చిన పండితుడు. చదువు ముగించుకొని వచ్చి భార్యతో కాపురం పెట్టాడు. పై గదిలో రెండేళ్ళు భార్యతో పాటు అహోరాత్రులు ఉంటూ లోకాన్ని మరచాడు. తత్ఫలితంగా జబ్బు పట్టుకుంది. వైద్యుడు భార్యతో కలువకూడదని చెప్పినా వినలేదు. ఇది పరికాదని సుందరమ్మను తండ్రి తన ఇంటికి తీసికొని వెళ్ళాడు. అయినా అతడు అత్తవారింటికివచ్చి సుందరమ్మ దగ్గరచేరాడు. సుందరమ్మ విధిలేక భర్త కోరికను మన్నిస్తూ వచ్చింది. తత్ఫలితంగా భర్త నిర్వీర్యుడై మరణించాడు.

భర్త పోయిన తరువాత సుందరమ్మ ఆరు మాసాలు అస్వస్థకు గురైంది. ఇంతలో దురదృష్టవశాత్తు తండ్రి మరణించాడు. భర్త ఆస్తిగాని, తండ్రి ఆస్తిగాని ఆమెకు లభించలేదు. ఆమె, ఆమె తల్లి అనాధలై ఆమె మేనమామ ఇంట్లో బ్రతకాల్సి వచ్చింది. మేనమామ వెంకట్రామయ్య గారింట్లో తమ ఆచారాలను వదలుకొని ఆధునిక నాగరిక వాతావరణానికి అలవాటు పడిపోయారు.

---

బ్రాహ్మణీకం—ఎమెస్కో ప్రచురణ—1969.

వెంకటాద్రియ్యగారి పదేళ్ళ కూతురుకు చంద్రశేఖరమనే యువకుడు సంగీతం నేర్పుతుండేవాడు. మామ, సుందరమ్మను కూడా పాఠాల దగ్గర కూచోమన్నాడు. ఏమీ వ్యాపకాలు లేని సుందరమ్మకు పాఠాలంటే ఇష్టమేర్పడింది. వీళ్ళిద్దరు ఇతరుల మీద ఆధారపడేవాళ్ళు కావడంచేత సహజంగా పరస్పర సానుభూతి ఏర్పడింది. చంద్రశేఖరం ఆమెను ఆకర్షించి లోబరచుకోవాలనుకున్నాడు. అతని ప్రయత్నాలలోని అంతరార్థం ఆమెకు స్ఫురించలేదు. అతనికి జ్వరం వచ్చినపుడు సానుభూతితో సుందరమ్మ సపర్యలు చేసింది. దానిని అపార్థం చేసికొని తన మీద ప్రేమ వల్లనే చేస్తున్నదని భావించాడు. అతని అసభ్యప్రవర్తనను ఆమెతనలోని జాలివల్ల సానుభూతివల్ల గర్హించలేకపోయింది. ఆమెలోని దయార్ద్రగుణంవల్ల ఆమెను చంద్రశేఖరం లోబరచుకున్నాడు. తాను అతనికి లోబడడం ఆమెకు బాధగా తోచింది. కాని చంద్రశేఖరం కాళ్ళుపట్టుకోవడం, బ్రతిమాలడం చేతను ఇంతకు పూర్వమే లొంగిపోవడం చేతను. లోపల సహజాతాలను అనుభవించాలనే కోరిక ప్రవృద్ధం కావడం చేతా, తరువాత కూడా చంద్రశేఖరానికి లొంగి పోవలసి వచ్చింది. కాని అంతరాత్మలో తన భర్తకు ద్రోహం చేస్తున్నాననే తలంపు రావడంతో కేక వేసి పడిపోయి చంద్రశేఖరాన్ని కలవరింపులో జ్ఞాపకం చేయడం వల్ల అతడు ఇంటినుంచి మాయమైనాడు. ఈమెకు లౌకిక జ్ఞానం లేదు. ఇంద్రియ సుఖాలను అనుభవించాలనే కోరిక అవచేతనలో ఉంది. భర్త తనను వెంటాడుతున్నాడనే ఒక మూఢవిశ్వాసం ఆమెలో ఉంది. వీని వల్ల ఆమె జీవితం నాశనమైంది.

సుందరమ్మ గర్భవతి కావడం తెలిసికొని వెంకటాద్రియ్యగారు చంద్రశేఖరంతో ఆమెకు వివాహం చేసాడు. కాని చంద్రశేఖరానికి వివాహం ద్వారా లభించిన సుందరమ్మ మీద క్రమంగా ప్రేమ సన్నగిల్లడం ప్రారంభమైంది. వివాహం కాక పూర్వం ఉన్నప్రేమ అతనికి ఇప్పుడు లేదు. ఆమెలో అతనికి అనేక లోపాలు కనబడుతున్నాయి. మొదటిది ఆమె వితంతువు. ఆమె బిడ్డను కన్నది. ఆ బిడ్డను పెంచే విధానం తెలియదు. వితంతువు వివాహం చేసుకొని బిడ్డను కనడం చేత చుట్టు ప్రక్కల అమ్మలక్కలు కూడా సానుభూతిని వహించి సహకరించ లేదు. ఇట్లా భర్త ఆదరాన్ని, సమాజ సానుభూతిని ఆమె కోల్పోయింది. తన ఈ బాధలకన్నిటికి పునర్వివాహమే కారణమని, ఆ పాపమే తననిట్లా బాధపెడుతున్నదని భావించింది. బిడ్డకు జ్వరమొస్తే దేవతలకు మ్రొక్కింది. గుడికి వెళ్ళితే ఒక పూజారి ఆమెను వితంతువని చీదరించుకొని కసిరి

కొట్టాడు. మరొకడామెను బలాత్కరించాడు. చచ్చినవాళ్ళు వెంటాడతారనే విషయం దివ్య జ్ఞాన సమాజికుని నుండి వినడంవల్ల, తాను పాపం చేసాననే భయం వల్ల ఆమెకు జ్వరం వచ్చింది. భర్తను దగ్గరికి రానివ్వలేదు. ఈ అశాంతితో చంద్రశేఖరం చీట్ల పేకాటలో మునిగి పోయాడు.

పిల్లకు జబ్బుచేస్తే మందుకు షాపుదగ్గరికి వెళ్ళి డబ్బు లేక తిరిగి వచ్చింది. ఈమెకు సహాకరిద్దామని ఆ మందు తీసికొని గవళ్ళ రామయ్య అనే తాలూకా బోర్డు ప్రెసిడెంట్, ఇంటికి వచ్చి "మీరెవరు" అని అడిగాడు. ఆమె "బ్రాహ్మలం" అని అంది. అతడు తాను డాక్టర్నని చెప్పి నమ్మించాడు. అతనిలోనున్న బ్రాహ్మణద్వేషం చేత ఆమెను అనుభవించాలనే కోరిక కలిగింది. ఆమెను కోరాడు. పిల్లను రక్షించుకోడానికి తన శీలాన్ని పోగొట్టుకుంది. చివరకు రావయ్య తాను డాక్టరును కానని చెప్పడంతో ఆమె రౌద్రిం వహించింది. వెనుకమున్న దీపం తాకి రామయ్య దగ్ధమయ్యాడు. సుందరమ్మ బిడ్డపై బడి మరణించింది. ఇట్లా ఆమె జీవితం విషాదాంతమైంది.

ఇది చలం గారి 6–వ–నవల. రచనాకాలం 1937.



# బ్రాహ్మణీకం : విషయ విచారణ

స్త్రీ తన పూర్వాచార పరాయణత చేత ఛాందస భావాలను జీర్ణించుకొని బ్రాహ్మణీకంలోని ఔన్నత్యాన్ని హేతువుద్వారా గ్రహించలేని అజ్ఞానం ఉండటంచేత జీవితాన్ని నిరర్థకం చేసికొంటుందనే విషయాన్ని తెలపడానికి చలం "బ్రాహ్మణీకం" అనే నవలలో సుందరమ్మ పాత్రను చిత్రించాడు.[1]

సుందరమ్మ కుటుంబం వాళ్ళు పూర్వాచార పరాయణులు. లోకమంతా ఏ ఏ విషయాలను కేవలం మూఢనమ్మకాలని భావిస్తుందో వాటిలో వారికి ప్రగాఢ విశ్వాసం. సుందరమ్మ కుటుంబంలోని వాళ్ళకు చచ్చిన వాళ్ళు దయ్యాలై కనబడతారు. వీళ్ళు వాళ్ళకు శాంతులు చేస్తారు. శాపం వల్ల స్త్రీలు వితంతువులవుతారని వాళ్ళకి గట్టి నమ్మకం. వాళ్ళకు పురాణాలు చెప్పటం, యాగాలు, పూజలు చేయటం తప్ప మరో సంగతి పట్టదు. పూర్వశాస్త్రాలు, వేదాంతం, పురాణజ్ఞానం తప్ప ఆమె మనస్సులో ఆధునిక లౌకిక జ్ఞానం లేదు. పూర్వ జ్ఞానం కూడా హేతువుతో కూడింది కాదు; భక్తి, విశ్వాసాల వల్ల కలిగింది. ఇలాంటి జ్ఞానం వల్ల ఆమెలో భూతదయా గుణం ఏర్పడింది. ఆమెలో సుగుణమూ, లోపం గూడా అదే. ఈమెకు సహజంగాఉన్న ఈ దయవల్ల అనేకసార్లు ఆచార పరతకు భంగం కలిగించి కుటుంబంలోని వాళ్ల మనస్సులకు బాధ కలిగించింది. అందుకు తానెంతో బాధ పడింది. తానెంత బాధనైనా భరిస్తుంది గాని ఇతరులకు అపకారం చెయ్యదు. ఈ గుణం ఉన్నతమైనదైనా ఆమె జీవితంలో అది అపకారాన్నే కలిగించింది. దీనికి కారణం ఆమెకు ఆధునిక విజ్ఞానం, సామాజిక చైతన్యం లేకపోవడమే. తత్ఫలితంగానే ఆమె పతనమైపోయిందని చెప్పడానికి చలం ఈ నవలను వ్రాసాడు.

పూర్వకాలంలో బ్రాహ్మణులు బ్రహ్మజ్ఞానంతో తమ జీవితాలను తీర్చిదిద్దుకున్నారు. వారి విజ్ఞానం హేతువు చేత వారి విశ్వాసాన్ని బలపరిచింది. ఆ విజ్ఞానం రామరామ హేతువుచేత రూపింపబడి, అధ్యయనం చేయబడి కాలానుగుణంగా జీవితంలో

సామాజిక చైతన్యం

ఉపయోగింపబడలేదు జీవితాన్ని కేవలం ఆచారాల రూపంలో, విశ్వాసం, భక్తిప్రప త్తులతో గడిపేవారికి, ఆధునిక సమాజంలో జీవితానికి హేతువు లేకుండా పరిపూర్ణా న్వయం కుదరదు. ఇటువంటి ఆచారపంతుల కుటుంబంలో సుందరమ్మ పుట్టింది. సుందరమ్మ అలాంటి ఆచారాలను మూఢంగా విశ్వసించి జీవితాన్ని విషాదాంతం చేసుకుంది మూఢాచారాలతో, ఆధునిక విజ్ఞానం, హేతుపూర్వకమైన ఆలోచనా సరళి లేకపోవడం వల్ల స్త్రీజాతి ఎలా కుప్రింగిపోతున్నదో చలం సుందరమ్మ పాత్ర ద్వారా చూపాడు.

సుందరమ్మ భర్త పండితుడు. కాముకుడు. ఈ కామాన్ని భార్య ద్వారా తీర్చుకున్నాడు. ఆమెను విడిచి ఒక్క క్షణం ఉండలేదు. అతనికి భార్యేలోకం. సుంద రమ్మకు భర్తేదైవం. అతని కోర్కెను తీర్చడమే తన జీవితాశయంగా భావించింది భర్త అధిక విషయేచ్ఛ ద్వారా మరణాన్ని పొందాడు భర్త విషయేచ్ఛకు తాను లొంగిపోవడం వల్ల రాగల పరిణామాలను ఊహించే దృక్పథం లేదు. "ఏమే, నీ మొగుడికి బతకాలని లేదా యేమిటి? ఏదో వొకటి చెప్పండి, బోలెడు డబ్బుపోసి ఆ మందులు కూడ ఖర్చెందుకు?" (పుట–11) అని ఆమె తండ్రి అన్నపుడు సుందరమ్మ "లాభంలేదు, నాన్నా! ఆయన నాకుదక్కరు ఆ సంగతి ఆయనకీ తెలుసు. జాతకంలో యింతకన్న ఆయుస్సు లేదు. ఆయనకి నేను కనబడక పోతే మరీ కొట్టు కుంటారు, ఆ నిమిషాన్నే ప్రాణం పోతున్నట్టు. కనబడితే సరేసరి కానీ నాన్నా, నాకర్మ ప్రకారం జరుగుతుంది. నువ్వు వూరికే చింతపడి ఏం లాభం? నా గతి తప్పించడం నీ తరమా?" (పుట–11) అని అంది దీనిని బట్టి కర్మఅంటే ఈమెకు ఉన్నతప్పుడు అభిప్రాయం వ్యక్తమౌతుంది. తాము ప్రవర్తిస్తున్న విధానం తప్పు అని, దాని పరి ణామం భీతావహమని తెలిసినా దాని నుంచి తప్పుకునే శక్తిలేక లోబడి పతనాన్ని ఆహ్వానించడమే కర్మ అని అనుకుంటున్నది. చలం ఇంతవరకు కామానికి లోబడి సామాజిక దృక్పథం లేక స్త్రీలు ఎలా పతనం చెందారో నవలలలో చూపాడు. ఈ నవలలో వ్యవస్థను, ఆచారాలను అర్థం చేసుకోలేని అజ్ఞానం చేత స్త్రీ ఎట్లా పతనమౌ తుందో చలం చెప్పదలచాడు. "వివాహం" అనే నవలలో "రమణ" పాత్ర వలె తన వ్యక్తిత్వాన్ని నిలుపుకుంటూ భర్త ఎడల ప్రేమ కలిగి ఉండే సహజ విజ్ఞానం ఈమెలో లేదు, దాని ఫలితంగానే సుందరమ్మ భర్తను కోల్పోయింది. భర్త పండితుడే. కాని అతనికి పాండిత్యం నిగ్రహశక్తిని ఇయ్యలేదు. పాండిత్యం అతనికి జీవితంలో ఉపయోగపడలేదు.

అలాగే పురాణ జ్ఞానం ఆమెకు ఉపయోగపడలేదు. పాండిత్యం, జ్ఞానం వెనుకనున్న సామాజిక దృక్పథం వారికి లేదు అందుచేత దాంపత్య జీవితాన్ని ఎలా గడపాలో వారికి తెలియదు. గ్రుడ్డిగా కామాన్ని నిరంతరం అనుభవించడమే భార్యాభర్తల పవిత్ర ధర్మమని వారు భావించారు దాంపత్య జీవితంలో స్త్రీ—పురుషులకు నిగ్రహశక్తి చాలా అవసరమని ఈ సంఘటన ద్వారా చలం స్ఫురింప చేస్తున్నాడు. 'స్త్రీ'లో నిగ్రహాన్ని, దాని అవసరాన్ని గూర్చి చలం నొక్కి చెప్పాడు.[2]

భర్త చచ్చిపోయిన తరువాత సుందరమ్మ జ్వరపడింది. చీకట్లో ఎవరితోనో రహస్యంగా మాట్లాడుతుంది. ఎవరినో తలచుకొని ఏడుస్తుంది. చచ్చిపోయిన వాళ్ళు ఇంటిచుట్టు తిరుగుతారని వారితో బ్రతికినవాళ్ళు మాట్లాడతారనే విశ్వాసమే ఆ విపరీత ధోరణికి కారణం. అలాంటి పిచ్చి మూఢనమ్మకం ఆమె మనస్సును పట్టి అదే నిజమని తలపింప చేస్తుంది. ఈ విధంగా ఆమె జీవితంలో చైతన్యం కొరవడింది.

సుందరమ్మ ఆమె తల్లి, వెంకటాద్రిమయ్య గారింటికి రైల్లో వెడుతున్నపుడు వారికి ప్రపంచ మనస్తత్వమెలాంటిదో తెలియవచ్చింది. సుందరమ్మకు విధవా వివాహ ప్రసక్తి తెచ్చినపుడు, వారి వంశాధిక్యం, విగ్రహాలను రైల్లో అందరూ తాకడం వల్ల క్రిందపడడం వల్ల దేవతల గౌరవం భంగపడినట్లు బాధ పడ్డారు, సుందరమ్మ అమాయకత్వంతో అజ్ఞానంతో సమాజంలో అడుగుపెట్టింది. లోకం ఎంత క్లిష్టమైందో, ఆమె హృదయం ఎంత దయార్ద్రమైందో చలం ఈ విధంగా చెబుతున్నాడు. "జీవితం ఆ మూల రక్షణలోనున్న శిష్టాచారపరురాలిని, సుందరమ్మని, మోసగాళ్ళు, కూరులు, నీచులు, ఆచారరహితులు, నూతన విద్యాపండితులు, ధనాన్వేషణా పరులుండే యీ క్లిష్టమైన లోకం మధ్య పారేసింది. ఏమాత్రమూ కరుణ లేకుండా తామరపువ్వును ముళ్ళ కంచెల మధ్య పెద్ద గాలి పడవేసినట్లు" (పుట—20).

సుందరమ్మ ఆచారం, ప్రవర్తనవెనుక హేతువాద దృక్పథం లేదు. అందుచేత ఆచారాన్ని గుడ్డిగా అనుసరించడానికెట్లా వీలుపడిందో, వదలుకోవడానికి కూడా అలాగే వీలుపడింది. అందుకోసమే వెంకటాద్రిమయ్యగారింట్లో ఆమె ఆధునిక వాతావరణానికి సులభంగా ఒదిగి పోయింది. 'సుందరమ్మ ఆచారమంతా అలవాటేగాని, ఒక్కటీ ప్రిన్సిపల్ కాదు. కనక కొత్త వాతావరణంతో చాలా తొందరగా 'ఎడజస్ట్' అయి పోయింది.' (పుట—21) భర్త కామానికి లొంగిన సుందరమ్మలో జాలి, దయా

ఉపయోగింపబడలేదు జీవితాన్ని కేవలం ఆచారాల రూపంలో, విశ్వాసం, భక్తిప్రప త్తులతో గడిపేవారికి, ఆధునిక సమాజంలో జీవితానికి హేతువు లేకుండా పరిపూర్ణా న్వయం కుదరదు. ఇటువంటి ఆచారవంతుల కుటుంబంలో సుందరమ్మ పుట్టింది. సుందరమ్మ అలాంటి ఆచారాలను మూఢంగా విశ్వసించి జీవితాన్ని విషాదాంతం చేసుకుంది మూఢాచారాలతో, ఆధునిక విజ్ఞానం, హేతుపూర్వకమైన ఆలోచనా సరళి లేకపోవడం వల్ల స్త్రీజాతి ఎలా కృంగిపోతున్నదో చలం సుందరమ్మ పాత్ర ద్వారా చూపాడు.

సుందరమ్మ భర్త పండితుడు. కాముకుడు. ఈ కామాన్ని భార్య ద్వారా తీర్చుకున్నాడు. ఆమెను విడిచి ఒక్క క్షణం ఉండలేదు. అతనికి భార్యేలోకం. సుంద రమ్మకు భర్తే దైవం. అతని కోర్కెను తీర్చడమే తన జీవితాశయంగా భావించింది భర్త అధిక విషయేచ్ఛ ద్వారా మరణాన్ని పొందాడు భర్త విషయేచ్ఛకు తాను లొంగిపోవడం వల్ల రాగల పరిణామాలను ఊహించే దృక్పథం లేదు. "ఏమే, నీ మొగుడికి బతకాలని లేదా యేమిటి? ఏదో వొకటి చెప్పండి, బోలెడు డబ్బుపోసి ఆ మందులు కూడ ఖర్చేందుకు?" (పుట–11) అని ఆమె తండ్రి అన్నపుడు సుందరమ్మ "లాభంలేదు, నాన్నా! ఆయన నాకుదక్కరు. ఆ సంగతి ఆయనకీ తెలుసు. జాతకంలో యింతకన్న ఆయుస్సు లేదు. ఆయనకి నేను కనబడక పోతే మరీ కొట్టు కుంటారు, ఆ నిమిషాన్నే ప్రాణం పోతున్నట్టు. కనబడితే సరేసరి కానీ నాన్నా, నాకర్మ ప్రకారం జరుగుతుంది. నువ్వు వూరికే చింతపడి ఏం లాభం? నా గతి తప్పించడం నీ తరమా?" (పుట–11) అని అంది దీనిని బట్టి కర్మఅంటే ఈమెకు ఉన్నతప్పుడు అభిప్రాయం వ్యక్తమౌతుంది. తాము ప్రవర్తిస్తున్న విధానం తప్పు అని, దాని పరి ణామం భీతావహమని తెలిసినా దాని నుంచి తప్పుకునే శక్తిలేక లోబడి పతనాన్ని ఆహ్వానించడమే కర్మ అని అనుకుంటున్నది. చలం ఇంతవరకు కామానికి లోబడి సామాజిక దృక్పథం లేక స్త్రీలు ఎలా పతనం చెందారో నవలలలో చూపాడు. ఈ నవలలో వ్యవస్థను, ఆచారాలను అర్థం చేసుకోలేని అజ్ఞానం చేత స్త్రీ ఎట్లా పతనమౌ తుందో చలం చెప్పదలచాడు. "వివాహం" అనే నవలలో "రవణ" పాత్ర వలె తన వ్యక్తిత్వాన్ని నిలుపుకుంటూ భర్త ఎడల ప్రేమ కలిగి ఉండే సహజ విజ్ఞానం ఈమెలో లేదు, దాని ఫలితంగానే సుందరమ్మ భర్తను కోల్పోయింది. భర్త పండితుడే. కాని అతనికి పాండిత్యం నిగ్రహశక్తిని ఇయ్యలేదు. పాండిత్యం అతనికి జీవితంలో ఉపయోగపడలేదు.

అలాగే పురాణ జ్ఞానం ఆమెకు ఉపయోగపడలేదు. పాండిత్యం, జ్ఞానం వెనుకనున్న సామాజిక దృక్పథం వారికి లేదు. అందుచేత దాంపత్య జీవితాన్ని ఎలా గడపాలో వారికి తెలియదు. గ్రుడ్డిగా కామాన్ని నిరంతరం అనుభవించడమే భార్యాభర్తల పవిత్ర ధర్మమని వారు భావించారు దాంపత్య జీవితంలో స్త్రీ–పురుషులకు నిగ్రహశక్తి చాలా అవసరమని ఈ సంఘటన ద్వారా చలం స్ఫురింప చేస్తున్నాడు. 'స్త్రీ'లో నిగ్రహాన్ని, దాని అవసరాన్ని గూర్చి చలం నొక్కి చెప్పాడు.2

భర్త చచ్చిపోయిన తరువాత సుందరమ్మ జ్వరపడింది. చీకట్లో ఎవరితోనో రహస్యంగా మాట్లాడుతుంది. ఎవరినో తలచుకొని ఏడుస్తుంది. చచ్చిపోయిన వాళ్ళు ఇంటిచుట్టు తిరుగుతారని వారితో బ్రతికినవాళ్ళు మాట్లాడతారనే విశ్వాసమే ఆ విపరీత ధోరణికి కారణం. అలాంటి పిచ్చి మూఢనమ్మకం ఆమె మనస్సును పట్టి అదే నిజమని తలపింప చేస్తుంది. ఈ విధంగా ఆమె జీవితంలో చైతన్యం కొరవడింది.

సుందరమ్మ ఆమె తల్లి, వెంకటామయ్య గారింటికి రైల్లో వెడుతున్నపుడు వారికి ప్రపంచ మనస్తత్వమెలాంటిదో తెలియవచ్చింది. సుందరమ్మకు విధవా వివాహ ప్రసక్తి తెచ్చినపుడు, వారి వంశాధిక్యం, విగ్రహాలను రైల్లో అందరూ తాకడం వల్ల క్రిందపడడం వల్ల దేవతల గౌరవం భంగపడినట్లు బాధ పడ్డారు. సుందరమ్మ అమాయకత్వంతో అజ్ఞానంతో సమాజంలో అడుగుపెట్టింది. లోకం ఎంత క్లిష్టమైందో, ఆమె హృదయం ఎంత దయార్ద్రమైందో చలం ఈ విధంగా చెబుతున్నాడు. "జీవితం ఆ మూల రక్షణలోనున్న శిష్టాచారపరురాలిని, సుందరమ్మని, మోసగాళ్ళు, క్రూరులు, నీచులు, ఆచారరహితులు, నూతన విద్యాపండితులు, ధనాన్వేషణా పరులుండే యీ క్లిష్టమైన లోకం మధ్య పారేసింది. ఏమాత్రమూ కరుణ లేకుండా తామరపువ్వును ముళ్ళ కంచెల మధ్య పెద్ద గాలి పడవేసినట్లు" (పుట–20).

సుందరమ్మ ఆచారం, ప్రవర్తన వెనుక హేతువాద దృక్పథం లేదు. అందుచేత ఆచారాన్ని గుడ్డిగా అనుసరించడానికెట్లా వీలుపడిందో, వదలుకోవడానికి కూడా అలాగే వీలుపడింది. అందుకోసమే వెంకటామయ్యగారింట్లో ఆమె ఆధునిక వాతావరణానికి సులభంగా ఒదిగి పోయింది. 'సుందరమ్మ ఆచారమంతా అలవాటేగాని, ఒక్కటీ ప్రిన్సిపల్ కాదు. కనక కొత్త వాతావరణంతో చాలా తొందరగా 'ఎడజస్ట్' అయి పోయింది.' (పుట–21) భర్త కామానికి లొంగిన సుందరమ్మలో జాలి, దయా

గుణాలున్నవి. భర్త తాను లేక పోతే ఎంత బాధపడి పోతాడో అనే ఆర్ద్ర గుణమే ఆమెను ఇంతవరకు తెచ్చింది. ఆ ఆర్ద్రగుణం చేత తన మేనమామ ఇంట్లో ఉన్న సంగీతపు మేష్టారు చంద్రశేఖరం అనే యువకునికి లొంగి పోయింది. ఆమెలోని జాలిని ప్రేమగా భావించి అనుభవించాడు. ఆమెమనస్సులో కామ వికారం లేదు. కాబట్టి చంద్రశేఖరం తన మీద కోర్కె కలిగి ఉన్నాడన్న విషయాన్ని గ్రహించలేక పోయింది. ఆమె ప్రవృత్తికి భర్త కనబడితేనే మనోవికారం కలుగుతుంది కాని ఇతరుల ఎడల లింగ భేదమే తెలియదు. స్త్రీ-పురుష సంబంధ వ్యవహారాలకు సంబధించిన విషయ పరిజ్ఞానం లేనందున కామాంధుడైన చంద్రశేఖరానికి లోబడింది. ఈ దుర్మార్గపు పర్యవసానం ఆమెకు తెలియదు. అసలు పర్యవసానం స్పష్టంగా తెలిసి, సామాజిక అవగాహన ఉంటేఅతనికి విముఖంగా ఉండటానికి ధైర్యంవచ్చేది. అక్రమ స్త్రీ-పురుష సంబంధంలోని సామాజిక పరిణామం ఆమెకు తెలియదు. తన భర్త ఎడల ద్రోహం చేస్తున్నాననే తలంపుచేతనే చంద్రశేఖరంతో తనకు ఏర్పడిన సంబంధాన్ని పాపంగా భావించింది గాని సామాజిక చైతన్య పరిజ్ఞానం చేతగాదు. ఇందుచేతనే తన సహజాతాల విషయంలో గాఢమైన నిగ్రహం లేక పోయింది. పాప భీతివల్ల ఆ అనుభవం విషయంలో తిరగబడింది, కాని సహజాతాల ప్రేరణచేత అతణ్ని కోరింది. ఆమెలోని దయాగుణం, లౌకిక జ్ఞానం లేనందువల్ల సహజాతాలకు ఎలా లోబడిందో, అదుపు లేని సహజాతాలు ఎంత బలవత్తరమో చలం ఈ సంఘటన ద్వారా స్ఫురింప చేస్తున్నాడు. తెలియక చేసినా, ఫలితాన్ని స్త్రీయే అనుభవింపవలసి వస్తుంది. వాని పరిణామాన్ని స్త్రీ ఉత్పత్తి మాతృక కాబట్టి భరించవలసి వస్తుంది. కాబట్టి ఈ విషయంలో స్త్రీకి జాగ్రత్త అవసరమని చలం ఈ విధంగా హెచ్చరిస్తున్నాడు. "ఏ నింద వచ్చినా స్త్రీకదా మొదట భరించవలసింది? ఆమె తన బాధ చెప్పుకున్నా తప్పు ఆమెదే అంటారు కదా! పురుషుడు దౌర్జన్యం చేసినా పవిత్రుడే: పతిత అయ్యేది ఆమేకదా! సృష్టితన ముద్రను ఆమె ఉదరం మీదనే కదా లిఖించేది." (పుట-32) ఫలితంగా సుందరమ్మ గర్భం ధరించింది. సమాజ సంస్కారం లేని పురుషుని కామానికి, పురుష స్వభావంలోని కాముకత్వాన్ని తెలిసికోలేని స్త్రీ దయా ప్రవృత్తి ఎలా బలియైపోయిందో సుందరమ్మ పాత్ర ద్వారా చలం చూపాడు.

సుందరమ్మ గర్భానికి కారకుడైన చంద్రశేఖరానితో ఆమెకు పెళ్ళి చేసి సమస్యను వెంకటాద్రియ్యగారు పరిష్కరించారు. వితంతు వివాహాలలో భార్యాభర్తలు

పరస్పరం అపార్థం చేసికొని జీవితాలను ఎలా నాశనం చేసికొంటారో చలం వీరి దాంపత్యం ద్వారా చూపెట్టాడు. పెళ్ళికి పూర్వం ఆమె కరుణాకటాక్షానికి తపించినవాడు, ఆమెను దేవతలాగా భావించినవాడు, పెళ్ళైన తరువాత ఆమెను నీచంగా చూస్తూ, ఆమెలో లోపాలు వెదకుతు ఆమెనుంచి గౌరవం రావాలని ప్రయత్నించాడు. ఆమె చేత ఎన్ని విధాల శరీర కష్టం చేయించుకోవాలో యోచించాడు. తనకు ఈ పెళ్ళివల్ల కష్టం తప్పిపోయిందని భావించాడు. ఈ విధంగా పురుషుడు వివాహవ్యవస్థా బలం చేత స్త్రీని ఎలా పతనదశకు లాగుతున్నాడో చలం తెలిపాడు. తనకాలంలో జరిగే వితంతు వివాహాల లోని సంకుచిత ప్రవృత్తుల్ని ఈ నవలలో చలం సహజంగా చూపాడు. వ్యవస్థలో స్త్రీ కట్టుబడి ఉంటూ తన ధర్మాన్ని నెరవేరుస్తున్నప్పుడు పురుషుడు ధిక్కరించి స్త్రీని నీచంగా చూసే ప్రవృత్తిని రచయిత హెచ్చరిస్తున్నాడు. సుందరమ్మ వ్యవస్థలో భర్త చంద్రశేఖరం మీద ఆధారపడి ఉండడంచేత, ఆమెకు దిక్కెవరు లేకపోవటం చేత ఆమెను నీచంగా చూడడంతోపాటు ఆమెపై అనుమానాలు గూడ సృష్టించుకొని తాను బాధపడ్తూ, ఆమెను బాధ పెట్టాడు. తనకన్నా ముందు ఎందరిని మోహించిందో, ఇంకెందరిని మోహించి తనను మోసం చేస్తుందో అనే అనుమానం అతనికి కలిగింది. ఆమె ఇప్పుడు అతనికి శత్రువైంది. తనను మోహంలో ముంచి మోసపుచ్చి రొంపిలోకి దింపిందని భావించాడు. ఆమె ఔన్నత్యాన్ని ధిక్కారంగా భావించి ఆమెను ఏడ్చేటట్టు చేయాలని భావించాడు.

ఈ పెళ్ళి సుందరమ్మ స్వభావానికే విరుద్ధం. అతనిని విధిలేక పెళ్ళాడి వాని దౌర్జన్యాన్ని సహించింది. భర్త ఎలాంటివాడైనా సేవ చేయాలనే భక్తి, నిశ్చలత్వం, విరక్తితో జడత్వం పొందింది. ఈ పతిభక్తి పెద్దల అభిప్రాయాలపై ఏర్పడిన నీతి వల్ల ఈమెలో ఏర్పడిందేగాని హేతువుచేతగాదు. సుందరమ్మవంటి సామాన్యులలో నైతిక దృక్పథం ఎలా ఏర్పడుతుందో చలం ఈ విధంగా చెబుతున్నాడు. 'ఎంతో జాగ్రత్తతో, ధైర్యంతో, విజ్ఞానంతో యోచించిన వారి మనసులలో తప్ప సాధారణపు ప్రజలనీతి అభిప్రాయాలన్నీ హేతువాదం మీద ఆధారపడి వుండవు. చిన్నప్పటి నుండి గౌరవనీయులయినవారు ఏ విధముగా తలుస్తున్నారో, దండిస్తున్నారో ఆ పద్ధతులమీద నీతిని గురించిన అభిప్రాయాలేర్పడుతాయి'. (పుట–56)

సుందరమ్మ తనలో సుప్తంగా దాగిఉన్న కామానికి లోబడింది. ఆమె దృక్ప థంలో పెద్దల అభిప్రాయాలవల్ల ఏర్పడిన నీతి, పాపం అనే విషయాలు ఉన్నవి.

కామం, నీతి, పాపాలను గురించి ఆమెలో హేతుబద్ధమైన, సామాజికమైన విచారణ లేదు అందువే ఆమె జీవితంలో పతనం చెందింది అంతేగాని ఆమె అనుకొన్నట్లుగా తాను వితంతువై మళ్ళ వివాహాన్ని చేసుకోవడం ద్వారానె ఈ బాధలు పొందిందని; ఇదే పాపమని భావించడానికి ఆమెలో సామాజిక దృక్పధం లేకపోవడమే ప్రధాన కారణం సంఘంలో కామం వ్యక్తిగతాంశమేగాక, సామాజికాంశం కూడా కామం వ్యక్తి—సమాజ అంశాల మధ్య సమన్వయించబడినప్పుడే సత్ఫలితాలనిచ్చి సుఖ సంతోషాలకు తావిస్తుంది ఈ అవగాహన స్త్రీలకు ఉండాలని సుందరమ్మ పాత్రద్వారా చలం ప్రబోధిస్తున్నాడు ఆనాడు సమాజంలో వితంతు వివాహాలను చేసికొన్న వారిని పురుషులతోపాటు స్త్రీలు గూడా నీచంగా చూసేవారు. ఆమె గర్భవతిగా ఉన్నపుడు భర్తగాని, బంధువులుగాని జరిపించాలిసిన సరదాలు జరిపించలేదు చిత్త సంస్కారంతో వితంతు వివాహాలకు ఫలప్రదం చేసుకొనే దంపతులు ఆనాడు తక్కువే 'ఇతరులు తమని దూషిస్తే ప్రజలు మూర్ఖత్వమని సంస్కర్తలు నవ్వుకుంటారు గాని ఆగ్రహపడరు తాము తమ జీవితంలో అవలంభించిన సంస్కరణం, ఆత్మ సంస్కారానికేగాక సంఘ సంస్కారానికి వినియోగపడుతోంది గనుక' వితంతు పునర్వివాహం వారికి చాల మందికి ఈ చిత్త సంస్కారంలెదు చాల మంది సంఘంలో గతిలేక భార్యకోసం వెలిపడ్డవారు, చాలా మంది స్త్రీలు కామాన్ని పరిపాలించుకోలేక భర్త అనే పేరుతో పురుష మృగం దొరికితే చాలునని ప్రపంచం మిద పడ్డవారు వారి సంస్కరణ లో వారికే విశ్వాసం లేదు కామంలో తప్ప (పుట—58) అని ఆనాటి వితంతు వివాహాలను గూర్చి చలం చెప్పిన విషయాలు చంద్రశేఖరం, సుందరమ్మకు వితంతు వివాహానికి కావలసిన చిత్తసంస్కారం లేదు అతనికి జాగృదవస్థలో కామం బలీయం ఆమెకు సుప్త చైతన్యంలో కామం బలీయం ఒకరు ప్రత్యక్షంగా, మరొకరు పరోక్షంగా కామ పీడితులు అందుకే వీరి వివాహం ఫలవంతంకాలేదు వివాహానికి కావలసింది ప్రేమ, చిత్తసంస్కారం, సామాజిక దృక్పధం ఇవి కామాన్ని పాలించాలి అప్పుడే అది ఫలిస్తుంది.

సుందరమ్మ బిడ్డను కన్నది బిడ్డను పోషించే విధానం తెలియదు ఆ నేర్పు కలగడానికి పెద్దల శిక్షణలేదు చుట్టుపక్కల వాళ్ళు గూడా ఆమెతోగాని, ఆమె బిడ్డకు జబ్బు చేసినపుడుగాని సానుభూతితో పల్కరించి సహకరించలేదు బిడ్డకు జబ్బుచేస్తే భర్త డాక్టరు దగ్గరికి తీసికొనిపోయి మందిప్పించలేదు ఆమె దగ్గర డబ్బులేదు అతడు

చలం నవలలు

ఇవ్వడు. ఇక ఆమె బిడ్డకు జబ్బు నయం చేయడానికి -దేవతలే మిగిలారు. వాళ్ళకే మొక్కుకుంది. వెంకటశాస్త్రిమయ్యగారిని డబ్బు అడిగి, తక్కువకు తన చీరెలు తాకట్టు పెట్టి డబ్బుతెచ్చి దేవతకు సమర్పించబోయింది కాని, ఆ డబ్బుతో మందు ఇప్పించాలనే జ్ఞానం ఆమెకు లేకపోయింది. ఆ విధంగా కానుకను సమర్పించబోతే పూజారి చితంతు వివాహపు స్త్రీ అని స్వీకరించలేదు. దేవతాభావానికి ప్రాతినిధ్యం వహించే పూజారిలో కూడా సామాజిక, సంస్కరణా దృక్పథం లేకపోయింది. అందుకు కొత్త చీరను భర్త దాచాడు. ఇంట్లో చీర కనబడకపోయేసరికి దేవతయే గ్రహించిందని తృప్తి పడింది. ఇంకో చీరను కుదువపెట్టి మొక్కుబడిని దేవుడి దగ్గరికి తీసికొనివెళితే; ఆ దేవాలయ పూజారి ఆమెను బలాత్కరించబోయాడు ఇలా. సుందరమ్మ తాను నానా అవమానాలు పడడానికి కారణం తాను చంద్రశేఖరుడితో చేసిన పాపమే అని భావించింది.

ఈ వివాహంవల్ల తన సంతోషం తగ్గినకొద్ది తన ఆచారపరాయణతను ఎక్కువ చేసుకుంది. తన భర్త ఆత్మ తనచుట్టు తిరుగుతున్నదని భావించి చంద్రశేఖరాన్ని తన భర్త కాదనసాగింది. చంద్రశేఖరానికి ఈ సంసారం భారమనిపించి డబ్బుపెట్టి చీట్లపేకాడి కాలాన్ని గడిపాడేకాని భార్య సంగతి, బిడ్డ సంగతిని పట్టించుకోలేదు. ఈ విధంగా వివాహం వారికి భారంగా పరిణమించింది.

బిడ్డను డాక్టరుకు చూపించమని సుందరమ్మ తనను అనుభవిస్తున్న భర్తను అడిగింది 'పొద్దున చూద్దాం' అని అన్న భర్త తెల్లవారి అడిగినా వినిపించుకోకుండా వెళ్ళిపోయినాడు. భర్త ప్రవర్తనవల్ల సుందరమ్మకు తన మీద తనకు అసహ్యంకలిగి తాను రాత్రి భర్తతో వ్యభిచరించినట్లు బాధపడింది. వివాహ వ్యవస్థలో భార్యాపిల్లల అవసరాలు చూడకుండా వ్యవహరించే భర్తతో-సాగించే దాంపత్యం భార్యకు వ్యభిచారంగా తోస్తుందని దానివి గ్రహించాలని పురుష ప్రవృత్తిని చలం హెచ్చరిస్తున్నాడు.

బిడ్డకు జ్వరం విషమించింది. డబ్బు లేదు మందుకొనడానికి కాని మాతృహృదయంతో పిచ్చిగా మందులషాపు దగ్గరికెళ్ళి మందులు ఇమ్మంది. వర్తకుడు డబ్బులివ్వంది మందులివ్వనన్నాడు నిరాశతో ఇంటికి తిరిగి వచ్చింది. ఆమెకు సహకరించాలని మానవతా హృదయంతో గవళ్ళ రామయ్య అనేవాడు ఆమె ఇంటికి వెళ్ళాడు. ఆమె బ్రాహ్మణ యువతి అని వినగానే తాను డాక్టరుననిచెప్పి మోసగించి, ఆమెను అనుభవించి, బ్రాహ్మణ స్త్రీని అనుభవించాలనే తన చిరకాల వాంఛను తీర్చుకొన్నాడు.

సామాజిక చైతన్యం

సుందరమ్మ బిడ్డ అవస్థ చూడలేక, భర్త నిరాదరణవల్ల కలిగిన నైరాశ్యంవల్ల, అతడు డాక్టరు అని నమ్మి మోసపోయింది. భర్త ఆదరణలేక స్త్రీ నిరాశతో జీవితాన్ని అపార్థం చేసికొని పతనమౌతుంది. అందుకు సుందరమ్మ పాత్ర నిదర్శనం. 'ఒక్క-నిమిషమే యోచించింది. ఆ మనిషి దేవుడివేషంలో ప్రత్యక్షమైన ఈ రాక్షసి, ఆ ఇల్లు, తన కాపరం, తనపేరు, తన జీవితం, దేహం, అభిమానం, తన పిల్ల, తన శుచిత్వం, అన్ని కలలు, మాయ, మనోపటం మీద చలించే యింద్రజాలాలు, తనుతనే, తనబాధే, అదే వాస్తవం. నిన్న రాత్రి భర్త అనే పురుషుడు, ఈ రాత్రి వీడెవడో ఈ పురుషుడు. కాని, భర్తకన్న యితడే సత్యవంతుడు కావొచ్చు. ఏమైతేనేం, ఏం జరిగితేనేం? ఆలో చన లోకాన్ని, సందేహ కాలాన్ని అతిక్రమించింది. మృత్యువుముందు ఆత్మ కళ్ళనించే గడపతొక్కి పూర్వలోకాల దృష్టి నిలిపింది ఈ దేహాన్ని కాలిస్తేనేం, అనుభవిస్తేనేం ఆ కష్టెని' (పుట–81). ఇలాంటి నిరాశ సుందరమ్మలో భర్త ప్రవర్తనవల్ల కల్గింది. అందుకు తన లౌకిక దృష్టి లేమిగూడా తోడ్పడింది. భార్యాభర్తలు పరస్పర అవగాహనతో తమ సంతాన విషయమై జాగ్రత్త తీసుకోకుంటే; అందులోనూ భర్త బాధ్యతా రహితంగా ప్రవర్తిస్తే స్త్రీ పొందే పతనావస్థను చలం ఇక్కడ చూపాడు.

గవళ్ళ రామయ్య పాత్ర చాల విచిత్రమైంది. ఇతనిలో బ్రాహ్మణ ద్వేషం జీర్ణించి ఉంది. 'అతని ద్వేషం Intellectual మాత్రమేగాక ముఖ్యం emotional.' (పుట–79). అతని బ్రాహ్మణ ద్వేషానికి అనాది నుంచి సమాజంలో కల్పించబడిన వర్ణ భేదం, తండ్రి జవానుగా పనిచేసిన యింట్లో బ్రాహ్మణుల నుంచి పొందిన నీచత్వం కారణాలు. ఈ ద్వేషం ఫలితంగా బ్రాహ్మణ స్త్రీతో సంభోగించాలనే కోరిక ఏర్పడింది. ఒక బ్రాహ్మణ స్త్రీని అనుభవించటంవల్ల ఆ బ్రాహ్మణ సమాజం మొత్తం మీద తాను అధికారం చెలాయించినట్లనిపించే ఒక తృప్తి రూపమైన భావన అజ్ఞాతంగా వాని అంతర్యంలో ఉండి ఉండవచ్చును. అంతకంటే ఆ కోరికకు సరియైన హేతువేమిలేదు. ఒకవేళ ఉన్నా అది అతనికి కూడా తెలియదు. దీనిని 'చిన్నవాడు, తన తండ్రి పని చేసిన బ్రాహ్మణ గృహంలో తాను ఆరాధించిన తన యీడుదే ఆ బ్రాహ్మణ కన్య అతన్ని చేసిన హేళనా, అతనిచేత చేయించుకొన్న పనులూ, ఎంతకైనాపోనీ అతనికి ఆమె మీదగల గౌరవం యివి కారణాలని Psycho analysists అనవొచ్చు.' (పుట–79) అని చలం చెప్పుతున్నాడు. వర్గద్వేషం వ్యవస్థను ఛిన్నాభిన్నం చేసే అవకాశ ముందనే విషయం స్పష్టమవుతున్నది. సహజాతాలు ఎప్పుడు ఏ విధంగా బుసగొడ

తాయో సుందరమ్మ ప్రవర్తన ద్వారా చూపించాడు. వర్ణద్వేషాలు ఎప్పుడు ఏ విధంగా విజృంభిస్తాయో గవళ్ళ రామయ్య పాత్ర ద్వారా చూపాడు. సహజాతాలు, వర్గద్వేషాలు సామాజిక దృక్పధంలేక స్త్రీ–పురుష సంబంధాలలో వివాహ వ్యవస్థను ఛిన్నాభిన్నం చేసి స్త్రీని ముఖ్యంగా ఎట్లా అధోగతిపాలు చేస్తున్నవో చలం చెప్పదలిచాడు సుందరమ్మను అనుభవించిన తరువాత తాను డాక్టరును కానని రామయ్య చెప్పడంతో సుందరమ్మ భంగపడింది తత్ఫలితంగా ఆవేశం పొందింది. భగ్గున మండిపోయి రామయ్య మీదికి విజృంభించింది. రామయ్య భయంతో వెనుకకు జరుగుతూ దీపం అంటుకొని చనిపోయాడు. సుందరమ్మ పిల్లమీదపడి చనిపోయింది.

ఇలా సుందరమ్మ జీవితం విషాదమవడానికి ఆమె పూర్వాచార పరాయణత, సామాజిక దృక్పధం లేకపోవటం, లౌకికదృష్టిలేని ఆర్ద్రతాగుణాన్ని కలిగియుండటం, పర్యవసానాన్ని ఊహించలేని కామానుభవం, చిత్తసంస్కారంలేని భర్తనుకలిగి యుండడం, అవగాహనలేని వర్గద్వేషం కారణాలు. స్త్రీకి ఆధునిక సామాజిక దృక్పధం, ఆచారాలలోని శాస్త్రీయ దృష్టి తెలియడం అవసరం. ఇవి లేకుంటే స్త్రీ వివాహ వ్యవస్థలో భంగపడుతుందని సుందరమ్మ పాత్ర ద్వారా స్త్రీ లోకాన్ని హెచ్చరిస్తున్నాడు. వివాహ వ్యవస్థలో పురుషుని బాధ్యతారాహిత్య ప్రవృత్తి స్త్రీని అధోగతి చేస్తున్నదని అది సమాజానికి భంగకరమని పురుషలోకాన్ని చలం ఈ నవల ద్వారా హెచ్చరిస్తున్నాడు.

---

## అధోజ్ఞాపికలు :

1. 'స్త్రీ విద్యా విహీనురాలగుట వలన ఛాందస భావములను జీర్ణించుకొనుటవలన సహజముగ ఉన్నతురాలయినను తన జీవితమునెట్లు నరకము చేసికొనుచున్నదో నిరూపించు రచన' 'బ్రాహ్మణీకం'.

   —డా. సి. ఆనందరామం—సిద్ధాంత గ్రంధ వ్రాతప్రతి—పుట—40.

2. 'అదిగాక వీర్యమే శక్తి. అదే మేధస్సు. జీవితంలోని వుత్సాహం, ఆరోగ్యం, దాన్ని ఎంత నిలవచేసి, తన శరీర మానసిక అభివృద్ధికి యెంత ఉపయోగించ గలిగితే అంత సుందరమౌతుంది. అంత సఫలీకృతమౌతుంది. కనక నిగ్ర

హము అవసరము. భార్యతో జీవనంలో కూడా యెప్పుడు వాంఛను తీర్చుకున్నాడో, అప్పుడు మళ్ళీ వీర్యము కూడేవరకు భార్యపైన ఆకర్షణ రాదు. ఆకర్షణా మాధుర్యాన్ని ప్రజలెఱుగరు. కనకనే యీ విధంగా తమ శక్తి ధనాన్ని దుర్వినియోగం చేస్తారు. గనక పీలైనంతవరకు ఆ మాధుర్యాన్ని వదలకుండా పాలించుకోవాలి మీ జీవితాల్ని.'

—'స్త్రీ'—పుట—158.



# 7. అరుణ : కథ

అరుణకు బాల్యంలోనే జయరావుతో వివాహం అయింది. జయరావు మున్సబు. వయసు మీరినవాడు. వీరిది అనుకూల దాంపత్యం కాదు. కార్యంతంతు కాకపూర్వమే అరుణను తన గదికి రమ్మన్నాడు. ఆమె భయపడి పోయింది. తల్లి జాలిపడి అరుణను ఆపింది. ఇట్లా జయరావు అరుణ మనస్సులో వికృత భయాన్ని సృష్టింప చేసాడు. అతనితో మాట్లాడటానికిగాని, తిరగడానికిగాని ఆమెకు ఇష్టం ఉండేదిగాదు.

ఇటువంటి పరిస్థితిల్లో పీటర్ అనే యువకుడు ఆమె మనస్సును ఆకర్షించాడు. ఆమె అతనితో ప్రేమగా ఉండడం, అతను ఆమెను ముద్దు పెట్టుకోడం జరిగింది. తరువాత నాలుగేండ్లకు యవ్వనంలో ఉన్న అరుణను ఆకర్షించి పీటర్ కోర్కెను సాధించుకొన్నాడు.

అరుణ పదిహేను సంవత్సరాల తరువాత కాకినాడలో స్త్రీల మీటింగ్కని బయలుదేరి పీటర్ ఇంటికి వచ్చింది. ఈ మధ్య స్వాతంత్రోద్యమంలో గూడా పని చేసింది. పీటర్ తండ్రి; అరుణ భర్త ఇద్దరూ మిత్రులు. పీటర్కు తీవ్రమైన కామ వాంఛ కళ్ళకు పొరలు కప్పకపోవటంచేతనూ, ఆమె స్వేచ్ఛను అర్థం చేసుకోవడం చేతనూ మోహావస్థకు గురికాలేదు. ఇతనిలో ఆమె ఎక్కడి నుండి వచ్చిందోననే జెలసీ గాని, ఎప్పుడు వెళ్ళిపోతుందోనన్న భయంగాని ఇప్పుడు లేదు.

ఆమె దృష్టి అంతా పైకే. తన కలలో బ్రతుకుతూన్న ఆదర్శ పురుషుని వైపే. తనకు నచ్చిన వానిలో తన కలలో బ్రతుకుతూన్న ఆదర్శ పురుషుని లక్షణాలలో కొన్ని ఉన్న వ్యక్తిని ప్రేమిస్తుంది. అతని కోరికను తీరుస్తుంది. అటువంటి వారిలో పీటర్ ముఖ్యుడు. స్త్రీని అనుభవించడంలో తలెత్తే జెలసీల నధిగమించాలనే విషయాలను పీటర్కు బోధించింది. ఈమెకొరకు విరహపడి, తపనపడి, లభించినపుడు శంకించి, జెలసీలతో బాధపడకుండే విధంగా మార్చడానికి ప్రయత్నించింది.

---

అరుణ—ఎమెస్కో ప్రచురణ 1971.

పీటర్‌కు తన దగ్గరికి ట్యూషన్‌కు వచ్చే 'విల్లీ' అనే పెళ్ళి అయిన అమ్మాయితో సంబంధం ఏర్పడింది. విల్లీ తన స్వంతం అని అనుకొనడంలో వచ్చే ఆనందం అరుణ తన స్వంతం కాదు అని అనుకొనడంలో పీటర్‌కు లేదు కాని ఆతడు తనకు అరుణ దగ్గర లభించే శాంతి విల్లీ దగ్గర లభించడంలేదని భావించాడు. అందుకే అరుణ అంటే అతనికి అంత ప్రేమ.

అరుణ సౌందర్యానికి ఆకర్షితులై వచ్చిన ప్రియులు బీష్ట్, నాగన్‌లు. బీష్ట్ 'Forest Officer' అనాగరిక లక్షణాలు గలవాడు నాగన్ ముస్లిం. అసలు పేరు అమీరొద్దీన్. నిజామాబాద్ వాస్తవ్యుడు. ఇతనిలో పాశవిక ప్రవృత్తులకు కొద్ది సంస్కారముంది. వీరిద్దరి ప్రేమ మధ్య అరుణ బాధపడి పోయింది. అయినా వీరిద్దరికి చిక్కక వాళ్ళనే రింగ్‌మాస్టర్, సర్కస్‌లోని మృగాల నాడించినట్లు ఆడించింది. కాని లొంగలేదు. పీటర్‌తో ఉండిపోవాలనుకున్నది. అతడివద్దనే శాంతి లభిస్తుందని భావించింది. కాని ఆట్టి శాంతిని ఒక్క నిమిషం కూడా భరించలేకపోయింది. నాగన్, బీష్ట్‌లు అరుణ విషయమై జెలసీతో బాధ పడ్డారు.

జయరావు పీటర్ ఇంటికివచ్చి అరుణను తీసుకొని పోతానన్నాడు. అరుణ రానంది. కోపంతో భర్త ఆమె జుట్టుకు పట్టిలాగాడు అప్పుడే వచ్చిన బీష్ట్ ఆ దృశ్యాన్ని చూచి భరించలేక జయరావును తన్నాడు. అందుకు అరుణ, మిగతా వాళ్ళూ సంతోషించారు మళ్ళీ అరుణను బలాత్కారంగా లాక్కొని పోవడానికి ఆమెవైపు చూసాడు. నాగన్ అడ్డువచ్చి ఓలిచాడు. పీటర్ వారితో జయరావు అరుణ భర్త అని చెప్పడంతో అందరూ వెనుకకు తప్పుకొని అతనికి దాసోహం అన్నారు అప్పుడు తన ప్రియుల ధైర్య సాహసాలను ఆమె గ్రహించింది. ఆమెకు వ్యవస్థకు ఉన్న బలం అర్థమైంది. అప్పుడు భర్త జయరావుతో పోవడానికి అంగీకరించింది. తన సామాను సర్దుకుంటూ చీకటి గదిలో పీటర్‌ను కలిసికొని తాను అతనితో ఉంటానని, రక్షించమని ఏడిచింది. కాని పీటర్‌కు మర్యాద, శాంతి, కొత్త ప్రియుల ఎడద అడ్డుగా ఉండడంవల్ల అంతగా తాను ప్రేమించిన అరుణకు రక్షణ ఇయ్యలేకపోయాడు. తన దగ్గరుంటే మాత్రం ఆమె తనకు దక్కుతుందా, తన ఆసరా చూసుకొని లోకమంతా తిరుగుతుందని భావించి నిరాకరించాడు. ఆమెను భర్తకు వదలిపెట్టాడు. ఈ విధంగా ఈమె ప్రియులు ఈమెను

చలం నవలలు

భర్తకు వదలిపెట్టటంతో; వీరితో లాభంలేదని, భర్తతో బయలుదేరిపోయి, రైలు తప్పి పోవటంతో తిరిగి భర్తతోపాటు పీటర్ ఇంటికి చేరుకుంది.

అరుణ గదిలోనికి ఒక్కర్తె పోయి తలుపు వేసుకుంది. అందరూ పడుకున్న తరువాత ఆ రాత్రి పీటర్‌ని లేపింది. ఆ రాత్రింతా తన వైరాగ్యాన్ని బోధించకుండా తన మాయలో కప్పివేసి అతని కోరికను తీర్చింది. తాను వెళ్ళిపోతానని, తన కొరకు దుఃఖించకని చెప్పి వెళ్ళిపోయింది. అరుణ ఆరుగంటలకు రైలుకు తయారైంది. జయ రావు టైం కాలేదు, పడుకోమని చెప్పాడు. గదిలోనికి అరుణ వెళ్ళిపోయింది. తరువాత చూస్తే ఆమె ఆ గదిలో కనబడలేదు. చచ్చిపోలేదని ప్రియుల నమ్మకం. ఆమె తన శృంగార భావాలకు ఎట్లా స్వర్గ ద్వారాలు తెరిచిందో అలాగే తన ఆత్మకు ఏ ఆశ్రమం నుండో స్వర్గ ద్వారాలు తెరుస్తుందని పీటర్ భావించాడు.

ఇది చలంగారి ఏడవ నవల. రచనాకాలం 1939.



# అరుణ : విషయ విచారణ

స్త్రీ పురుషులు తమ సహజ ప్రవృత్తుల్ని వివాహ వ్యవస్థలో అనుభవించ డానికి అనుగుణంగా వ్యవస్థలోని లోపాలను సవరించుకోవాలనే హెచ్చరిక చేయడానికి చలం ఈ నవలను కూడా వ్రాసాడు.

స్త్రీ స్వేచ్ఛా ప్రణయ సిద్ధాంతం, ప్రేమ విషయంలో స్త్రీ పురుషుల రొమాం టిక్ దృక్పథం, వాస్తవ లోకంలో ఎట్లా విఫలమౌతుందో తెలపడానికి చలం అరుణ పాత్రను ఈ నవలలో చిత్రించాడు.

అరుణది అనుకూల దాంపత్యం కాకపోవడంచేతనే భర్తను అనుసరించి ఉండ లేదు. ఆమెకు బాల్యంలోనే వృద్ధుడైన మున్సబు జయరావుతో వివాహమైంది. మోహంతో ఆమె స్త్రీత్వాన్ని గుర్తించి ఆమె కోర్కెలనుతీర్చి ఆమెను లాలించే స్థితిలో అతని వయస్సులేదు. ఆమెకు స్త్రీత్వం తెలియని స్థితిలో, కార్యానికి ఎదగని వయస్సులో ఆమెను భర్త అనుభవించాలని ప్రయత్నించడంవల్ల అతనంటె భయం, అసహ్యం ఏర్పడినవి. అనుకూల దాంపత్యం కాకపోవడంచేత ఆమెకు భర్తమీద ప్రేమ లేకుండా పోయింది. ఇటువంటి పరిస్థితుల్లో తన వయస్సువాడైన పీటర్ ఆమె నాకర్షించి అనుభ వించాడు. ప్రేమలేని దాంపత్యం విఫలమౌతుందని చలం ఈ సంఘటనల ద్వారా స్ఫురింపచేస్తున్నాడు. బాల్య వివాహాలవల్ల, ప్రేమలేని వివాహాలవల్ల స్త్రీ ప్రవృత్తికి అన్యాయం జరుగుతున్నదని అందుచేత యవ్వనంలో రొమాంటిక్ దృక్పథంతో మరొక ప్రియునితో సంబంధం పెట్టుకొనే అవకాశం ఉందని, ఇది వివాహ వ్యవస్థకు భంగ కరంగా ఉందని కూడా చలం ధ్వనింపచేస్తున్నాడు.

జయరావు తన భార్య తన ఇంటికి, పడకకు శోభగా ఉంటే చాలునని భావించేవాడే కాని, ఆమెను ఆకర్షించే వయస్సుగాని, మోహంగాని లేనటువంటివాడు 1 అటువంటి భర్తను కాల్పనిక ప్రవృత్తి కలిగిన స్త్రీ అంటిపెట్టుకొని ఉండదు అందుకే అరుణ, భర్తను, అటువంటి భర్తను అంటగట్టిన వ్యవస్థను ధిక్కరించి ప్రియులతో వ్యవహరించింది.

అరుణ ప్రవృత్తి కేవలం శారీరిక వాంఛానుభూతియే ప్రధానంగా కలదిగాదు. సృష్టిలోని అందాన్నంతా అనుభవించాలన్నంత కోర్కె ఉంది ఆమెకు. అందుకు కావలసిన స్వేచ్ఛను కోరింది శారీరిక వాంఛకు అతీతమైన సౌందర్యాన్ని మానసికంగా పొందాలని ఆమె తాపత్రయం. ఈ ఆదర్శం గొప్పదైనట్లు కనిపించినా, సామాజికంగా ఎన్నో ఇబ్బందులను ఎదుర్కోవలసి వచ్చింది. స్త్రీ పురుషుల సంబంధాల విషయంలో పై ఆదర్శం పురుషులకు సుఖవాదంగా పరిణమించినా: స్త్రీకి సౌందర్యవాదంగా తోచినా; అది స్త్రీని పతనం చేస్తుందని అరుణ మాటల్లోనే తెలుస్తుంది. 'ప్రేమా—ప్రేమ విచిత్రం. నాకేనో అందరికీనో ! చూడు ఆ కిరణాలన్నీ ఒక్కటీ వృథాపోక, నా కళ్ళలోకి రావాలనిపిస్తుంది. ప్రతి మానవుడూ, ప్రతి అందమూ అన్నీ నాకోసమే— నా ఆనందానికే— నాలోపలికే అన్నీ, అన్నీ యీ ప్రపంచమంతా'— 'అంతా కూడా నాది: నా స్వంతం, నా హక్కు అనిపిస్తుంది. కాని యీ దేహం అడ్డం నుంచుంటుంది. అత్తగారిమల్లే 'నా ద్వారా నా ఉత్తరువు మీద'— అంటుంది. 'దేహమంటే కోర్కెల పుట్ట. చాతగాక, స్వేచ్ఛలేక, అన్నీ అక్కడ అర్పిస్తాము. దాన్ని కామం, జారత్వం, లోలత్వం, చంచలత్వం అంటుంది లోకం' (పుట—116). ఈ విషయాన్ని వివేచించడం ద్వారా మానసిక సౌందర్యానుభూతి స్త్రీ పురుష సంబంధాలలో శారీరికానుభూతికి దారి తీస్తుందని అప్పుడు వారిలో జెలసీలు ఏర్పడి అశాంతికి గురిచేయడం జరుగుతుందని చలం చెప్పదలచిన విషయం అని భావించవచ్చును సామాజిక అవగాహనలేని అరుణ పాత్ర ద్వారా రొమాంటిక్ దృక్పథాన్ని ప్రేమ విషయంలో చలం అన్వయించి చెప్పుతున్నాడు. సృష్టిలోని సౌందర్యాన్ని తనలోనికి తీసుకొనడమంటే శారీరికానుభూతుల విషయంలో స్త్రీ, ఎక్కువ మంది పురుషులను ఆహ్వానించడమే అవుతుంది. అరుణ విషయంలో అదే జరిగింది. ఆమె మానసికంగా జరగాలన్నది శారీరకంగా జరిగి పోయింది. తత్ఫలితంగా ఆమె పతనమైంది.

అరుణలో సౌందర్యాన్ని ఆరాధించే కళాదృష్టి ఉంది. అదే ఆమె ఆనందం. సమాజంలో ఉన్న పురుష ప్రపంచంలోని అందాన్ని ఆరాధించడానికి శరీర సౌందర్యం ఉందని భావించింది. తన కలలో తిరుగుతున్న తన ఆదర్శ పురుషుని లక్షణాలు ఎవరియందున్నా వారిని ఆరాధనాభావంతోనే చూసింది. ఆమె ఈ భావాలను పురుషులు కామవాంఛగా భావించి చుట్టూ ఆమె అందాన్ని అనుభవించడానికి తిరిగారు. ఈ విధంగా ఆమె

ఆదర్శం ఫలవంతం కాలేదు. అందుకే పురుష ప్రవృత్తిని కుక్కలతో పోలుస్తుంది. 'నా పురుషుడే ఒక్కడే నా కలల్లో బతుకుతున్నాడు. నిరంతరం నాకేసి చేతులు జాస్తో. ఈ మనుషుల్నిచూస్తే, వాళ్ళ లోపాలు, దేహ లోపాలు, గుణ లోపాలు అన్నీ కన పడతాయి. ఒక్కటి చూడు! అబ్బా! ఎంత వికృతం, ఎంత నీచం, ఆ నిమిషాన మొగాడి స్వరూపం. రోడ్డు మీద కుక్కల్ని చూడమూ, అదే జ్ఞాపకమొచ్చి నవ్వు ఆపుకోలేను.' (పుట–117). కేవలం స్నేహం స్త్రీ కోరబోతే పురుషుడు దేహాన్ని కోరతాడని పురుష ప్రవృత్తిని అధిక్షేపిస్తున్నది అరుణ. అరుణ సౌందర్యానుభూతిని హృదయంతో, ఆత్మతో అందుకోవాలని భావించింది.[2] కాముకత్వాన్ని అధిగమించలేని ప్రియుల మధ్య నలిగిపోయింది. తత్ఫలితంగా సర్వ సమ్మోహనంగా ఉన్న తన శరీరంమీద అసహ్యం వైరాగ్యం ఏర్పడి ఇతరుల కోర్కెల్ని తీర్చి పతనమైంది. ఇట్టి పరిస్థితులలో అరుణ మాటలు గమనింపదగ్గవి. 'నాకు మనుషుల్లో ఒకరికీ ఒకరికీ భేదం నశించింది. అందరూ అంతే. ఏం చేస్తారు పాపం! అంతకన్న చాతకాదు. మనుష్యత్వాన్ని అతిక్రమించాలని ప్రయత్నిస్తారు కొందరు నీబోటి వాళ్ళు. కాని, పాపం చేతగాదు. శరీరం ఒక్కటే ప్రేమ సాధనం. ఏ నీచుడైతేనేం, భర్త ఐతేనేం, బ్రాహ్మడైతేనేం, ఆ మహమ్మదీయు డైతేనేం? ఏదో కాలక్షేపానికి! ఎవరికో ఒకరికి తృష్ణతీర్చడం. కాని యీ మొగాళ్ళు చూశావుగా రాత్రి? అదీ రకం' (పుట–117). అరుణ కాల్పనిక దృష్టివల్ల ఏర్పడిన వైరాగ్యం, 'బ్రాహ్మణీకం' అనే నవలలో భర్త నిరాదరణవల్ల సుందరమ్మలో ఏర్పడిన వైరాగ్యం ఒక విధంగానే కనబడుతుంది.[3] పైమాటలవల్ల చలం చెప్పదలచిన విషయ మేమిటంటే, మనస్సు, హృదయం, ఆత్మల ద్వారా సౌందర్యారాధన చేయవచ్చు. ఇది కళారాధనగా రూపొందవచ్చు. కాని శరీరం ద్వారా, సెక్స్ ద్వారా సౌందర్యారాధనచేసే సాహసం ఉన్న స్వేచ్ఛాప్రణయ సిద్ధాంతం విఫలమవుతుందని, ఎంతో ఉన్నతంగా, పవిత్రంగా చూసుకోవాల్సిన శరీరాన్ని నీచులకు అర్పించే పరిస్థితులేర్పడడం సహజమని తత్ఫలితంగా స్త్రీ పతనమౌతుందని చలం చెప్పదలిచాడు. సెక్స్ విషయంలో రొమాంటిక్ దృక్పథం సత్ఫలితాన్ని ఇవ్వదని స్పష్టపడుతున్నది.

స్త్రీ దయగా మాట్లాడి సానుభూతి ప్రదర్శిస్తే పురుషులు కామభావంతోచూసే అవకాశం ఉంది. అందుచేతనే అరుణలోని దయ, సానుభూతి గుణాలవల్ల పురుషులు ఆమె వెంటపడ్డారు. స్త్రీ సహజమైన దయను, జాలిని, ఆర్ద్ర ప్రవృత్తిని చాల జాగ్ర

ంగా వివేకంతో పురుష ప్రపంచంలో ప్రదర్శించాలి. లేకుంటే పురుషులు ఆ స్త్రీ సౌంద ర్యాన్ని అనుభవించి ఆమెను పతనావస్థకు గురిజాంచేస్తారన్న విషయాన్ని అరుణ ద్వారా రచయిత చెప్పదలచాడు.

ఈమెకు ఉన్న సౌందర్యారాధనా ప్రవృత్తి ఫలితంగా ఈమెకు ముగ్గురు ప్రియులు తటస్థించారు. వారు పీటర్, నాగన్, బీస్ట్—లు. ఈ ముగ్గురిలో ఈమె పీటర్‌ని అధికంగా ప్రేమించింది ఇతడు అరుణ దృష్టిలో మనుష్యత్వాన్ని, జెలసీలను, అతిక్రమించడానికి ప్రయత్నించినవాడు. అరుణ ప్రేమతత్వాన్ని అర్థం చేసుకొని, ఆమె ఎడల సానుభూతిని ప్రదర్శించినవాడు. ఇతని దృక్పథం కూడా రొమాంటిక్ తత్వానికి, స్వేచ్ఛా ప్రణయానికి అనుకూలమైనది. అరుణ ముగ్గురిని ప్రేమించినా ప్రేమ వ్యవహారాలలో తలెత్తే జెలసీలు ఈమెలో లేవు. ఈ వ్యవహారంలో ఈమె తామరాకు మీది నీటిబొట్టులా వ్యవహరించిది. పీటర్ ఆమెను అర్థం చేసికొన్నట్లు మిగతా ప్రియులు అర్థం-చేసుకొనలేదు. వారు తమతమ జెలసీలతో బాధించారు. ఈ విధంగా అరుణ ప్రేమతత్వం ద్వేషాలకూ, నిందలకూ గురియైంది.

రొమాంటిక్ తత్వంలో స్వేచ్ఛా ప్రణయం ఒక భాగం. సౌందర్యం ఒకరిసొత్తుగాదని, అది అందరికీ ఆరాధనీయమని దాని భావం. ఈ దృక్పధాన్ని స్త్రీ సౌందర్యానికి కూడా అన్వయించి, ఆరాధించేవారు స్వేచ్ఛా మార్గంలో సంచరించి సామాజిక దృక్పథం లేక అశాంతి పాలవుతున్నారని చలం స్ఫురింపచేస్తున్నాడు. స్త్రీ సౌంద ర్యాన్ని ఆస్వాదించబోయి పురుషులు ఆమె పతనానికి కారణమవుతున్నారని, ఈ సౌంద ర్యతత్వం మిగతా ప్రకృతి విషయంలో సంభావ్య మవుతుందేమో కాని; స్త్రీ—పురుషుల ప్రేమలో సాధ్యపడదనీ అలాంటి ప్రేమ ఈర్ష్యాద్వేషాలకు గురియై ప్రేమలోని సౌందర్యాన్ని నశింప చేస్తుందని చలం చెప్పదలిచాడు.

స్వేచ్ఛాప్రణయంలో జెలసీలు తప్పవు. ప్రేమ వ్యవహారాల్లో జెలసీలకు అతీతంగా ఉండే అరుణకూడ పీటర్ ప్రియురాలు విల్లీ విషయంలో ఉండలేకపోయింది. పీటర్ వంటి గొప్పహృదయం కలిగినవాడు కూడా అరుణ, నాగన్‌తో కలిసి ఉంటే బాధ పడ్డాడు. అరుణ ప్రవర్తనకూడా అతతినికి బాధ కలిగించింది, ఇక నాగన్, బీస్ట్‌ల జెలసీలు తారాపథాన్ని అందుకొన్నవి. చేతనావస్థలో స్వేచ్ఛా ప్రణయాన్ని కోరె

అరుణా పీటర్లిద్దరూ అవచేతనలో వ్యవస్థాపరమైన పరిణయాన్నే కోరుతున్నారనటానికి వారిలో ఉన్న జెలసీలే కారణాలని చెప్పవచ్చును.

**అరుణలో సాత్విక స్వభావం ఎక్కువ.** స్వేచ్ఛా పరిణయంలో ఆమెను త్రిప్పి సత్వ, రజో, తమో గుణ ప్రధానమైన పురుషులు ఆమె ఎడల ఎలా ప్రవర్తిస్తారో, వారి హృదయాలు ఎలా ప్రతిస్పందిస్తాయో చలం చూపాడు. పీటర్ సత్వగుణ ప్రధానుడు. కామం కళ్ళకు కప్పనటువంటి వాడు. ఆమె ప్రేమను, దాని పవిత్రత్వాన్ని సానుభూతితో అర్థం చేసికొన్నాడు. నాగన్ ముస్లిం. ఇతనిలో ముస్లింలలో సాధారణంగా కన్పించే సంస్కరించబడిన పాశవికప్రవృత్తులు 'Refined animal instincts' (పుట—48) ఉన్నవి. రజోగుణ ప్రధానుడు. ఇతడు స్త్రీ అనుభవాన్ని ఒక ధర్మంగా భావిస్తాడు. ఇతడు అరుణను తనదానిగానే భావించి బీస్ట్ విషయంలో జెలసీని కలిగి ఉన్నాడు. అట్లాగే బీస్ట్ తమోగుణానికి ప్రతినిధి. నాగన్‌తో అరుణ ఉంటే ఇతనికి జెలసీ. నాగన్, బీస్ట్‌లు పీటర్‌తో జెలసీలు లేకుండా వ్యవహరించారు. దీన్నిబట్టి పీటర్ వ్యక్తిత్వం గొప్పదని భావించవచ్చును. వీరు జెలసీలతో అరుణ విషయంలో బాధపడుతుంటే, ఈ బాధలన్నీ ఆమె ఎందుకు తెచ్చుకున్నదా అని పీటర్ బాధపడ్డాడు. ఇట్లా అరుణ ప్రేమ అలజడికి, అశాంతికి గురైంది.

కాల్పనిక ఆవేగం కలిగిన స్త్రీ పురుషులు భావలోకంలో విహరించి స్వేచ్ఛా పరిణయపు ఊహలనే కలిగి ఉంటారు. వాటిని జీవితంలో వాస్తవం చేయాలనే ప్రయత్నం కూడా చేస్తుంటారు. కాని వారి ప్రయత్నాలు సమాజంలో నెగ్గవు. వాటికి వాస్తవికత లేదు. కాబట్టి యవ్వన దశలో ప్రేయసీ ప్రియులు స్వేచ్ఛా పరిణయాన్నే కోరుకోవచ్చును. యవ్వన దశ రొమాంటిక్ దశ. కాని వారి అవచేతనలో స్వార్థం, జెలసీలు ఉంటాయి. ఆ స్థాయిలో స్త్రీ పురుషులు తమలో తమకు మాత్రమే చెందిన వారై ఉండాలనే విధానానికి అనుకూలమైన వివాహ వ్యవస్థనే కోరుకుంటారు.[4] ఈ రొమాంటిక్ దృక్పథం సమాజంలో ఏ విధంగా సంచలనం కలిగించి సామాజిక దృక్పథాన్ని కోల్పోయిందో తెలుగు సాహిత్యంలో స్పష్టంగా కనిపిస్తుంది. తెలుగు భావకవిత్వంలో రొమాంటిక్ అంశాలే ఎక్కువై సామాజిక దృక్పథం లేకుండా పోయింది.[5] ఎందుకంటె స్వేచ్ఛా పరిణయంలో చంచలత్వం, అశాంతి ఉంటుంది. వివాహ వ్యవస్థలో స్థిరత్వం, శాశ్వత శాంతి, ప్రేమలు ఉంటాయి. అందుకే సమాజానికి వివాహ వ్యవస్థలో

విశ్వాసం ఉంది. అందుకొరకే అరుణ కొరకు సర్వత్యాగాలకు సిద్ధపడ్డ ప్రియులు, జయరావు అరుణ భర్త అని వినగానే అతనిముందు వారు పిల్లులుగా మారిపోయి అరుణను వదలిపెట్టారు. 'తమరు భర్తా, తెలీలేదు. క్షమించండి ఆమెని తీసుకోండి, కోసుకోండి. మాకేం సంబంధం' అంటున్నాయి వాళ్ళ దేహాలు. ప్రతి స్వేదనాళం లోంచీ వాళ్ళు మాత్రం భర్తలుకారా? కాబోరా? సంసారపు హక్కుల్ని పునాదుల్ని ప్రశ్నించి ఎదురు తిరిగితే ఆడది! వాళ్ళ భార్యల మీద హక్కులు నిలవాలాలేదా?' (పుట–97) అనే సంఘర్షణ వాళ్ళ అంతరాత్మల్లో ఉంది. పీటర్ మనస్సు కూడా జయరావుకు, వ్యవస్థకే లొంగింది ఇట్లా అరుణ స్వేచ్ఛాప్రణయం విఫలమై పోయింది. ఆమె ప్రేమకు పోషకులైన ప్రియులు ఆమెను భర్తకు వదిలేసి జారిపోయారు. వ్యవస్థా బద్ధంకాని స్త్రీ స్వేచ్ఛాప్రణయంవల్ల స్త్రీయే నష్టపడుతుందని, తాత్కాలిక శరీరాకర్షణ చేత రొమాంటిక్ ప్రవృత్తితో ఆ ప్రణయాన్ని గొప్పగా భావించినప్పటికి సమాజంలో అది ఫలించి సత్ఫలితాలను ఇవ్వదని చలం చెప్పదలచిన విషయం.

ఒకవైపు వ్యవస్థ అరుణ ప్రవృత్తిని గమనించక అణచిపెట్టింది. రెండో వైపు ప్రియులు తన ప్రవృత్తిని గమనించినా, సామాజికంగా ఆమెను భరించడానికి అశక్తులైనారు. ఈ రెంటి మధ్య అరుణ హృదయం నలిగిపోయింది. అశాంతికి గురైంది. వ్యవస్థను, తన భర్తను ఎదురొడ్డి తనను భరించడానికి ముందుకురాని ప్రియుల అశక్తత ఆమెకు గోచరించింది. కాబట్టి స్వేచ్ఛాప్రణయం కన్న వ్యవస్థే నయమని భర్త జయరావుతో పోవడానికి నిశ్చయించుకుంది. జయరావుతో అప్యాయంగా, ప్రేమగా తిరిగింది కాని ఆమె మనస్సులో సంఘర్షణ ప్రారంభమైంది. అటు భర్తతో ఉండి తన ప్రవృత్తిని చంపుకోలేదు. ఇటు ప్రియులవద్ద తన ప్రవృత్తి నిలిచే పరిస్థితి లేదు. అంతేగాక అందరితో స్నేహంగా ఉన్నా తనకు నచ్చిన ప్రియుని దగ్గర ఉండి సుఖపడే అవకాశం కలుగలేదు. ఇట్లా ఆమె ఏ ఒక్కచోట కూడా సుఖశాంతులకు నోచుకోక ప్రపంచం నుండి అదృశ్యమైంది

అరుణ వ్యవస్థలో తనకుకలిగిన దురవస్థకు ఎదురు తిరిగి, స్వేచ్ఛాప్రణయం ద్వారా వ్యవస్థలో పొందలేని సుఖాన్ని పొందింది. కాని వివాహంలో లభించే శాంతి, సుఖం లభించలేదు. ఈ సంఘటనల ద్వారా శాంతి, స్థిరత్వాలకు నిలయమైన వివాహ వ్యవస్థలోని లోపాలను సరిచేసిన స్త్రీ పురుషులు సుఖాన్ని, ఆనందాన్ని పొందవచ్చునని

సామాజిక చైతన్యం

చలం ధ్వనింపచేస్తున్నాడు. నియతిలేని ప్రేమతో ఇంద్రియ కల్లోలమేర్పడి. మానవాళి అశాంతికి గురియవుతుందని చలం స్వేచ్ఛాప్రణయవాదులను హెచ్చరిస్తున్నాడు.

ఈమె వ్యక్తిత్వం, రొమాంటిక్ దృక్పథం. సామాజిక అవగాహనలేక అసంబద్ధంగా తోస్తుంది. ఈమెకు జీవితం మీద స్పష్టమైన అవగాహన లేదు. అందుకు ఆమె పలికిన ఈ మాటలే ఆధారాలు. 'చూడు వుంటె నీకు వెర్రెత్తిస్తాను. నీకు నిమిషం విశ్రాంతి నివ్వను. అంత మంచివాడవా ? స్వార్థం యెరుగనివాడవా ? నువ్వు కూడా—చూడు మొగాళ్ళే—మొగాళ్ళే ఏమిట్లే, అందరునూ— నాకు. నాకు అంటూ దాచుకుంటారేం? కరుచుకుని పీక్కుని చీల్చుకుంటారేం? ఏదో లిసేది అయిపోయేదీ అయితే అనుకోవచ్చు. తమ యింట్లో పెద్ద దీపం పొరుగింటి గోడమీద పడుతూందని, కిటికీలు మూసుకుంటారు, తమకి గాలిరాక చచ్చినాసరే, వాళ్ళకి కాంతి— తమ కాంతి స్వంతం అక్కర్లేక మిగిలింది— అది మాత్రం ఇంకోళ్ళకెందుకు పోవాలి? కొందరు దీపం ఆర్పే సుకునేవాళ్ళు కూడా వున్నారు మహానుభావులు. కసితో నేలకేసి బద్దలుకొట్టేవారు, ఛీ పాడులోకం. మళ్ళీ అందమంటే మొగాళ్ళకి ఎంత కక్కుర్తి కంటబడితే చాలు.' (పుట—111). 'అవును. ఎందుకా? భరించలేను. మొగవాడు, ధీరుడు, బలశాలి, అట్లా నాకోసం బాధపడుతో ప్రాధేయపడితే భరించలేను. పరమ అసహ్యం నాకు వాళ్ళని చూస్తే. కాని వాళ్ళనించి ఏదో గొప్పగా, యీ పాడు శరీరాన్ని దాచుకుంటే నా మీద మరింత అసహ్యం.' (పుట—112). స్త్రీ ప్రకృతిని జడప్రకృతిని ఒకలాగానే పురుషుడు అనుభవించాలనేది అసంబద్ధం. మొగవాడి బాధకు లొంగిపోయి శరీరాన్ని అర్పించడం, తన శరీరాన్ని దాచుకుంటే అసహ్యమని అందరికి దానం చెయ్యడం కూడా అసహ్యమే. రొమాంటిక్ దృక్పథంతో, సామాజిక అవగాహన లేకపోవటం, యవ్వన దశలో భర్తతో సరియైన మోహ, ప్రేమలు లేకపోవటంవల్ల ఈమె జీవితం అసంబద్ధంగా తయారై పతనాన్ని పొందింది. ఈ దృక్పథం ఉండడంవల్ల ఈమెకుగాని, ఈమె ప్రియులకుగాని శాంతి, సుఖాలు లభించలేదు. ఇట్లా స్వేచ్ఛాప్రణయం అసంబద్ధంగా రూపొందడంవల్ల సమాజంలో సత్ఫలితాన్ని ఇవ్వదని చలం ఈ నవల ద్వారా చెప్పదలచాడు.

అరుణ లోకాన్ని ఆకర్షించడానికి శరీర సౌందర్యం ద్వారా ప్రయత్నించినప్పుడల్లా లోకం కరిచింది. ఇది ఆమెకు లభించిన గుణపాఠం. శరీరం ద్వారాగాక మనస్సు

ద్వారా, హృదయం ద్వారా, ఆత్మ ద్వారా ఆనందాన్ని అనుభవించడానికి ప్రయత్నించా లనే జ్ఞానం ఆమెకు కలిగింది. ఆధ్యాత్మికానందాన్ని పొందడానికి ప్రయత్నించాలను కుంది. ఆ అన్వేషణలో అదృశ్యమైంది ఈ విషయాలు నవల చివరన ఆమె పలికిన మాటల ద్వారా తెలుస్తుంది 'నా అధికార దేవతలు, నా అదృష్ట దేవతలు, నాకేముంది యీ శరీరంగాక? ధనమా, గానమా, దేనితో యీ లోకాన్ని నాదిగా ఆకర్షించుకోగలను? నా సౌందర్యం ఒకటే నాకు దేవతలిచ్చిన వరం ఆ వరాన్ని ఉపయోగించినప్పుడల్లా లోకం నన్ను కరిచింది. కాని, యీ అంధకారంలో ఆకాశం కొంచెంగా తెరుచుకుంది. కొత్త విధం ఆనందానికి కొత్త ద్వారం కొంచెంగా తెరిచారు. ప్రయత్నిస్తాను. ఈ శరీరాన్ని యీ మొద్దుని, భారాన్ని అతిక్రమించి ఎగరడానికి చూస్తాను, నేనేం చెప్పలేను' (పుట–115) అని పల్కింది. అరుణ పీటర్‌లో శృంగార భావాలకి కారణమైనట్లు గానే, ఆధ్యాత్మిక లోకాలకు కూడా కళ్ళు తెరిపించింది. కామం మోక్షానికి దారి తీసింది. అందుకే పీటర్ ఈ విధంగా చెబుతున్నాడు. 'జీవితంలో యీ దేహానికి, నా శృంగార భావాలకి యెట్లా స్వర్గ ద్వారాలు తెరిచిందో, అట్లానే నా ఆత్మకి, నా ఆధ్యాత్మిక సందే హాలకీ ఎప్పుడో ఏ ఆశ్రమం నించో స్వర్గ ద్వారాలు తెరుస్తుందని నా నమ్మకం.' (పుట–120 )

పై మాటలు చలం జీవితంలో యధార్థాలైనవి. చలం రమణాశ్రమ జీవితం అందులో ధ్వనిస్తున్నది.

18, 19వ శతాబ్దాలలో బయలుదేరిన అస్తిత్వవాద సాహిత్య లక్షణాలు, ఈ నవలలో కనిపిస్తున్నవి. అరుణ పాత్ర అందుకు నిదర్శనం అరుణ జీవితాన్ని ఆమె ప్రవృత్తి లక్షణాన్ని నిర్ణయించింది ఆమె అంతఃకరణం. ఈమె ఈ అస్తిత్వ వాదం ఆదర్శవాదాన్ని తిరస్కరించింది. ఈమె సామాజిక స్పృహా లక్షణంలేని అంతర్ముఖీనమైన బ్రతుకు బ్రతకడానికి ప్రయత్నించింది. తత్ఫలితంగా ఆమె ప్రవృత్తి క్షణక్షణానికి మారే సౌందర్యాన్ని అన్వేషిస్తూ జీవితాన్ని గడిపింది. ఈమె లోని సహజ ప్రవృత్తిల్ని రొమాంటిక్‌గా చూపించి, ఆమెను వ్యవస్థాధర్మం నుంచి తొలగించి, ఆమె ప్రకృతిని ఆమె అనుసరించిందని నవలా రచన సాగించటంలో అసం బద్ధ సాహిత్య లక్షణంగా భావించవచ్చును. అసంబద్ధ సాహిత్యంలోని వైచిత్రి మానవు లను ఆలోచించడానికి ఉన్ముఖుల్ని చేస్తుంది. సమాజాభ్యుదయ మార్గాన్వేషణకు ఈ

దృక్పథం ఉపయోగిస్తుంది 6 తత్ఫలితంగా చలం సాహిత్యం స్త్రీ పురుషుల కాల్పనిక విషయాలను సామాజికంగా ఆలోచించడానికి కూడా ఉపయోగిస్తుంది

---

## అధోజ్ఞాపికలు :

1. వివరణ. 'మైదానం'లోని రాజేశ్వరి భర్తకన్నా కూడ చాల తక్కువ మోహ లక్షణాలు కలిగినవాడు జయరావు. మోహానికి, భయానికి తేడా తెలియనివాడు ఆ ప్లీడరైతే, ఈ మున్సబు జయరావు తన భార్య ఎటువంటి తప్పు పనులు చేసినప్పటికీ; ఆమె తనదైతే చాలుననుకొనేవాడు.

2. వివరణ: అరుణ; శశిరేఖ, రాజేశ్వరి, పద్మావతివంటి స్త్రీ కాదు. వారు కేవలం శారీరకావసరాలకు ప్రాముఖ్యాన్నిచ్చి వ్యవస్థను భంగపరిచారు. కాని అరుణ సౌందర్యానుభవాన్ని శరీరంతోకాక, హృదయంతో, ఆత్మతో అందుకోడానికి ప్రయత్నించి పతనంచెంది వ్యవస్థను భంగపరిచింది.

3 'ఒక్క నిమిషమే యోచించింది. ఆ మనిషి, ఆ దేవుడివేషంలో ప్రత్యక్షమైన ఈ రాక్షసి. ఆ యిల్లు, తన కాపరం, తన పేరు, తన జీవితం, దేహం, అభిమానం, తన పిల్ల, తన శుచిత్వం, అన్ని కలలు, మాయ, మనోపటం మీద చలించే యింద్రజాలాలు. తను, తనే. తన బాధే, అదే వాస్తవం. నిన్నరాత్రి భర్త అనే పురుషుడు, ఈ రాత్రి వీడెవడో ఈ పురుషుడు. కాని, భర్తకన్న యితనే సత్యవంతుడు కావొచ్చు. ఏమైతేనేం, ఏం జరిగితేనేం? ఆలోచన లోకాన్ని, సందేహ కాలాన్ని అతిక్రమించింది మృత్యువు ముందు ఆత్మ కళ్ళు నించే గడపతొక్కి పూర్ణ్వలోకాల దృష్టి నిలిపింది ఈ దేహాన్ని కాలిస్తేనేం, అనుభవిస్తేనేం ఆ కష్టాని?'

—బ్రాహ్మణీకం—పుట—81.

4. 'నీ సంసారానికి నా ప్రేమకు మధ్య నీకె Struggle కలిగినపుడు Consciousగా నా ప్రేమనే ఏరుకొంటావు. కాని Subconsciousగా సంసారం మీదనే

పుంటుంది నీ మనస్సంతా. నా ప్రేమలో నీకు శాంతి వుండదు.'

ప్రేమలేఖలు—(చలం సాహితీ ప్రచురణ)—పుట—21.

5. 'అర్ధ కామములను అదుపులో పెట్టికొన్న ధర్మమే సమాజము యొక్క నడకకు ప్రేరణశక్తి. కామ పురుషార్థములను స్త్రీ పురుషుల మధ్య ప్రవర్తింపజేయనే వలయును. వలయుచో భార్యాభర్తలై యుండవలయును. కానిచో పర్యవసాన మునందు కావలయును. ముప్పాతికవంతు భావకవిత్వమునందు ఈ విషయము మృగ్యముగా నున్నది.'

—డా. కేతవరపు రామకోటిశాస్త్రి—భావకవిత్వ విచారము—విమర్శిని—1976.

6. 'సాహిత్యము ఆనందించుటకుకాదు. ఆలోచించుటకని సామాజికులు తెలిసికొనుట వ్యక్తీకరణ వైచిత్రివాద తాత్పర్యము. కనీసము తాత్పర్యములలో నొకటి. తమ తాత్పర్యమీడేరుటకు సాహిత్య ప్రక్రియలందు అసంబద్ధతనే కల్పించవలయును. అప్పుడుగాని సామాజికులిదేమిటాయని నిలబడి ఆలోచించరన్న ఉద్దేశ్యముతో అసంబద్ధ సాహిత్య రచన మొదలయినది.'

—డా. కేతవరపు రామకోటిశాస్త్రి—అస్తిత్వవాద అసంబద్ధ సాహిత్యము—భారతి—జులై—1977.



# 8. జీవితాదర్శం : కథ

లక్ష్మణసింగ్ మదాస్ 'లా' కాలేజీలో చదువుతూ లాలస అందానికి ఆక ర్షితుడై ఆమెను ప్రేమించాడు. ఆమెతో సాన్నిహిత్యాన్ని సంపాదించుకొన్నాడు. వీరిద్దరూ చదివే 'లా' కాలేజీలో కొన్నాళ్ళకు మెడికల్ కాలేజి నుంచి ఏడమ్స్ అనే అతను వచ్చి చేరాడు. ఏడమ్స్ ఆడవాళ్ళను ఆకర్షించడంలో నేర్పరి. ఇతడు లాలసను ఆకర్షించి లోబరుచుకొన్నాడు. వీళ్ళిద్దరి స్నేహం పెళ్ళి వరకువచ్చి భంగపడింది. లాలస ఏడమ్స్‌ల స్నేహంవల్ల బాధ, పెళ్ళి భంగపడినందుకు సంతోషం కలిగాయి లక్ష్మణ సింగుకు. పెళ్ళి భంగపాటువల్ల కలిగిన అవమానాన్ని అధిగమించి, లాలస కాలేజీలో చదువసాగింది. లక్ష్మణసింగు ఆమెను పెళ్ళి చేసుకోవాలనుకొని ఆమెను అడుగుతాడు. కాని ఆమె ఉపేక్షాభావం వహించింది. ఈమెతో, పెళ్ళికి తన తలిదండ్రులు ఒప్పు కుంటారో లేదో అనే అనుమానం కూడా అతనికి కల్గింది.

తరువాత లాలస స్వాతంత్ర్యోద్యమంలో, ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని జైలుకు వెళ్ళింది. సింగు కూడా ఆమెతోపాటు ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని లాఠీ దెబ్బలుతిని స్పృహ కోల్పోయి ఒక ప్రభుత్వోద్యోగి కూతురైన మదాలస సేవలో కోలుకున్నాడు. ఆ రాత్రి మదాలస ఇతనిని కోరింది. కాని లాలస కలవరింపులతో సింగు ఆమె కోర్కెను పట్టించుకోలేదు

లాలస జైలు నుంచి విడుదలై సింగును రైళ్ళో కలుసుకున్నది అతడు కోరిన ప్రకారంగా పెళ్ళికి ఒప్పుకుంది. సింగ్ తల్లి, తమ్ములు ఈ పెళ్ళికి అనుకూలంగా లేరు. పెళ్ళికి ముందు లాలస, సింగుతో పెళ్ళి అంటే తనకు ఉండే అభిప్రాయాన్ని స్పష్టంగా చెప్పింది. తనలో గొప్ప మహిమలున్నాయని భ్రమపడవద్దనీ తరువాత తాను నిరాశ కలిగిస్తే బాధపడగూడదని చెప్పింది. కాని సింగ్ తమ ప్రేమకు ఎట్టి భంగం కలుగదని చెప్పి ఆమెను పెళ్ళి చేసుకున్నాడు. వాళ్ళిద్దరూ కొన్నాళ్ళు ఎంతో ప్రేమగా.

---

జీవితాదర్శం—ఎమెస్కో ప్రచురణ—1968.

అన్యోన్యంగా ఉన్నారు. లాలస తనతోనే సన్నిహితంగా, ప్రేమగా ఉండాలని, మరెవ్వరితో అలా ఉండగూడదని అతని నిర్ణయం. కాని ఆమె తన మరదులతో వేళాకోళాలు, జోక్సు, గంతులు వేయడంచూసి సింగ్ ఈర్ష్య పడ్డాడు. లాలస సంబంధంలో తానేదో మోసపోయినట్లు బాధ పడ్డాడు కాని ఆమెతో ఉదారంగానే ప్రవర్తించాడు

ఈ సమయంలో మౌల్వంకర్ సంగీతానికి లాలస ఆకర్షితురాలై, అతని మోహానికి లొంగి అతనితో వెళ్ళిపోయింది. లాలస చేసిన మోసానికి సింగ్ బాధ పడ్డాడు.

దేశికాచారి తన ప్రియురాలికోసం బ్యాంకులో రెండు లక్షలు దొంగతనంచేసి, ఆమె మోసాన్ని గుర్తించి, ఆ డబ్బును ఆమెకు ఇవ్వక దానిని మౌల్వంకర్ దగ్గర దాచాడు. జైలు నుంచి దేశికాచారి వచ్చింతరువాత మౌల్వంకర్ వడ్డీతోసహా అతని డబ్బును ఇచ్చివేసాడు. మౌల్వంకర్‌కు సంగీతం, సంగీతాన్ని అభిమానించే వ్యక్తులంటే ఇష్టం. అందుకే లాలసనాకర్షించి తనతో తీసుకొనిపోయాడు. కాని తరువాత మౌల్వంకర్ దగ్గర ఆమె బ్రతుకు దుర్భరమై చారి ఇంటికి వచ్చింది.

చారి, లాలసకు భర్త ఉన్న సంగతి తెలిసికొని ఆమెచేత అతనికి ఉత్తరం రాయించాడు లోకాపవాదును భరించే స్థితిలోలేక సింగ్ ఆమెకు సమాధానం రాయలేదు. ఆ పరిస్థితుల్లో దేశికాచారి ఆమెను తనతోనే భీమ్లిలో ఉంచుకొన్నాడు.

సింగ్, అతని మిత్రుడు నరసింహారావు అనంతపురం నుంచి భీమ్లి ప్రకృతి సౌందర్యాన్ని చూడ్డానికి వెళ్ళారు. వీళ్లు అక్కడ దేశికాచారితో పరిచయాన్ని సంపాదించుకొన్నారు.

ఒకరోజు సముద్రపుటొడ్డున చీకట్లో వీళ్ళు దారి తప్పినపుడు లాలస వారికి సహాయం చేసింది. చీకట్లో మెరుపు కాంతిలో ఆమెను సింగ్‌చూసి లాలసగా భావించి, ఆమె సంగతి పూర్తిగా తెలుసుకోవాలనే కుతూహలం కల్గింది. తరువాత ఆమె లాలసే అని ఆమెను చారి భయపెట్టి తనకు దూరం చేస్తున్నాడని భావించి, అతనిపై జెలసీని పెంచుకొన్నాడు.

లాలస సముద్రంలో స్నానం చేస్తున్నప్పుడు, సింగ్ ఆమెకు సహకరించ

బోయి తానే సముద్రంలో పడ్డాడు. సింగ్‌కు ఈతరాక పోవడంచేత లాలసే అతనిని కాపాడి ఒడ్డుకు చేర్చింది అప్పుడు చారి, సింగ్‌ను తన ఇంటికి తీసికొనిపోయి ఆతిథ్యం ఇచ్చాడు. లాలస. సింగ్‌తో, చారే తనను ఆతని గదికి పంపాడని తెలుపగా; సింగ్ ఆ చర్యను నీచంగా భావించి వెళ్ళిపోయాడు. సింగ్, నరసింహారావుల ప్రయాణాన్ని చారి ఆపి తనకు లాలసకు ఉన్న సంబంధాన్ని తెలిపి, వారిని భోజనానికి తన ఇంటికి ఆహ్వానించాడు

భోజనమైన తర్వాత తమ కధనంతా తెలిపి, లాలసను తన దగ్గర ఉంచుకోవాలనిలేదని, ఇష్టమైతే వాళ్ళిద్దరూ కలిసి పోవచ్చునని దేశికాచారి, నరసింహారావును తీసికొని, సింగును లాలసవద్ద ఉంచి వెళ్ళాడు. కాని లాలస సింగుతో పోవడానికి నిరాకరించింది. సింగ్ ఒంటరిగానే వెళ్ళిపోయాడు. తరువాత దేశికాచారి లాలసతో కలిసి ఉంటూ జీవితాదర్శమైన శాంతిని అనుభవిస్తూ ఉంటాడు.

ఇది చలంగారి ఎనిమిదోదీ చివరదీ అయిన నవల. రచనాకాలం 1948.



# జీవితాదర్శం : విషయ విచారణ

చలం తన 'జీవితాదర్శం' అనే చివరి నవలలో శృంగారానుభవం యొక్క సాధక బాధకాలను లాలసపాత్ర ద్వారా చెప్పాడు. చలం మిగతా నవలలోని స్త్రీ పాత్ర లకు లాలస పాత్రకు చాలా భేదం ఉంది. వ్యవస్థలోని లోపాలచేతనో, భర్తలలోని లోపాలచేతనో, దాంపత్యంలోని కామ, మోహాల లోపాలవల్లనో, యువదంపతులపట్ల కుటుంబంలోని పెద్దలు సుముఖంగా లేకపోవడంవల్లనో, సామాజిక దృక్పథంలేక ఆచారాలను గుడ్డిగా ఆచరించడంవల్లనో, సామాజిక అవగాహనలేని రొమాంటిక్ దృక్పథంవల్లనో; చలం స్త్రీ పాత్రలు పతనం చెందినవి. కాని ఈ నవలలో సామాజిక స్పృహా లక్షణంలేని శృంగారానుభవం వివాహ వ్యవస్థలో పురుషుడికి ఎట్టి బాధలు కలిగిస్తుందో చలం తెలుపదలచాడు

చలం 'స్త్రీ'లో శృంగారానుభవాన్ని గూర్చి చెప్పిన విషయాలు ఇక్కడ గమనించాలి. 'కాని కొంత మందికి మాత్రమే చాల తక్కువ మందికేమో—శృంగారంకన్న విలువైన అనుభవం ఇంక వేరే వుండదు. ధనం, అధికారం, కీర్తి, స్నేహం, దేశ సేవ మొదలైన వాటికన్న చాలా ఎక్కువ వాంఛనీయం శృంగారమనుకునే వాళ్ళే తక్కువ'— 'ఇంతకన్న ఎక్కువ మందికి మామూలుగా జరిగేదేమిటంటే పెళ్ళి. దాంట్లోంచి శృంగారానుభవం రాదు.' (పుట—101) 'కాని సహృదయులు శృంగారపు మెరుగు తగ్గినంతమాత్రాన వొకరినొకరు ఒదులుకొనిపోరు. జ్ఞాపకాలు, కృతజ్ఞతలు, యిష్టాలు, యివన్నీ నిలుపుతాయి పెళ్ళి ఐనాసరే. కాకపోయినాసరే. పెళ్ళి ఐతేతక్కిన సంఘ ధర్మబంధాలు కూడా గట్టిగా బిగించి వుంచుతాయి. ఈ లోపల ప్రేమే తటస్థించిందా యింక శృంగారం మాయమై ఏలోపం కనబడదు.' (పుట—103). 'శృంగారానుభవమే ప్రధానమైన వాళ్ళకి సంబంధం పాతదికాగానే తిరిగి యింకో నూతన సంబంధం వెతుక్కోవడంకన్నా గత్యంతరం లేదు.' (పుట—103). 'కాని శృంగారం కన్న అధికమైన విలువగలది యింకా దుర్లభమైనదీ ప్రేమ'— 'శృంగారానుభవానికి శరీరానుభవం ప్రాముఖ్యం. దీనికి సహాయకులు కవిత్వం, తీవ్రవాంఛాహృదయ

స్పందనం, ప్రేమ వీటన్నింటినీ మించిన లయం, ఏకత్వం. చాలాసారులు మనుసుల్ని ఎమోషన్సునీ, కవిత్వాల్ని కలలనీ మించిన ఐక్యసిద్ధి. పైకి చాలా శాంతం. ఎవరూ గుర్తుపట్టలేనంత సుకుమారం, నిగూఢం. యిట్లాంటి ప్రేమ కలిగినప్పుడు శృంగారం వేరే కావాలనే గుర్తు లేకపోవచ్చు. శృంగారం నిరంతరం వారిద్దరి మధ్యనూ వుండనూ వచ్చు. చాలా సకృత్తుగా శృంగారాతీతమైన తృప్తి కలగనూవచ్చు. శృంగార వాంఛ దిగబడిపోనూవొచ్చు.' (పుట–103).

చలం పై మాటలనుబట్టి శృంగారానుభవమే ముఖ్యం అనుకునేవారు వివాహ వ్యవస్థకు లోబడరు. పెళ్ళిలో శృంగారానుభవం తక్కువ కేవలం శృంగారానుభవాల వెంబడిపోతూ వ్యక్తులను మార్చుకుంటూ పోవడమనేది వ్యవస్థలో సాధ్యంగాదు పూర్వపు జ్ఞాపకాలు, కృతజ్ఞత ఈ శృంగారానుభూతులకు ఆటంకాలుగా నిలుస్తాయి. శృంగారం కన్న గొప్పది ప్రేమ. ప్రేమ వ్యవస్థలో లభిస్తుంది. ప్రేమ శృంగారానుభవాలను తగ్గించి మానసిక ఆధ్యాత్మిక అనుభూతులను పెంచి జీవితాదర్శమైన శాంతిని కలుగ జేస్తుంది అని స్ఫురింపచేయడానికే చలం ఈ నవలను వ్రాసాడు

ఈ నవలల్లో కేవలం శృంగారానుభూతుల క్రమ పరిణామాన్ని లాలస జీవి తంలో చలం చూపాడు.

లాలస తన సౌందర్యంచేత కాలేజీ కుర్రాళ్ళను ఆకర్షించింది. అందులో లక్ష్మణసింగు ఒకడు. ఇతనికి జీవితం లాలసమయమై పోయింది. తనని ప్రేమిస్తున్న సింగ్‌ను వదలి, అనేకమంది స్త్రీలతో పరిచయమున్న ఏడమ్సునే లాలస ఆహ్వానించింది. అతనితో శృంగారానుభూతులను పొందింది. ఈమెకు అతనితో ఇలాంటి అనుభూతులే ప్రధానంగాని, అతని ప్రవర్తనతో ఎలాంటి సంబధం పెట్టుకోలేదు. కాని అతనికి ఇద్దరు భార్యలు ఉన్నారని తెలియడంవల్ల పెళ్ళివరకు వచ్చిన వారి ప్రేమ భంగపడింది. ఈ విధంగా తొలి శృంగారానుభవం విఫలమైంది. ఈ దిగులు నుండి లాలస ఎంతో నిబ్బరంతో తనను తాను నిలదొక్కుకుంది.

తరువాత కొన్నాళ్ళకు సింగ్ లాలసతో ఆమెను పెళ్ళి చేసుకుంటానని చెప్పాడు. ఆమె బదులు పలుకలేదు. కేవలం శృంగారానుభవమే ప్రధాన ప్రవృత్తిగా గలిగిన ఈమె వివాహవ్యవస్థలో ఇముడలేదు. ఈ విషయాన్ని స్పష్టంగా చెప్పలేక

మౌనంగా ఉండిపోయింది. సింగ్ ఆమెను వివాహ వ్యవస్థ ద్వారానే ప్రేమించాలను కున్నాడు. కాని ఆమెకు వ్యవస్థలో విశ్వాసంలేదు తరవాత ఆమె స్వాతంత్రోద్యమంలో పాల్గొంది జైలుకు పోయింది. విడుదలైంది సత్యాగ్రహాలవల్ల స్వరాజ్యంరాదని భావించి స్వాతంత్రోద్యమంలో కొనసాగలేక పోయింది తరువాత సింగ్‌ను కలుసు కొని, అతని ఉద్దేశ్యాన్ని దృష్టిలో ఉంచుకొని పెళ్ళాడతానంది. సింగ్ ఒప్పుకున్నాడు, తన కుటుంబ సభ్యులకు ఇష్టం లేకపోయినా. ఆమెతో తన కాపురాన్ని గొప్పగా ఊహించుకొని స్వర్గంలో తేలిపోయాడు. ఈ సందర్భంలో లాలస తన దృక్పథాన్ని వివరిస్తూ మాట్లాడింది. 'నేను చాలా విధేయతగల భార్యని కాకపోవొచ్చు. ఇంకా స్పష్టంగా మాట్లాడాలంటే, నేను నీకు ఆదర్శమైన స్త్రీని అనుకుంటున్నావు కాను. నమ్మవు సరే, నువ్వు మాత్రం నాకు ఆదర్శమైన పురుషుడివి కావు. మాటాడవేం? కష్టంగా వుంది, ఔనా? మరి ఎందుకు నిన్ను పెళ్ళి చేసుకుంటున్నానా? ఆదర్శమైన పురుషుడు భూమి మీదలేడని నాకు స్పష్టమయింది. గనక; నువ్వే నెక్స్టుబెస్ట్. ఆదర్శ మైన స్త్రీ కూడా లేదు. కాని నేనొకతెను వున్నానని నమ్ముతున్నావు. దురదృష్ట వంతుడివి. కనక నువ్వు నన్ను డిజప్పాయింట్ చెయ్యలేవు. నేను నిన్ను తప్పకుండా డిజప్పాయింట్ చేస్తాను. ఆనాడు ఈ మాటలు నీకు జ్ఞాపకం వుండవు. కాని చెపు తున్నాను'. (పుట–70) ఈమె ప్రవృత్తి ప్రేమ స్థాయికి చేరుకోలేదు. ప్రేమ స్థాయిలో శృంగారానుభవాలకు అంత ప్రాముఖ్యం ఉండదు. ఈమె ప్రవృత్తిలో శృంగా రమే ప్రధానం. ఈమెకు ప్రేమ స్వరూపం తెలియదు. అందుకే 'మరి నాకు నీ మీద ఉన్నది ప్రేమ ఔనో కాదో, అది గట్టిప్రేమో, వొదులు ప్రేమో, నాకు తెలియదు– అసలు అట్లాంటిది వుందోలేదో చాల సందేహం, వుంటే, అలాంటిది నా స్వభావానికి రాదో, మరి నీ మీదనో, యెవరి మీదనో అలాంటి ప్రేమో, వాంఛో, ఏదో వస్తుందో, రాదో నాకేం తెలుసు.' (పుటలు–70–71) అని అంటుంది. ఈమెలో వాంఛఉంది. అది సహజాతపరమైంది దానిని అర్థం చేసుకొనే అంతర్ముఖీనతా దృష్టిగాని, సామా జిక అవగాహనగాని లేదు. ప్రేమ స్వభావం అందుకే ఈమెకు పట్టుబడలేదు ప్రస్తుత పరిస్థితులలో సింగ్‌పై ఇష్టం ఉంది. అందుకే పెళ్ళి. ఇష్టం పోయిన తరువాత వ్యక్తి మారతాడు. ఇదియే ఆమెకు శృంగారానుభవం.

ఆమెకు సహజాతాల మీద నిగ్రహం లేదు. మొల్వంకర్ సంగీతం విన్న తరువాత తనను తాను అతని ఆకర్షణ నుంచి నిగ్రహించుకోలేక పోయింది. అతనికి

లోబడిపోయింది. ఆమె ఆతనికి లోబడటానికి సింగ్ కారణం కాదు. సింగ్‌లో దాంపత్యానికి కావలసిన మోహం, ప్రేమలు ఉన్నవి. అయినప్పటికీ మౌల్వాంకర్‌కు ఆమె లోబడటానికి కారణం ఆమెకు కావలసిన శృంగారానుభవమే అని తెలుస్తుంది. ఆమె నీతి, వ్యవస్థ, మర్యాదకన్న గాఢమైన శృంగారానుభవానికే ప్రాధాన్యత నిచ్చింది. ఆమె శృంగారానుభవానికి సంగీతం హేతువైంది. మౌల్వాంకర్ బూతులు తిట్టినా, హింసించినా సింగ్‌ను వదలివెళ్ళింది. ఇలా శృంగార సహజాతాలకు లోబడే లాలసత్వం, ప్రలోభం ఈమెలో ఎక్కువ అని చలం చూపుతున్నాడు.

ఇలాంటి ప్రవృత్తి ఉన్న లాలసను వివాహ వ్యవస్థలో ప్రేమించటం సాధ్యపడదు. అందుకే ఆమె పెళ్ళిని తిరస్కరించింది. సింగ్ ప్రవృత్తి వ్యవస్థాపరమైంది. ఒకసారి ప్రేమించిన స్త్రీని ఎన్నడూ మరచిపోడు అందుకే మదాలస తనను కోరినపుడు లాలసనే జ్ఞాపకం చేసాడు. లాలసవలె చంచల ప్రవృత్తితో గాఢమైన శృంగారానుభవాలవెంట పరుగెత్తే ప్రవృత్తి మదాలసదిగాకున్నా కొన్ని సందర్భాలలో అందమైన శృంగారానుభవాలు లభించినపుడు వానిని వదలుకోరాదనే మనస్తత్వం ఆమెకు ఉంది. సింగ్ వ్యవస్థను అతిక్రమించి అనుభవాన్ని కోరేవాడుగాడు. అతడు వ్యవస్థ, నీతి, కట్టుబాట్ల ఎడల అనుకూలుడు అయినా స్త్రీ స్వాతంత్ర్యం, వ్యక్తిత్వాలకు గౌరవం ఇవ్వాలనే దృక్పథాన్ని కలిగినవాడు కాబట్టే లాలస మౌల్వాంకర్ వెంట పోతుంటే బలవంతపరచి తన దగ్గర ఉంచుకోలేక పోయాడు పెళ్ళి చేసికొన్న తరువాత బంధాలు, బాధ్యతలను అంగీకరించాలి ఈ సామాజిక దృక్పథం సింగ్‌లో ఉంది లాలస వెళ్ళిపోయిన తరువాత సింగ్ పలికిన మాటలు సామాజిక దృష్టితో కూడినవి. 'స్త్రీలకి యీ చదువులవల్లా, స్వేచ్ఛవల్లా కాపరాలిట్లా అవుతున్నాయి. మరి వాళ్ళూ మనుషులేగా అంటే, అవును; చదువులూ స్వేచ్ఛావుండవలసిందే. ఉద్యోగాలు చెయ్యవలసిందే. కాని ఆ స్త్రీలు వేరు వాళ్ళు పెళ్ళిళ్ళు చేసుకోగూడదు. పెళ్ళి అనగానే కొంతవరకన్నా బంధాలు, బాధ్యతలూ అంగీకరించాలి కాకపోతే ఇంకపెళ్ళి అనేదానికి అర్థం ఏముంది?' (పుట—30) కేవలం అనుభవాలను కోరే స్త్రీలు పెళ్ళి చేసుకొనకుండా ఉంటే ఉండవచ్చు అని సింగ్ ఉద్దేశ్యం ఇటువంటి స్త్రీలతో వ్యవస్థ ద్వారా సంబంధం పెట్టుకొంటే నిరాశ కలుగక తప్పదు ఈ భావాన్నే చలం 'ఆమె అందాన్నిచూస్తే ఎంత కళ్ళు తళతళమంటాయో, ఆమె చరిత్రని తలుచుకుంటే అంత డార్జిలింగ్‌గా వుంది. కాని ఆ రంగుల

విప్పు పువ్వుల్నిరాల్చే తారాజువ్వ మామూలు భార్యకింద ఎంతవరకు ఇముడుతుందనే ఆలోచన రాదు యువకుడికి' (పుట–45) అని అంటాడు. అటువంటి చరిత్రగలిగిన స్త్రీ వలన సింగ్ భంగపడ్డాడు. ఇటువంటి అనుభూతిపరులు జీవితంలో స్థిరమైన దృక్పథం ఏర్పడేంత వరకు సుఖాలను వదలుకోరు. అంతవరకు వ్యక్తులను మారు స్తూనే ఉంటారు. లాలస వివాహాన్ని తేలికగా అర్థం చేసుకొని అపహాస్యంపాలు చేసింది తాత్కాలికంగా అప్పటికి ఆమె మనస్సులో సింగ్ ఉన్నాడు కాబట్టి అతణ్ణి పెళ్ళాడాలనుకుంది. ఇటువంటి సామాజికావగాహనలేని శృంగారానుభూతులకు ప్రాధాన్యాన్ని ఇచ్చే లాలసతో వ్యవస్థాబద్ధమైన నాగరక ప్రవృత్తులకు ప్రాధాన్యమిచ్చే సింగ్ వివాహం విఫలమౌతుందని చలం చెప్పదలిచాడు. అటువంటి స్వేచ్ఛా ప్రవృత్తి కలిగిన స్త్రీ దరికి సింగ్‌లాంటి వ్యవస్థాబద్ధ జీవులు పోగూడదని, వారిని విధికే విడవాలని చలం సూచించదలచిన విషయం. సింగ్‌లో ఉన్న స్త్రీ స్వేచ్ఛ ఎడలగల దృక్పథం గూడ సరియైందిగాదు స్త్రీకి స్వేచ్ఛ ఉండాలని, దానిని పురుషుడు గౌరవించాలని, పురుషుడు స్త్రీని తన స్వంత ఉపయోగాలకు ఉపయోగించుకుంటున్నాడనే అభిప్రాయం సింగ్‌లో స్థిరపడిఉంది. అది సమంజసమైందిగాదని; ఆమెతో ఇలాంటి సిద్ధాంతాలు మాట్లాడి పురుషుడు ఆమెను స్వార్థానికి ఉపయోగించుకుంటాడని, శాంతికి, సౌఖ్యానికి ఉపయోగించని స్వేచ్ఛ, స్వేచ్ఛగాదని దేశికాచారి చెప్పిన మాటల్లో వాస్తవం ఉంది. 'స్వతంత్రం ఎవరు వొద్దంటారు? కాని జీవితంలోని సౌఖ్యాన్ని ధ్వంసంచేసే స్వతంత్రంవల్ల ఏం వొరుగుతుంది'. (పుట–94) అని దేశికాచారి చెప్పిన మాటలనుబట్టి లాలస తన స్వేచ్ఛను శృంగారానుభవాలకు ఉపయోగించడంద్వారా ప్రేమించిన పురుషులకు అశాంతి కలగజేయడం సమంజసమైన సామాజికాంశంకాదని స్పష్టపడుతున్నది. చలం తన భావాలను పాఠకులలో నిద్రాణమైన వ్యక్తిత్వాలను మేల్కొల్పటానికి చెప్పాడు. అయితే అప్పుడప్పుడు పాత్రల ద్వారా ఏకపక్షంగా ఆకర్షవంతంగా చెప్పడంచేత, అవి అపార్థాలకు గురిఅవుతున్నాయి. సింగ్ మాటల్లో చలం భావాలు ఉన్నప్పటికి అవి ఏక పక్షానికి చెందినవి. దేశికాచారి మాటల్లో చలం సమ్యగ్దృష్టిని నిక్షిప్తపరచాడు. చలమే ఈ పాత్రలచేత తన రచనా దృక్పథాన్ని తెలియజేస్తున్నాడు. 'కాని పురుషుడు తన స్వంత ఉపయోగాలకోసం స్త్రీని దాచుకుని ఈ దొంగ కబుర్లు చెపుతున్నాడు. కావలిస్తే చలం 'స్త్రీ'ని చదవండి.' (పుట–93) అన్న సింగ్ మాటలకు; చారి 'చలం వుత్త గుడ్ ఇన్‌టెంషన్డ్ ఫూల్. టాగూరు స్త్రీ మీద రాసిన వ్యాసం చదవండి' (పుట–93)

అన్నాడు. స్త్రీని స్వేచ్ఛపేరున, శృంగారానుభవం పేరున బయటికిలాగి వారికి న్యాయం చేస్తున్నామనే వారిని దేశికాచారి ఈ విధంగా విమర్శించాడు ఇట్టి స్త్రీలకు మెదడులేదన్న దాకా పోయాడు. 'పోనీ, ఇంట్లో హాయిగావున్న వాళ్ళని బీచికి, పీధికీ లాక్కురావడ మెందుకు స్త్రీపైని గౌరవమున్న ఏ పురుషుడూ ఆమెని వీధులవెంట, బీచివెంట ఎన్నడూ తిప్పడు. స్త్రీ అమూల్యమైన వరం. ఆమె సౌందర్యం అపురూపంగా తాను భక్తితో అనుభవించాలి. ప్రతిచోట తిప్పుకుని అందరికి చూపుకుంటె ఎంత మామూలూ, చౌకా ఐపోతుందో గమనించారా? ప్రేమాస్పదులైన తన అప్తులతో తప్ప స్త్రీ సహజంగా మధురంగా మాట్లాడలేదు. ఆమె స్వభావం ఎమోషనల్ సెంటిమెంటల్, ఆమె చేత తెలివిగా సమస్యలూ, రాజకీయాలూ మాటాడించాలని చూస్తే పురుషుడు చెప్పిన మాటల్నే చిలుక పలుకులు పలుకుతుంది.' (పుట-93) అని అన్నాడు. ఇట్లా స్త్రీకి శృంగారానుభవమే ప్రధానమని నేర్పితే అలా వల్లించి మిగతా ముఖ్యాంశాలకు విలువ నివ్వక సమాజంలో ఇముడకపోవడం జరుగుతుందని చలం స్ఫురింప చేయదలచిన అంశం. సింగ్ ఆమెను మాల్వంకర్‌కు విడిచిపెట్టటం కూడా సమంజసంగాదని ఆమెపై ప్రేమ ఉన్నవాడు, ఆమె స్వేచ్ఛవలన ఆమె నష్టపడుతుందని తెలిసినవుడు ఆమెను అతను వదలి పెట్టడం అవివేకమని ఈ విధంగా దేశికాచారి హెచ్చరిస్తున్నాడు. 'ఆమె స్వతంత్రానికి అడ్డుపడకూడదనే, మీ ఆత్మగౌరవాన్ని తొలగించకోలేని మీ ప్రేమ ఏం గొప్పది? అతనితో సుఖపడుతుందని మీకు నమ్మకమా? లేదు. అంతే ఆమె మీదకన్న మీ మీద, మీ ప్రిన్సిపల్సు మీద మీకెక్కువ ప్రేమ ఇంకో మనిషితో తన స్త్రీ సుఖపడుతుందని ఎప్పుడూ వుండదు. ప్రేమించే మనిషికి. అట్లా అనుకుంటాననుకోడం ఆత్మవంచన. అట్లాంటప్పుడు ఆమెని క్రూరంగా ఆమె గతికి వొదిలి మీ బాధ్యతని వొదులుకున్నారా? స్త్రీ మీద గౌరవమే మొదటి తప్పు. గౌరవం బలహీనం, ఎందుకా గౌరవం? గౌరవంతో, కవిత్వంతో, ప్రేమతో కట్టుకోవాలని చూస్తారు స్త్రీని నవీన యువకుల – అంతకంటె చాతగాక' (పుట-101). దేశికాచారి దృష్టిలో లాలసవంటి స్త్రీని పెళ్ళి ద్వారా కట్టుకొంటె శాశ్వతంగా ఉంటుందనుకోవడం సమంజసంగాదు పురుషుడు ఆమెఎడల విశ్వాసంతో వ్యవహరించాలె. ఆమె విడిచి వెళ్ళిపోయినా బాధలేకుండా ఉండాలి. వెళ్ళే రోజున ఆమె తప్పకుండా వెళుతుంది. పైగా గౌరవించి ఆరాధిస్తే లోకువచేసి పోతుంది. శృంగారానుభవాలను కోరే స్త్రీ వివాహాన్ని కోరనపుడు ఆమెను బలవంతపరచి: అందులో బంధించి, బంధనం నుంచి వెళ్ళిపోతే బాధపడడం మూర్ఖం.

అటువంటి స్త్రీతో పురుషుడు గూడ బంధనాలు లేకుండా వ్యవహారిస్తే నే శాంతియని దేశికాచారి అభిప్రాయం ఆ విధంగా లాలసతో తాను వ్యవహరించి శాంతిని పొందాడు. 'అది ప్రేమ కాదంటారు కవులు కాకపోతే పోయింది గాని ఆమెకీ నాకూ కూడా చాలా శాంతి' (పుట–103) అని భావించి వ్యవహరించాడు.

తన భార్య లాలసను దేశికాచారి దగ్గర చూడడం సహించలేక పోయాడు, సింగ్. తన భార్యకాకపోతే అంత జెలసీ దేశికాచారి ఎడల సింగ్‌కు ఉండదు అతనికి నీతిమీద పట్టుదల హెచ్చు. ఈ నీతిని పట్టుమీద లాలసకు విశ్వాసం లేదు అందుకే చారి ఇంట్లో వీరిద్దరూ ఘర్షణ పడ్డారు. లాలస తన పురుషుణ్ణి వదలి తన గదిలోనికి రావడం సింగ్‌కు ఆశ్చర్యం కలిగించింది. అతని నీతిపట్టును గ్రహించి అనుభవానికి ప్రాముఖ్యాన్ని ఇచ్చే లాలస బాధపడింది. 'అందుకనేననుకుంటా ఆ లాలస నీనించి వెళ్ళిపోయింది ఇప్పుడు చాలా బాగా అర్థమౌతోంది' (పుట–119) అని అతని నీతిని ఇలా అవహేళన చేసింది. 'ఏమిటీ? నీతిచాలా గొప్ప విషయమూ, అవసరమైన విషయమూకావొచ్చు. కాని నీతి గట్టిగా మనసుకిపట్టిన మనుషులు అందానికి అంధులౌతారనడంలోనే వుంది నీతిలోని నీచత్వం. ఎందుకంటె దేవుడేవుంటే అతను నీతి కన్న అందానికి చాలా దగ్గిర. సృష్టి అంతా అందం ఒక్క కుచ్ఛితపు మానవుడిలోనే ఈ నీతి' (పుట–119) ఇట్లా లాలస తన దృక్పథాన్ని రొమాంటిక్ స్ఫూర్తితో తెలిపింది. సింగ్ ఆమె రొమాంటిక్ దృక్పథాన్ని సామాజిక దృష్టితో ఎదుర్కోలేదు. దేశికాచారి ఆ ప్రవృత్తిని ఖండించాడు. ఆమె రొమాంటిక్ దృక్పథం జెలసీలను కలిగిస్తుంది. కాబట్టే శాంతిని ఇవ్వని అందం వ్యర్థమని తెల్పాడు. అలాంటి లాలసను నీతిని, కృతజ్ఞతని బోధించి తన దగ్గర ఉంచుకోదలచుకోలేదు అందుకే లాలసచేత సామాను సర్దించి సింగ్‌తో ఆమెను తీసికొని పొమ్మని చెప్పాడు. ఎందుకంటె అలాంటి వ్యక్తిని బంధించి తన దగ్గర ఉంచుకోవడం మూర్ఖమని. కాని లాలస సింగ్‌తో వెళ్ళలేదు సింగ్ ఎడల ఇష్టమే. కాని బంధనాలు. చారి దగ్గర ఎలాంటి బంధనాలు లేకుండా ఉండవచ్చు. తన ప్రవృత్తికి తగిన వాతావరణం ఉంది. సింగ్‌తో వెళితే మళ్ళీ తగాదాలు అని వెళ్ళలేదు. తనలాంటి ప్రవృత్తిగల స్త్రీకి 'ఆయన ఏ పట్టూ, ఏ ప్రెజుడిసెస్ లేకుండా జీవితాన్ని మధించి, సుఖపడే రహస్యాన్ని కనిపెట్టారు.' (పుట–127) అని చెప్పింది. ఇప్పుడు ఆమెకు శృంగారాలకతీతమైన శాంతి కావాలి. అది చారి దగ్గరే

లభించింది కాబట్టి వెళ్ళలేదు. తీవ్రమైన శృంగారానుభవం తిరిగి దానికి అతీతమైన శాంతినే కోరి సాధించింది.

ఇట్టి లాలసను దేశికాచారి చేరదీసాడు. శృంగారానుభవాన్ని స్వేచ్ఛా ప్రవృత్తితో పొందే స్త్రీల ఎడల ఎలా ప్రవర్తించి శృంగారానుభవంతోపాటు శాంతిని ఎలా పొందాలో తెలుసుకొన్నటువంటివాడు దేశికాచారి. దేశికాచారి రసికుడు. శృంగారానుభవాలతో తామరాకు మీద నీటి బిందువులా వ్యవహరించి శాంతినిపొందే మనస్తత్వాన్ని పెంపొందించుకొన్నాడు. అనేక దేశాలు తిరిగినటువంటివాడు. రాచకుటుంబపు స్త్రీలతో రొమాన్సు నడిపినటువంటివాడు. తాను ప్రేమించిన స్త్రీ కొరకు బ్యాంకును సైతం దోపిడి చేసిన సాహసికుడు. ఇలాంటి దేశికాచారి మానవులకు దూరంగా సమాజపు పొలిమేరలలో శాంతికి, అనంతత్వానికి నిలయమైన సముద్రానికి దగ్గరగావున్న కొండమీద తన నివాసాన్ని ఏర్పరచుకొన్నాడు. రాగద్వేషాలకు అతీత ప్రవృత్తితోకూడిన శృంగారాన్ని, శాంతిని అనుభవించాడు రాత్రింతా సముద్రాన్ని, వెన్నెలనుచూస్తూ లాలసను ఒడిలో లాలిస్తూ గొప్ప ప్రశాంతితో ప్రకృతి పూజ చేస్తున్నాడా అన్నంతగా ప్రకృతిలో తన్మయుడైనాడు ప్రకృతిని మానవీకరించే దృష్టి అతనిది. సింగ్, నరసింహారావులకు ప్రకృతిని ఎలా దర్శించాలో, ఎలా ఆనందించాలో తెలిపాడు. సింగ్‌కు స్త్రీని ఎలా అర్థం చేసుకొని అనుభవించాలో నేర్పాడు. ఆపదలో ఉన్న లాలసను ఆదుకొన్నాడు. ఆమెలోని గాఢ శృంగారతత్వాన్ని ప్రకృతి తాదాత్మ్యంలోనికి మార్చి శృంగార పరిధి నుంచి ప్రేమ మార్గానికి మరల్చాడు. అశాంతిమయమైన ఆమె జీవితానికి జీవితాదర్శమైన శాంతి చక్షువులను ప్రసాదించాడు. జీవిత సౌఖ్యాన్ని ధ్వంసంచేసే స్వతంత్రతను ఆహ్వానించలేదు అలాగే జీవితంలో సౌఖ్యాన్ని ధ్వంసంచేసే విషయాల్ని గూడా పట్టించుకోలేదు అందుకే లాలస పుట్టుపూర్వోత్తరాలు పేరు సైతం తెలుసుకోవడానికి ప్రయత్నించలేదు లాలస విషయాలన్నీ త్రవ్వకొని సింగ్ బాధ పడుతుంటే: అట్టి బాధలకు అతీతమైన దృక్పథంతో లాలసను లాలించాడు. మనుష్యులందరితోను స్నేహం చేస్తాడు, పల్కరిస్తాడు సహృదయంతో అందరి కష్టసుఖాలలో భాగస్వామియై పోయాడు. మానవ స్నేహంలేనిది బ్రతుకలేడు సింగ్‌కు స్త్రీ తత్వాన్ని, ప్రేమ తత్వాన్ని, శాంతినిపొందే మార్గాన్ని తెలిపాడు. లాలసలోని మార్పుకు చారి ప్రధాన కారకుడు చారి గురువు, ప్రవక్త. జీవితంలో ఔన్నత్యాన్ని పొందాడు. చలం గొప్పగా దేశికాచారి పాత్రను తీర్చి దిద్దాడు.

జీవితాదర్శం గొప్ప కథగా చలం స్నేహితుడు చిన్నారావు గుర్తించి ఉత్సాహాన్ని ఇచ్చినట్లు చలం వ్రాసిన లేఖ ద్వారా తెలుస్తున్నది. 'మొన్న వైజాగ్ నుండి ఒకాయన యూనివర్సిటీ స్టూడెంట్ (ఇంగ్లీషు ఆనర్స్) వొచ్చారు. ప్రపంచ వాఙ్మయం బాగా చదివారు. అన్ని దేశాల కథలను చదివేను. ఇట్లాంటి కథని నేను చదువలేదన్నారు ఆయన. దాన్ని చాల మంది 'గొప్ప కథ' అంటున్నారు. ఎందుకు రాస్తున్నానంటే దాన్ని మొదట గుర్తించి రాసింది మీరు.'[1] ఈ నవల మీద ఆచార్య ఆత్రేయ విమర్శ గావించినట్లు చలం లేఖవలన తెలుస్తున్నది. 'మొన్న రేడియో దగ్గర్నుంచి 'పకపక' కేకవేసింది. నా పేరు వొచ్చిందని వెళ్ళివింటె ఆచార్య ఆత్రేయట నా 'జీవితాదర్శాన్ని' (పుస్తకం) విమర్శిస్తున్నాడు దేశికాచారి అసహజమూ, వాస్తవానికి దూరంట. లాలస అతన్ని ఏడుకోడం జరుగని పనిట. విరిక్తత, ఏదీ అంటకపోవటం ఇదీ ఇన్ని యుగాల్నుంచి, ఈ దేశం బోధించేది. చివరికి గాంధీగారు బోధించింది. భగవద్గీత. అది కలలో గూడ అవాస్తవం అయింది. వ్యాసమైతే హర్షిస్తారు. జీవితంలో చూపిస్తే విపరీతం'[2] దీనిబట్టి శృంగారంలో ప్రతిఫలాపేక్షలేని నిష్కామాన్ని ప్రవేశపెట్టి దేశికాచారిని చలం చిత్రించాడని భావించవచ్చును.

---

**అధోజ్ఞాపికలు :**

1. చలం–మహాస్థాన్–చిన్నారావుకు వ్రాసిన లేఖ–తేది–13–9–'49.
2. చలం–మహాస్థాన్–చిన్నారావుకు వ్రాసిన లేఖ–తేది–7–3–'51.



# అనుబంధం

## నర్తకి మొదటి జాబిత

| నెం. | పుస్తకం పేరు | వివరం | రచనాకాలం | ప్రచురణకర్త |
|---|---|---|---|---|
| 1 | శశిరేఖ | నవల | 1921 | సరస్వతీ గ్రంధ మండలి |
| 2 | చిత్రాంగి | నాటకం | 1921 | సరస్వతీ గ్రంధ మండలి |
| 3 | సత్యం, శివం, సుందరం | నాటికలు | 1922 | రజత ప్రచురణ |
| 4 | దైవమిచ్చిన భార్య | నవల | 1923 | రజత ప్రచురణ |
| 5 | సావిత్రి | నాటకం | 1924 | పాండురంగ ప్రెస్ |
| 6 | పద్మరాణి | నాటికలు | 1924 | పాండురంగ ప్రెస్ |
| 7 | బిడ్డల శిక్షణ | వ్యాసాలు | 1924 | యువ ప్రచురణ |
| 8 | హరిశ్చంద్ర | నాటకం | 1924 | అభిసారికా గ్రంధమాల |
| 9 | నాటక ప్రహసనం | నాటికలు | 1924 | గోదావరి బుక్ డిపో |
| 10 | కన్నీటి కాలవ | కధలు | 1924 | పాండురంగ ప్రెస్ |
| 11 | స్త్రీ | వ్యాసాలు | 1925 | యువ |
| 12 | కర్మమిట్లా కాలింది | నవల | 1925 | యువ |
| 13 | Man and Women | వ్యాసం | 1926 | వాణీ ప్రెస్ |
| 14 | మైదానం | నవల | 1927 | యువ |
| 15 | వివాహం | నవల | 1928 | యువ |
| 16 | అదృష్టం | కధలు | 1932 | యువ |
| 17 | నాటికాగుచ్ఛం | నాటికలు | 1934 | యువ |
| 18 | చొచా | కధలు | 1934 | చలం గ్రంధమాల |
| 19 | అరుణ | నవల | 1935 | యువ |
| 20 | మృత్యువు | నాటిక | 1935 | యువ |
| 21 | జయదేవ | నాటకం | 1935 | యువ |
| 22 | పాపం | కధలు | 1936 | యువ |
| 23 | బ్రాహ్మణీకం | నవల | 1937 | యువ |

| నెం. | పుస్తకం పేరు | వివరం | రచనాకాలం | ప్రచురణకర్త |
|---|---|---|---|---|
| 24 | చలం కథలు | కథలు | 1938 | సమ్మాళ్వార్స్ |
| 25 | విడాకులు | నాటకం | 1938 | యువ |
| 26 | శశాంక | నాటకం | 1938 | సమ్మాళ్వార్స్ |
| 27 | అనుసూయ | కథలు | 1939 | యువ |
| 28 | అమీనా | నవల | 1940 | యువ |
| 29 | శాపలిని | కథలు | 1940 | అభిసారికా గ్రంథమాల |
| 30 | సినిమా జ్వరం | కథలు | 1941 | ప్రతిమా బుక్స్ |
| 31 | విచిత్ర నటీయం | కథలు | 1943 | ప్రతిమా బుక్స్ |
| 32 | హంపీ కన్యలు | నవల | 1944 | యువ |
| 33 | మ్యూజింగ్స్ | వ్యాసాలు | 1944 | యువ |
| 34 | ప్రేమ లేఖలు | వ్యాసాలు | 1944 | యువ |
| 35 | చుక్కమ్మ | కథలు | 1944 | పాండురంగ ప్రెస్ |
| 36 | ఆనందం | వ్యాసాలు | 1944 | అభిసారికా గ్రంథమాల |
| 37 | విషాదం | వ్యాసాలు | 1944 | యువ |
| 38 | త్యాగం | నాటికలు | 1944 | యువ |
| 39 | కొండడు | నాటికలు | 1945 | యువ |
| 40 | చలం ఉత్తరాలు | లేఖలు | 1945 | ప్రతిమా బుక్స్ |
| 41 | పురూరవ | నాటకం | 1947 | యువ |
| 42 | మంగమ్మ | నాటకం | 1947 | యువ |
| 43 | వాళ్ళు నలుగురు | నవల | 1949 | దేశి ప్రచురణ |
| 44 | చలం గీతాలు | గీతాలు | 1954 | మానవతిగారి ప్రచురణ |
| 45 | కల్యాణి | కథలు | 1957 | దేశ కవితా మండలి |
| 46 | చలం నాటికలు | నాటికలు | 1957 | దేశ కవితా మండలి |
| 47 | జీవితాదర్శం | నవల | 1958 | దేశ కవితా మండలి |
| 48 | గీతాంజలి | అనువాదం | 1958 | మైత్రి గ్రంథమాల |
| 49 | చలం లేఖలు | ఉత్తరాలు | 1959 | కురంగేశ్వర్ ప్రచురణ |
| 50 | బుజ్జిగాడు | డైరీ | 1960 | ప్రజా ప్రచురణ |

| నెం. | పుస్తకం పేరు | వివరం | రచనాకాలం | ప్రచురణకర్త |
|---|---|---|---|---|
| 51 | ఉమర్ ఖయ్యామ్ | అనువాదం | 1960 | బుక్ సెంటర్ |
| 52 | మహాస్థాన్ | ఉత్తరాలు | 1960 | ప్రజా ప్రచురణ |
| 53 | ఆత్మార్పణ | కథలు | 1960 | ప్రజా ప్రచురణ |
| 54 | కవి హృదయం | వ్యాసాలు | 1961 | బుక్ సెంటర్ |
| 55 | సుధ | గీతాలు | 1961 | బుక్ సెంటర్ |
| 56 | జీసస్ జీవితం | — | 1961 | రమణస్థాన్ |
| 57 | కొత్త చిగుళ్ళు | కథలు | 1962 | రమణస్థాన్ |
| 58 | వెలుగు రవ్వలు | కథలు | 1963 | రమణస్థాన్ |
| 59 | మార్తా | నవల | 1963 | రమణస్థాన్ |
| 60 | స్వీకల్పం | వ్యాసాలు | 1963 | రమణస్థాన్ |
| 61 | ఆ రాత్రి | కథలు | 1963 | రమణస్థాన్ |
| 62 | భగవాన్ స్మృతులు | వ్యాసాలు | 1963 | రమణస్థాన్ |
| 63 | ఉత్తరణ | అనువాదం | 1963 | ఓ. రంగేశ్వర్ ప్రచురణ |
| 64 | రమణస్థాన్ | ఉత్తరాలు | 1965 | వాహినీ పబ్లిషింగ్ హౌస్ |
| 65 | శుభ వార్తలు | అనువాదం | 1966 | రమణస్థాన్ |
| 66 | భగవద్గీత | — | 1966 | ప్రేమ్‌చంద్ |
| 67 | ఫలసేకరణ | అనువాదం | 1967 | రమణస్థాన్ |
| 68 | Modern telugu short stories | కథలు | 1968 | జైకో |
| 69 | యముని ముందు చలం | నాటిక | 1970 | యమ్. శేషాచలం |
| 0 | అక్షర మణిమాల | అనువాదం | 1973 | కరుణజ్యోతి ఆశ్రమం |
| 71 | చలం జీవితం | — | 1973 | రమణస్థాన్ |
| 72 | చలం కలం వెలుగులు | వ్యాసాలు | 1974 | రమణస్థాన్ |
| 73 | చలం సాహిత్య సుమాలు | కొటేషన్లు | 1974 | రమణస్థాన్ |
| 74 | వనవాలి | అనువాదం | 1970 | రమణస్థాన్ |
| 75 | కాన్క | అనువాదం | 1971 | అరుణా పబ్లికేషన్స్ |
| 76 | ధర్మసాధని (సౌరిస్) | వ్యాసాలు | — | అరుణా పబ్లికేషన్స్ |

## నర్తకి రెండవ జాబిత

1. చొ చొ 92 పేజీలు వెల 10 అణాలు అచ్చయిన కాలం 1934
(ఆడవాళ్ళ ఆకలి, ఈర్ష్య, ఇంజక్షన్‌లు, ఆత్మ సంపర్కం, తెలుగు నవల, అద్మీ ఫిలిమ్–ఆంధ్రదేశము, దొంగలున్నారు జాగ్రత్త.)

2 పాపం 138 పేజీలు వెల 1–50 అచ్చయినకాలం పునర్ముద్రణ 1957
(మోసం చేసిందా, ఒంటరితనం, నేను మా ఆవిడా మిగిలాం, అమ్మగారి అవసరం; అవసరంలేని ఆపరేషన్, అవతారమా, ఎదగనేలేదు, భాషన్నా తెలియదు మచ్చలు. ఓరే వెంకటాచలం, ఆమె త్యాగం.)

3 చలం కథలు 164 పేజీలు వెల 2–50 అచ్చయినకాలం పు.ము. 1971
(ఆ రాత్రి, ఆరంభించరు, పాపఫలాలు, రామభక్తుడు, అప్పుడు–ఇప్పుడు, హరిజన సమస్య, కళారాధన, రసపుత్రులు.)

4. విచిత్రనటీయం 192 పేజీలు వెల 2–50 అచ్చయినకాలం పు ము. 1967
(విచిత్రనటీయం, దెయ్యాలు, రావణదర్శనం, కలియుగధర్మం, పాటకచ్చేరి, నాటకం, నా మొదటి కాత్రిపు, పరిక్షలు, ఉషారాణితో ఇంటర్వ్యూ, ఆమెత్యాగం. దోషగుణం.)

5. చుక్కమ్మ 192 పేజీలు వెల 2–00 అచ్చయినకాలం 1957.
(చుక్కమ్మ, మనోహర ప్రతిజ్ఞ, సీతయ్య, బిడ్డ, ఆత్మహత్య, లంచం, లక్ష్మీదేవి (అనువాదాలు) సౌరిస్‌కిలేఖ, పిన్నికి లేఖ, సినిమా ప్రియులు, శేషమ్మ, ఆర్గ్యుమెంట్, ఋషులు–యోగులు, అద్మీ ఫిలిమ్, హరిజన విద్యార్థి, ఏం తప్పు. (అనుభవాలు)

6. కల్యాణి 140 పేజీలు వెల 1–50 అచ్చయినకాలం పు ము. 1957.
(కల్యాణి, ముక్కాలుపీట, మర్యాదస్తునికో కథ, దోషగుణం)

7. ఆత్మార్పణ 163 పేజీలు వెల 2–50 ఐదో ముద్రణ 1960
(ఆత్మార్పణ, ఈ లోకం, పతివ్రత, 1960 (౧౯౬౦)హిందూ-ముసల్మాన్)

8. కొత్త చిగుళ్ళు 118 పేజీలు వెల 2–00 అచ్చయినకాలం 1962.
(వెన్నెల తోటలు, ఎందుకు, కొత్తచిగుళ్ళు, కర్మఫలం, శమంతకమణితో ఇంటర్వ్యూ).

9. నాటికాగుచ్ఛం 110 పేజీలు వెల 1–25
(రంగదాసు, చుక్కమ్మ, శీత, పోలీసు, దొంగ.)

10. జయదేవ 74 పేజీలు వెల 1–00

11. త్యాగం 136 పేజీలు వెల 1–50

12. కొండడు 148 పేజీలు వెల 1–50
(కొండడు, తెలుగు నవల, చివరి కుండ, స్వర్గ–నరకాలు, జానకి సమస్య)



# 1. నవలలు (అకారాదిక్రమంలో)

[సంకేత వివరణలు
చ జీ సా. — చలం జీవితం. సాహిత్యం—గొర్రెపాటి వెంకటసుబ్బయ్య
ప్ర. ము. — ప్రథమ ముద్రణ
త ము — తరువాతి ముద్రణలు
ప్ర. ప్ర. — ప్రస్తుత ప్రచురణ]

**1. అమీనా :** రచనాకాలం[1] : **1924; 1942**

ప్ర ము[2] : **1926. 1–2** భాగాలు; **1942. 3–4** భాగాలు

త. ము : **1955**—నవంబర్; దేశిప్రచురణ; క్రౌన్ సైజ్; పుటలు **88**; వెల: **1–00**

ప్ర. ప్ర · **1969**—డిసెంబర్; యం. శేషాచలం & కం. ముద్రణ: వెల్డన్ ప్రెస్, మద్రాస్; క్రౌన్ సైజు; పుటలు—**104**; వెల: **3–50**

---

1. చ. జీ. సా —పుట—**560** మరియు డా బి. వి. కుటుంబరావు, 'ఆంధ్ర నవలా పరిణామము' పుట—**332**ను బట్టి ఈ నవలలోని మొదటి రెండు భాగాల రచనా కాలం **1924** అనీ, చివరి రెండు భాగాల రచనాకాలం **1942** అని తెలుస్తున్నది. ఈ కాలాన్నే గ్రహించాను వర్తకి తన మొదటి జాబితాలో రచనాకాలం **1940** అని తెలిపింది దేశి ప్రచురణ వారిచే **1955**న ప్రచురింపబడినటువంటి నవలలో రచనాకాలం **1948** అని తెలిపారు. శ్రీ ఆర్. ఎస్. సుదర్శనంగారు 'సాహిత్య లో దృక్పథాలు' అన్న గ్రంథంలో **148**—పుటలో 'మొదటి రెండు భాగాలు **1926**లోనూ, తర్వాతి రెండు భాగాలు **1942**లోనూ వ్రాయబడినవి' అని వ్రాసారు

2 చ జీ సా —పుట—**558**లో ప్రథమంగా **1926**లో మొదటి రెండు భాగాలు, **1942**లో చివరి రెండు భాగాలు ప్రచురింపబడినవని తెలిపారు. కానీ ప్రస్తుత ముద్రణలో 'Originally Published 1928' అని వ్రాసి ఉంది

**2. అరుణ :** రచనాకాలం : 1935

ప్ర. ము[2] : 1939

త. ము[3] · 1955–దేశీ ప్రచురణ; వెల 1–00

ప్ర. ప్ర : 1971–జులై ; యం శేషాచలం & కం , ప్రింటర్స్: వెల్డన్ ప్రెస్. మద్రాస్–21; పుటలు: 120; వెల 3–50

---

1. అ) నర్తకి మొదటి జాబితా.
   ఆ) డా బి వి కుటుంబరావు–ఆంధ్ర నవలా పరిణామము–పుట–401.
2. చ. జీ. సా. పుటలు–558, 560–గొర్రెపాటివారు ప్రచురణ కాలాన్నే రచనా కాలంగా భావించారని తోస్తుంది.
3. వరంగల్ వాసవి గ్రంథాలయం. స్టాకు రిజిష్టరులో క్రమసంఖ్య 139 గ్రంథాలయంలో పుస్తకం లేదు.

---

**3. జీవితాదర్శం :** రచనాకాలం : 1948

ప్ర. ము[2] : 1955–దేశీ ప్రచురణ; వెల 1–4–0

త. ము[3] : 1958–దేశీ ప్రచురణ

ప్ర. ప్ర · 1968. అక్టోబర్; యం శేషాచలం & కం పాకెట్ సైజు; ప్రింటర్స్ ఫ్రీడం ప్రెస్, మద్రాస్–21 పుటలు 128; వెల 2-00

---

1. చ. జీ. సా. పుటలు–560

2,3 దీని ప్రచురణ కాలాన్ని గొర్రెపాటివారు తమ చ. జీ సా పుట–559లో 1958 అని తెలిపారు నర్తకి మొదటి జాబితాలో దీని రచనాకాలం 1958 అని తెలిపింది. ఈమె ప్రచురణ కాలాన్ని, రచనాకాలంగా భావించియుండవచ్చు. కాబట్టి ఇది ద్వితీయ ముద్రణ అయియుండవచ్చు. వరంగల్ వాసవి గ్రంథాలయం స్టాకు రిజిష్టరులోని క్రమసంఖ్య 429 దానిలోని వివరాలు

---

**4. దైవమిచ్చిన భార్య :** రచనాకాలం[1] : 1923

ప్ర. ము[2] : 1923

త. ము : 1) 1965; గోపాలకృష్ణ పబ్లికేషన్స్, విజయవాడ; పుటలు—158
వెల 3—00[3]
2) 1968—మార్చి; యం. శేషాచలం & కం.[4]
ప్ర. ప్ర : 1971—సెప్టెంబర్, యం. శేషాచలం & కం., పాకెట్ సైజు;
హిందూ ప్రెస్, మచిలీపట్నం; పుటలు—124; వెల 3—50

---

1. అ) నర్తకి మొదటి జాబితా. ఆ) చ. జీ. సా. పుట—560
2. చ. జీ. సా. పుట—557.
3 హనుమకొండ, ప్రాంతీయ గ్రంధాలయం. స్టాకు రిజిష్టర్‌లోని వివరాలు. గ్రంధాలయంలో పుస్తకం లభించలేదు
4 1971 సెప్టెంబర్‌లోని వివరాలు.

---

5. బ్రాహ్మణీకం : రచనాకాలం : 1937.
ప్ర ము[2]: 1937
త. ము[3]: 1964; ప్రేంచంద్ పబ్లికేషన్స్, విజయవాడ; పుటలు—132;
వెల 2-00
ప్ర ప్ర 1969—నవంబర్; యం. శేషాచలం & కం; ముద్రణ: వెల్డన్
ప్రెస్, మద్రాస్-21; క్రౌన్ సైజు; పుటలు-84; వెల 3-50

---

1. అ) నర్తకి మొదటి జాబితా
ఆ) చ జీ సా పుట—560
2. చ. జీ సా. పుటలు-580.
3 హనుమకొండ ప్రాంతీయ గ్రంధాలయం స్టాకు రిజిష్టరులోని వివరాలు.
గ్రంధాలయంలో పుస్తకం లేదు.

---

6. మార్తా:[1] రచనాకాలం[2]: 1963
ప్ర ము: 1963
త. ము: —

ప్రి. ప్రి.: 1963-ఏప్రిల్; రమణస్థాన్ ప్రచురణలు; పబ్లిషర్స్: పి. వి. కె. రాజు; ప్రింటర్స్: రవీంద్ర, పాలకొల్లు; క్రౌన్ సైజు: పుటలు-244; వెల 5-00

---

1 'మార్తా' అనబడే ఈ నవలలో చలం, ఏసునిజతత్వం బైబిల్ క్రొత్త నిబంధన లోని సంఘటనల ఆధారంగా కథారూపకంగా చిత్రించాడు. అందుకొరకే ఈ నవల ఇతివృత్తరీత్యా స్వతంత్ర రచనకాదని, దీనిలోని కథను తెలిపి, విషయవిచారణ గావించలేదు.

ఇందులో మార్తా, మరియ అనబడే అక్కచెల్లెళ్ళు ఏసు భక్తురాండ్రుగా మారిపోతారు. వీరి సోదరుడు లాజర్, పరిసయ్యలతోపాటు ఏసును మొదలు ద్వేషించినా, తరువాత అతని భక్తునిగా మారిపోతాడు. తరువాత లాజర్ చనిపోగా ఏసు అతనిని బ్రతికించాడు.

వేశ్య అయిన మగ్దలేను మరియ, ఆమె ప్రియుడు తడయస్ తమ ప్రవృత్తు లను మార్చుకొని ఏసు శిష్యులుగా మారిపోతాడు

ఏసు శిష్యులలో ఒక్కడైనా ఇస్కారియత్ యూదా అనేవాడు ఏసును అతని శత్రువులకు పట్టించాడు. తరువాత ఏసును సిలువవేసి చంపారు. ఇది దీనిలోనికథ

2. నర్తకి మొదటి జాబితా.

---

7. మైదానం: రచనాకాలం[1]: 1927.

ప్ర. ము[2]. 1927

త ము: 1) 1956; దేశీ ప్రచురణ; వెల 1-40[3]

2) 1962; విశాఖపట్నం బుక్ సెంటర్[4]

3) 1969; యం. శేషాచలం & కం, [5]

ప్ర. ప్ర. 1976-అక్టోబర్; యం శేషాచలం & కం పాకెట్ సైజు; ప్రింటర్స్: హిందూప్రెస్, మచిలీపట్నం; పుటలు 106; వెల3-50

---

1 అ) నర్తకి మొదటి జాబితా ఆ) చ. జీ సా. పుటలు-560

2 చ. జీ సా. పుటలు-558.

3. వరంగల్ వాసవి గ్రంథాలయం, స్టాకు రిజిష్టరు సంఖ్య 454. గ్రంథాలయంలో పుస్తకం లేదు.
4. హనుమకొండ ప్రాంతీయ గ్రంథాలయం స్టాకు రిజిష్టర్ సంఖ్య 295. గ్రంథాలయంలో పుస్తకం లేదు
5. ప్రస్తుత ముద్రణలోని వివరాలు.

---

**8. వివాహం:** రచనాకాలం[1] : 1928

ప్ర. ము[2] : తెలియదు

త. ము : 1) దేశీ ప్రచురణ; వెల 1–00[3]

2) 1964; వాహినీ పబ్లిషింగ్ హౌజ్; విజయవాడ 4

ప్ర ప్ర : 1971–జులై; యం. శేషాచలం & కం;

ప్రింటర్స్: కాంతి ప్రెస్, మద్రాస్-1; పుటలు–92; వెల 3-50

---

1. అ) నర్తకి మొదటి జాబితా ఆ) చ జీ. సా. పుట–560
2. చ. జీ. సా. పుట–558లో 1928 ప్రథమ ప్రచురణ కాలమని తెలిపారు. ప్రస్తుత ప్రచురణలో 1938లో మొదలు ప్రచురింపబడిందని తెలిపారు.
3. వరంగల్ వాసవి గ్రంథాలయ స్టాకు రిజిష్టరు క్రమసంఖ్య 1500. గ్రంథాలయంలో పుస్తకం లేదు.
4. వరంగల్ వాసవి గ్రంథాలయ స్టాకు రిజిష్టర్‌లోని వివరాలు. గ్రంథాలయంలో పుస్తకం లేదు.

---

**9. శశిరేఖ:** రచనాకాలం[1] : 1921

ప్ర. ము[2] : 1926; సరస్వతీ గ్రంథ మండలి

త. ము : ద్వి. ము : 1941[3] తృ. ము : 1947[4]

ప్ర ప్ర : 1972–మే; యం. శేషాచలం & కం., ప్రింటర్స్ : వెల్డన్ ప్రెస్, మద్రాస్; పాకెట్ బుక్ సైజు; పుటలు–189; వెల 3-50

---

1. సృజన మే–1968 పుట–9.
2 అ) నర్తకి మొదటి జాబితా. ఆ) చ. జీ. సా. పుట–555
3,4. ప్రస్తుత ప్రచురణలోని వివరాలు.

# 2. కథలు (అకారాదిక్రమంలో)

| క్ర సం. | కథ పేరు | సంపుటి పేరు |
|---|---|---|
| 1 | అట్లపిండి[1] | చిత్రగుప్త |
| 2 | అదృష్టం | అదృష్టం |
| 3 | అనసూయ | అనసూయ |
| 4 | అప్పుడూ—ఇప్పుడూ | ఆ రాత్రి |
| 5 | అభినవ సారంగడు | చలంగారి కలం—స్టేషన్ పంపు |
| 6 | అమ్మగారి అవసరం | పాపం |
| 7 | అవతారమా | పాపం |
| 8 | అవసరంలేని ఆపరేషన్ | పాపం |
| 9 | అద్మీ ఫిలిం—ఆంధ్రదేశం[2] | చుక్కమ్మ; చౌ—చౌ |
| 10 | ఆత్మహత్య | చుక్కమ్మ |
| 11 | ఆత్మార్పణ | ఆత్మార్పణ |
| 12 | ఆమె త్యాగం | పాపం; విచిత్రనళీయం |
| 13 | ఆమె పెదవులు | చలంగారి కలం—స్టేషన్ పంపు |
| 14 | ఆ రాత్రి | ఆ రాత్రి; చలం కథలు |
| 15 | ఆర్గ్యుమెంటు | చుక్కమ్మ; 'అరుణ' నవలకు అనుబంధంగా చేర్చబడింది (ఎమెస్కో ప్రచురణ) |
| 16 | ఆశా కురుపు | అదృష్టం |
| 17 | ఈ లోకం | ఆత్మార్పణ |
| 18 | ఉషారాణితో ఇంటర్వ్యూ | విచిత్రనళీయం |
| 19 | రుక్మిణి[3] | కన్నీటి కాలవ |
| 20 | రుషులు—యోగులు | చుక్కమ్మ |
| 21 | ఒరేయ్ వెంకటచలం | చలంగారి కలం—స్టేషన్ పంపు; పాపం |
| 22 | ఎందుకు | కొత్త చిగుళ్ళు |
| 23 | ఎదగనే లేదు | పాపం |

- చలం నవలలు

| | | |
|---|---|---|
| 24 | ఎరికలమ్మ | అనసూయ |
| 25 | ఏం తప్పు (అనుభవాలు[4]) | చుక్కమ్మ; చౌ—చౌ |
| 26 | ఒంటరితనం | పాపం |
| 27 | ఓ పువ్వు పూసింది[5] | ఓ పువ్వు పూసింది; మైదానం (నవల) |
| 28 | కన్నీటి కాలువ | కన్నీటి కాలువ |
| 29 | కర్మ ఫలం | కొత్త చిగుళ్ళు |
| 30 | కర్మమిట్లా కాలింది | కర్మమిట్లా కాలింది |
| 31 | కలియుగ ధర్మం | విచిత్రనళీయం |
| 32 | కళారాధన | ఆ రాత్రి; చలం కథలు |
| 33 | కల్యాణి[6] | కల్యాణి; వివాహం |
| 34 | కొత్త చిగుళ్ళు | కొత్త చిగుళ్ళు |
| 35 | చిగురు గౌను | అదృష్టం |
| 36 | చుక్కమ్మ | చుక్కమ్మ |
| 37 | జెలసీ | చలంగారి కలం—స్టేషన్ పంపు |
| 38 | తరుణుల చిత్తంబు[7] | వివాహం (నవల) |
| 39 | దెయ్యమేనా | చలంగారి కలం—స్టేషన్ పంపు |
| 40 | దెయ్యాలు | విచిత్రనళీయం |
| 41 | దోష గుణం | విచిత్రనళీయం; కల్యాణి |
| 42 | నాటకం | విచిత్రనళీయం |
| 43 | నా మొదటి క్రాపు పరీక్షలు | విచిత్రనళీయం |
| 44 | నాయుడి పిల్ల[8] | నాయుడి పిల్ల |
| 45 | నేనూ, మా ఆవిడ మిగిలాం | పాపం |
| 46 | నేనేం చేశాను | ఓ పువ్వు పూసింది; అనసూయ |
| 47 | 1960 | ఆత్మార్పణ |
| 48 | పతివ్రతలు | ఆత్మార్పణ |
| 49 | పాట కచేరి | విచిత్రనళీయం |
| 50 | పాప ఫలాలు | ఆ రాత్రి; చలం కథలు |
| 51 | పాపం | పాపం |

| | | |
|---|---|---|
| 52 | పిన్నికి లేఖ | చుక్కమ్మ |
| 53 | పెదరాసి పెద్దమ్మ[9] | చిత్రగుప్త |
| 54 | ప్రేమ పర్యవసానం | అదృష్టం |
| 55 | బిడ్డ | చుక్కమ్మ |
| 56 | భాషన్నా తెలీదు | పాపం |
| 57 | భోగం మేళం[10] | బ్రాహ్మణీకం |
| 58 | మచ్చలు | పాపం |
| 59 | మనోహర ప్రతిజ్ఞ | చుక్కమ్మ |
| 60 | మణి | చలంగారి కలం—స్టేషన్ పంపు |
| 61 | మర్యాదస్తునికో కథ | చలంగారి కలం—స్టేషన్ పంపు; కల్యాణి |
| 62 | మామగారి మర్యాద | అదృష్టం |
| 63 | ముక్కాలు పీట | చలంగారి కలం—స్టేషన్ పంపు; కల్యాణి |
| 64 | ముక్తి మార్గం | అనుసూయ |
| 65 | మోసం చేసిందా | పాపం |
| 66 | యవనవ్వనం | హంపీ కన్యలు |
| 67 | యవ్వనవనం[11] | యవ్వనవనం |
| 68 | రసపుత్రులు | ఆ రాత్రి; చలం కథలు |
| 69 | రామ భక్తుడు | ఆ రాత్రి; చలం కథలు |
| 70 | రావణ దర్శనం | విచిత్రనళీయం |
| 71 | రెడ్డి రంగమ్మ[12] | సమదర్శిని (పత్రిక) |
| 72 | లక్ష్మీదేవి (అనువాదాలు) | చుక్కమ్మ |
| 73 | లంచం | చుక్కమ్మ |
| 74 | లిల్లీతో స్నేహం ఎలాఅయిందంటే | చలంగారి కలం—స్టేషన్ పంపు |
| 75 | వాళ్ళు నలుగురు | హంపీ కన్యలు |
| 76 | వాణి—ఏ స్టడీ | అనుసూయ |
| 77 | విచిత్రనళీయం | విచిత్రనళీయం |
| 78 | వెన్నెల తోటలు | కొత్త చిగుళ్ళు |
| 79 | వేదాంతం | అనుసూయ |

